రచించారు. ఈ ప్రక్రియల్నిబట్టి కూడా కొన్ని మార్పులు జరిగాయి. అంతేకాక సమకాలిక నీతిధర్మాలకు అనుగుణంగా, ప్రజల అభిరుచిని అనుసరించి ఒక్కొక్కసారి అద్భుత చమత్కారం సాధించటం కోసం కథలో మార్పులు, చేర్పులు చోటు చేసుకున్నాయి.

ఎన్ని మార్పులకు లోనైనా వాల్మీకి రామాయణంలోని ప్రధాన కథను దేశభాషల్లోని రామాయణాలు చిత్రీకరించాయి. వాల్మీకి రచించిన రామాయణం భారతీయ ధార్మిక, నైతిక, గార్హస్థ్య జీవితానికి అద్దం పడుతూంది. మాతాపితల, సోదర, మిత్ర, సేవక, పరిజన, పతి, పత్నీ ధర్మాలను ఈ కావ్యం కాంతాసమ్మితంగా వ్యక్తీకరించింది. ఈ ప్రధానాంశాలను వీలైనంత మేరకు ప్రతికవి అనుసరించాడు.

శ్రీ త్యాగరాజు, రామదాసు తమ సంకీర్తనల్లో, తులసీదాస్, కబీర్‌దాస్ తమ కృతుల్లో రాముణ్ణి నవవిధ భక్తిమార్గాలద్వారా స్తుతించారు, ఆరాధించారు. సినిమాలు, నాటకాలు, జానపదగేయాలు, పాటలు, తత్త్వగీతాలు మొదలైనవాటిల్లో రామాయణేతివృత్తం చోటు చేసుకుంది. విభిన్న భాషలు, విభిన్నజాతులున్న ఈ ఉపఖండాన్ని అఖండ సామ్రాజ్యంగా భావించటానికి, దేశప్రజలందరూ ఆత్మబంధువులుగా పరిగణించటానికి రామాయణం వహించిన పాత్ర అమోఘం. భారతదేశంలో ఏ ప్రాంతానికి చెందినవారైనా తమ ప్రాంతంలోని ఈ చోటే సీత వనవాసం చేసిందనో, ఇదే రామ పాదమనో, రామ ప్రతిష్ఠితలింగం ఇదేననో, సీతాన్వేషణకై వచ్చిన వానరులు ఈ ప్రాంతాలలో సంచరించారనో, సీతారామలక్ష్మణులు నడయాడిన పవిత్ర ప్రదేశం ఇదేననో చెప్పడం చూస్తూనే ఉన్నాం.

బిడ్డ పుట్టింది మొదలు **'శ్రీరామరక్ష'** అనే ఆశీస్సుతో ప్రారంభమై వివాహసందర్భంలో సీతారాముల కల్యాణఘట్టం మంత్రస్మరణ, ఆదర్శ కుటుంబ జీవితంలో సీతారాముల ప్రస్తావన, మరణాసన్న సమయంలో రామనామస్మరణ - ఇలా ప్రతి హిందూమతస్థుని జీవితంలో రామనామం పెనవేసుకుంది. లక్ష్మణహనుమత్సమేత సీతారాముల చిత్రపటంతోనైనా ప్రతిగ్రామంలో ఒక మందిరం ఉండటం చూస్తున్నాం. రామభజనలు కొనసాగుతున్నాయి. 'రామ' శబ్దంతో వ్యక్తుల పేర్లు కోకొల్లలు. రామకోటి రాస్తున్న వాళ్ళూ ఎందరో ఉన్నారు.

**ఇంత గాఢంగా రాముడు భారతీయుల హృదయాల్లో నాటుకుపోయినప్పుడు ...!**
**మళ్ళీ ఈ రామాయణం ఎందుకు....???**

ఇన్నిరకాలుగా వ్యాప్తమైన రామగాథ ఆధునికులైన చదువరులు చాలామందికి స్థూలంగానైనా తెలియకపోవటం విచిత్రం. సాహిత్యాధ్యయనం చేస్తున్న విద్యార్థుల్లోసైతం కట్టె-కొట్టె-తెచ్చె అనే రీతిలోనే పలువురి జ్ఞానం పరిమితమై ఉంది.



శ్రీః

# శ్రీరామ చరితం

డా॥ గాలి గుణశేఖర్



ప్రకాశకులు
శ్రీమతి **రావి కృష్ణకుమారి**
**4-103, I.L.T.D. Colony, Extn., Kothapet, CHIRALA - 523 157**
**Prakasam District, A.P.**

శ్రీః

# శ్రీరామ చరితం

**డా॥ గాలి గుణశేఖర్**

ప్రథమముద్రణ :- వికృతి నామ సంవత్సర **"శ్రీరామనవమి"** పర్వదినం
ది.24-03-2010

ప్రతులు : 500

పేజీలు : 136

వెల రూ. : 50-00


4-103, I.L.T.D. Colony, Extn.,
Kothapet, CHIRALA - 523 157
Cell: **94401 15411**

ప్రతులకు:

**Dr. GALI GUNASEKHAR,**
*M.A., M.Phil., Ph.D.(Telugu), M.A. (Tamil), M.A. (Eng.), Kovida (Sanskrit), D.i.Tr.*
Principal,
K.R.K. Govt. Degree College,
ADDANKI - 523 201
Cell: **93937 26790**

***D.T.P. by :-***
**J. RAJA**
**Ganesh Graphics**,
CHIRALA.
Cell : 98483 90564

***Printed at :-***
**KARSHAK ART PRINTERS,**
HYDERABAD.



# మరల ఇదేల రామాయణం బన్నచో...

రామాయణం భారత సంస్కృతికి దర్పణం. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు భారత సంస్కృతి పటిష్టతకు ఎంతగానో సహకరించాయి. అన్నిటి లక్ష్యం ఉత్తమాదర్శజీవన నిర్దేశం. క్లిష్టతరమైన వేదాది గ్రంథాల అధ్యయనం గొప్పచదువరులకే అసాధ్యం. అందుకే దయార్ద్రహృదయులైన మహర్షులు వ్యాస వాల్మీకులు పంచమ వేదంగా భారతాన్ని, సకల వేదసారంగా రామాయణాన్ని మానవాళికి అందించారు.

సంస్కృతంలోని శ్రీమద్రామాయణం ఆదికావ్యం. వాల్మీకి మహర్షి అనుగ్రహించిన అక్షయమైన అమృతభాండం. ఎవరెంతగా ఆస్వాదించగలిగితే అంతగా ఆనందపరవశులు కావచ్చు. ఋషితుల్యులైన కవులు కారణంగా రామాయణం ప్రజల భాషల్లోకి అనువదింప బడింది. శతాబ్దాలుగా వందలాది కవులు రామాయణ సుధను తమ శక్తిమేరకు ప్రజలకు అందిస్తూ వచ్చారు. ప్రతిభాషలోను ఎన్నో రామాయణాలు వెలువడ్డాయి. ఎన్నో కల్పనలు చోటు చేసుకున్నాయి. కొన్ని అద్భుత గాథలు; తెలుగు భాషలో సైతం ప్రతి శతాబ్దంలో కనీసం ఒక రామాయణమైనా వెలువడుతూ వచ్చింది. కవులు వస్తుసంబంధిగా (ఆధ్యాత్మ రామాయణం), భాషావిషయంగా (అచ్చ తెలుగు రామాయణం, నిరోష్ఠ్యరామాయణం మొదలైనవి), రూపసంబంధిగా (నిర్వచనోత్తర రామాయణం) పలు వైవిధ్యాలను ప్రదర్శించారు. 20వ శతాబ్దంలో అసంఖ్యాక రామాయణ గ్రంథాలు వెలువడ్డాయి. సామాన్య పాఠకుడికి అర్థమయ్యేరీతిలో అనేక వచన రామాయణాలు వెలుగు చూశాయి.

వ్యక్తుల జీవన గమనాన్ని, గుణగణాలను తీర్చిదిద్దగల రామాయణగాథ భారతదేశం లోని అన్ని ప్రాంతాల్లోనేకాక, ఖండాతరాల్లోనూ ప్రాచీనకాలంలోనే వ్యాప్తిగాంచింది. అలా వ్యాప్తి చెందే సమయంలో ఆ కథ కాల ప్రాంత భేదాలను బట్టి ఎన్నో రూపాలను సంతరించు కుంది. వివిధ ఆస్తిక, నాస్తిక మతాల ప్రభావంలో ప్రాంతీయ భేదాలకు అనుగుణంగా పలురూపాలు దాల్చింది.

టిబెట్, చైనా, మంగోలియా, జపాన్, థాయిలాండ్, కంపూచియా, బర్మా, సింహళం, ఇండోనేషియా వంటి సుదూర ప్రాంతాలకు వ్యాపించి ఆయాదేశ ఆచార వ్యవహారాలకు అనుగుణంగా మార్పు చెందింది. ప్రతిదేశంలోను ఆయా జానపద కథల, పాత్రల ప్రభావం కూడా రామాయణ కథ, పాత్రలమీద కన్పిస్తుంది. వాల్మీకిరామాయణ కథను కథాఘట్టాలను తీసికొని తర్వాతి సంస్కృతకవులు, దేశభాషా కవులు కావ్యాలు, నాటకాలుగా(రూపకాలుగా)

### కథా ప్రారంభం

రామాయణం నారద వాల్మీకుల సంవాదంతో మొదలవుతుంది. బ్రహ్మనిష్ఠుడైన వాల్మీకి వేదాధ్యయన నిరతుడు, వ్యాకరణవేత్తలలో శ్రేష్ఠుడు, మునిశ్రేష్ఠుడూ అయిన నారదుణ్ణి ఇలా ప్రశ్నించాడు –

“మహర్షీ! – ఈ లోకంలో సద్గుణవంతుడు, వీరుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవాక్యపరిపాలకుడు, దృఢవ్రతుడు, సదాచార సంపన్నుడు, సర్వప్రాణులకు హితం కూర్చేవాడు, విద్వాంసుడు, సమర్థుడు, ప్రియదర్శనుడు (తన దర్శనంవల్ల ఇతరులకు సంతోషం కలిగించేవాడు), ధైర్యశాలి, కోపాన్ని జయించినవాడు, శోభాయమానుడు, అసూయలేనివాడు, యుద్ధరంగంలో కోపిస్తే దేవాసురుల్ని సైతం భయకంపితుల్ని చెయ్యగల మహాపురుషుడు ఎవరు?”

‘ఓ మునీ! ఉదాత్తగుణాలన్నీ ఒకరిలోనే ఉండటం దుర్లభం. అయినా స్మృతికి తెచ్చుకొని అటువంటి వ్యక్తి వృత్తాంతం చెబుతాను విను’ అని రామాయణగాథను సంక్షిప్తంగా చెప్పి, సత్కారం పొంది, ఆకాశమార్గంలో వెళ్ళాడు.

### శోకం – శ్లోకం

నారదుడు నిష్క్రమించిన పిదప వాల్మీకి భరద్వాజుడనే శిష్యుడితో గంగానది సమీపం లోని తమసానదీతీరానికి చేరుకున్నాడు. స్వచ్ఛమైన ఆ నీటిలో స్నానం చెయ్యడానికి వెళ్తూ చుట్టూ ఉన్న మనోహరమైన, విశాలమైన, దివ్యమైన అందంతో అలరారాతున్న వనాన్ని చూస్తూ ఆశ్చర్యానికి లోనయ్యాడు. ఆనందానుభూతిలో క్షణకాలమైనా ఎడబాటు సహించనట్లు ప్రవర్తిస్తున్న క్రౌంచపక్షుల జంటను తిలకించాడు. అలా చూస్తుండగానే ఆ జంటలోని మగపక్షిని కిరాతుడు ఒకడు బాణంతో కొట్టాడు. బాధతో కొట్టుకుంటున్న మగపక్షిని చూసి, ఆడపక్షి బాధతో విలవిలలాడింది. హృదయవిదారకమైన ఆ సన్నివేశాన్ని చూసి వాల్మీకి ఉద్వేగంతో బోయవాణ్ణి ఇలా శపించాడు.

**శ్లో॥ *మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః ।***
***యత్ క్రౌంచ మిథునాదేకమవధీః కామమోహితమ్ ॥*** *(బాల. 2-16)*

“ఓ కిరాతుడా! కామపరవశంతో ఉన్న క్రౌంచపక్షుల జంటలో ఒకదాన్ని చంపి శాశ్వతమైన అపకీర్తి పొందావు.”

శోకంలో తన నోటివెంట వెలువడిన మాటల సముదాయం గురించి ఆలోచించి, తన శిష్యుడితో “సమానాక్షరాలలో, లయబద్ధంగా, గానంచెయ్యడానికి అనువుగా ఉంది. ఇది ఛందోబద్ధమైన శ్లోకమే” అని వాల్మీకి అన్నాడు. అప్రయత్నంగా వెలువడిన ఆ శ్లోకం గురించే ఆలోచిస్తూ, ఇతర దైనందిన కార్యక్రమాలు వాల్మీకి నిర్వర్తించాడు.



మా మిత్రులు కీ॥శే॥ డాక్టర్ పి.యం.డి. రాజేంద్ర గారు (ఆంగ్లోపన్యాసకులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పుత్తూరు) ప్రమాదవశాత్తు మరణించిన తమ శ్రీమతి ప్రథమ, ద్వితీయ వర్ధంతుల సందర్భంగా నాచేత గ్రంథాలు వ్రాయించి ఆమె స్మృత్యర్థం వెలువరించారు. అవి – అక్షరాంజలి-1 (ది.03-01-2007), అక్షరాంజలి-2 (ది.03-01-2008) అనే పేర్లతో వెలువడ్డాయి. అక్షరాంజలి-2 ‘భారతభారతి’ (మహాభారత ఇతివృత్తం, కొన్ని విశేషాల పరిచయం). రచనలు భారతీయ సంస్కృతిని ప్రతిబింబించేలా, మానవీయ విలువల్ని నొక్కి చెప్పేవిధంగా ఉండాలన్నది. మా ఇద్దరి ఆశయం. తర్వాత వరుసగా రామాయణం, భాగవతాలను నాచేత వ్రాయించి వెలువరించాలని వారి ఆశయం. కాని ఆయన శ్రీమతి మూడవ వర్ధంతి రాకముందే ది.01-05-2008 న వారు కూడా పరమపదించారు.

‘భారత భారతి’ ని చదివి హర్షించిన శ్రీ రావి మోహనరావు గారు (లెక్చరర్, వి.ఆర్.యస్. & వై.ఆర్.యన్. కళాశాల, చీరాల) ‘ఆత్మజ్యోతి’ మాసపత్రికలో ధారావాహికగా ప్రచురించడానికి పూనుకున్నారు. సందర్భవశాత్తు పై నేపథ్యాన్ని వారితో ప్రస్తావించినపుడు ***‘రామాయణం వ్రాయండి – మీ మిత్రుల ఆలోచన, సంస్కారం ఉత్తమంగా ఉంది–ఆయన స్మృత్యర్థమే గ్రంథం వెలువరిద్దాం’*** అన్నారు.

రామాయణం, భారతంవంటి గ్రంథాలు మతాల కతీతంగా అవశ్యం పఠనీయాలు. సమకాలంలో అంగీకరించ లేని కొన్ని అంశాలు, కొన్ని అతిశయోక్తులు, మానవాతీతమైన సంఘటనలు రామాయణంలో ఉన్నాయి. వాల్మీకి ప్రధాన పాత్రలన్నిటినీ చాలావరకు మానవమాత్రులుగానే చిత్రీకరించాడు. రామాయణంలో వర్ణింపబడిన మానవ ప్రభు ధర్మాలు, సోదర ధర్మం, సతిపతుల ధర్మాలు, మిత్రధర్మం వంటి ఆదర్శవంతమైన అంశాలు మానవజీవితానికి మార్గదర్శకాలు. రాముడి ద్వారా వ్యక్తీకరింపబడిన ఆదర్శ జీవనం ఎవరికైనా కష్టసాధ్యమైతే కావచ్చు కాని అసాధ్యం మాత్రం కాదు.

నేటి రాజకీయ నాయకులు, పాలకులు, గురువులు, విద్యార్థులు, స్త్రీలు, పురుషులు ఎవరైనా అనుసరించదగిన అంశాలు. రామాయణం అంతటా ఉంది. అనుసరించరాని అంశాలు రావణాది పాత్రలద్వారా గ్రహించవచ్చు. ఈ భావాలు ప్రజాబాహుళ్యంలోకి ప్రతి రచన ద్వారా కొంతమేరకైనా వ్యాప్తి చెందాలి. ఈ రచన ఉద్దేశం కూడా అదే.

కావ్యాల రూపంలోను, వ్యాఖ్యానాల రూపంలోను వెలువడిన రామాయణాలు అసంఖ్యాకం. ఆధ్యాత్మపరంగా, యోగపరంగా, మరెన్నో అంతరార్థాలను, విశేషాలను వెలికితీస్తూ మహామేధావులైన పండితులు గ్రంథాలు రచించారు. విమర్శకులు ఎందరో రామాయణంపై అద్భుత పరిశోధనాత్మక వ్యాసాలు వ్రాశారు. విస్తరిస్తున్న ఐహికభోగాలు,

పెరుగుతున్న కోరికలు, పతనం అవుతున్న విలువల మధ్య అలసిపోతున్న ఆధునిక మానవుడికి ఉత్తమ గ్రంథాలను పఠించే తీరిక, ఓపిక మృగ్యం. పఠించినా తగినంత పఠనాభ్యాసంలేని కారణంగా అర్థం కావడమూ సమస్యే. కనుక తక్కువ పుటల్లో, స్థూల ఇతివృత్త పరిచయంతో, రామాయణంలోని ఘట్టాలన్నిటినీ స్పృశిస్తూ, సరళమైన భాషలో రచన ఉండాలన్నది మరో ఉద్దేశం. వచనంలో సులభశైలిలోను పలు రామాయణాలు వెలువడ్డాయి. అన్నీ అందరికీ అందుబాటులోకి రావడం కష్టం. ఈ రచన కొన్నివందల మందికైనా చేరువైతే, వాళ్ళద్వారా మరికొందరికి అవగాహన కలిగే అవకాశం ఉంది.

పై లక్ష్యాలతో కొనసాగే రచనకు నా అల్పజ్ఞానం సరిపోతుందని దృఢవిశ్వాసం – ఇవన్నీ ఈ రచనకు ప్రేరణలు.

ప్రస్తుతం నాచేత ఈ పని చేయించిన శ్రీ రావి మోహనరావుగారు వృత్తిరీత్యా భూవిజ్ఞానశాస్త్రోపన్యాసకులు. కాని వారికున్న సాహిత్యాభిలాష శ్లాఘనీయం. వారు సంస్కృతభాషకు, సాహిత్యానికి చేస్తున్న సేవ అభినందనీయం. ఉన్నతమైన సంస్కారంతో, సహృదయంతో ఈ గ్రంథ ప్రచురణకు పూనుకున్నందుకు కృతజ్ఞతాభివందనాలు.

రామసుధను పాఠకలోకానికి అందించిన ప్రతి గ్రంథకర్తకూ నమస్సుమాంజలులు. సహృదయపాఠకలోకానికి అభివాదాలు.

**'సర్వే జనాస్సుఖినో భవన్తు'**

బుధజనవిధేయుడు

**గాలి గుణశేఖర్**



శ్రీః

# శ్రీరామ చరితం

## బాలకాండం

### ఆదికవి ఆవిర్భావం

#### పూర్వాశ్రమం

**శ్లో॥ కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।**
**ఆరుహ్య కవితాశాఖం వందే వాల్మీకికోకిలమ్॥**

వాల్మీకి పూర్వాశ్రమం గురించి భిన్నకథనాలున్నాయి. ప్రసిద్ధంగా విన్పిస్తున్న కథ ఒకటి ఉంది. అతడు కిరాతుడు. తన సహచర బోయలతో కలిసి దారిదోపిడి చేసేవాడు. ఒకనాడు సప్తర్షులు ఆ దారిలో వెళ్తుండగా, వాళ్ళని అడ్డగించి కమండలాలు లాక్కోవడానికి ఆ కిరాతుడు ప్రయత్నించాడు. అప్పుడా మహర్షులు *'నీ* ***భార్యాబిడ్డల్ని పోషించటానికి ఇంతటి దుర్మార్గానికి పూనుకున్నావు. సంపదలో భాగం పంచుకున్నట్లే, నీ పాపంలోను వాళ్ళు పాలుపంచుకుంటారేమో తెలుసుకో. నువ్వు వచ్చేంతవరకు మేం ఇక్కడే ఉంటాం'*** అన్నారు.

ఋషులు వెలిబుచ్చిన సందేహాన్ని భార్యకు తెలియజేశాడు ఆ బోయ. ఆమె **"మమ్మల్ని పోషించడం నీ బాధ్యత. నీ పాపం నీదే కాని మాకు చెందదు"** అని నిర్మొహమాటంగా సమాధానం ఇచ్చింది. ఆ మాటతో కిరాతుడికి జ్ఞానోదయం అయింది. పరుగు పరుగున వెళ్ళి సప్తర్షుల పాదాలముందు వాలాడు. ముక్తిమార్గం చూపమని ప్రార్థించాడు. ఋషులు **రామ** నామాన్ని ఉపదేశించారు. (రామనామం ఉపదేశించటానికి అతడు అర్హుడు కాడని అక్షరాలను తలక్రిందులు చేసి ఉపదేశించారు.)

ఆ తర్వాత బోయవాడు స్థిరచిత్తంతో మంత్రాన్ని అనేక సంవత్సరాలు జపించ సాగాడు. అతనిపై పుట్టదట్టంగా పెరిగింది. అయినా అతను నిశ్చలంగా నామజపాన్ని కొనసాగించాడు. సప్తర్షులు చాలాకాలం తర్వాత అదే దారిలో వస్తూ ఆ పుట్టను తొలగించి అతణ్ణి వెలుపలికి తీశారు. సంస్కృతంలో 'వల్మీకం' అంటే పుట్ట. వల్మీకం నుంచి మహర్షిగా వచ్చినాడు కనుక 'వాల్మీకి' గా ప్రసిద్ధుడయ్యాడు.

పురోహితులు. వీళ్ళతోబాటు జాబాలి,సుయజ్ఞ,కాశ్యప,గౌతమ,మార్కండేయ,కాత్యాయనులు పురోహితులుగా వ్యవహరించేవాళ్ళు.

దశరథుడికి సర్వసంపదలున్నా, కీర్తిప్రతిష్ఠలున్నా వంశోద్ధారకుడు లేకపోవడంతో శోకంతో తల్లడిల్లాడు. పరితపించాడు. ఇలా తపిస్తున్న సమయంలో సంతాన ప్రాప్తికి అశ్వమేధయాగం చెయ్యడం శ్రేయస్కరం కదా! అని తోచింది. వెంటనే మంత్రి సుమంత్రుణ్ణి *(మంత్రులలో దశరథుడికి అత్యంత ఆప్తుడు)* మంత్రి పురోహితులందరినీ తీసుకురమ్మని ఆదేశించాడు. అందరూ సమావేశం అయిన తర్వాత తన మనసులోని మాటను తెలియ జేశాడు. వశిష్ఠాదిమహామునులు దశరథుడి సంకల్పాన్ని సమర్థించారు. సరయూనదికి ఉత్తర తీరంలో యజ్ఞభూమిని సిద్ధపరచమని మంత్రులను కోరిన పిదప, కౌసల్య, సుమిత్ర, కైకేయిల మందిరాలకు వెళ్ళి యజ్ఞసంకల్పాన్ని తెలియజేసి వాళ్ళనికూడా దీక్షచేపట్ట మన్నాడు.

## ఋశ్యశృంగ మహర్షి ఆగమనం - యజ్ఞ సంరంభం

మంత్రి, సారథి అయిన సుమంత్రుడు దశరథుడు రాణులతో చెప్పిన మాటలు విని ఏకాంతంలో ఆయనతో ఇలా అన్నాడు – గతంలో సనత్కుమార మహర్షి మీ పుత్ర ప్రాప్తిని గురించి ఋషుల సమక్షంలో భవిష్యత్తును గురించి చెప్పిన మాటలు విన్నాను.

కశ్యప మహర్షి పుత్రుడు విభాండకుడు. అతడి పుత్రుడు ఋశ్యశృంగుడు. తండ్రితో బాటు అరణ్యాలలోనే సంచరించడంవల్ల అక్కడి వాతావరణం, అక్కడికి వచ్చే మునులు తప్ప మరో ప్రపంచం తెలియదు. మహాబలవంతుడు, అంగరాజైన రోమపాదుడు, ఒకప్పుడు ధర్మం తప్పడంవల్ల ఆ రాజ్యమంతటా చాలకాలం అనావృష్టి ఏర్పడుతుంది. ఋశ్యశృంగుడు అడుగుపెట్టినచోట వర్షాలు కురుస్తాయని, ఎలాగైనా అతణ్ణి తీసుకువచ్చి, రోమపాదుడి కుమార్తె శాంతనిచ్చి వివాహం చెయ్యాలని వేదపండితులు రాజుకు సూచిస్తారు. వేశ్యల ద్వారా *(ఋశ్యశృంగుడు వాళ్ళు ముని కుమారులని, వక్షోజాలను చూసి తనకున్న శృంగం –రొమ్ముమీద ఒక కొమ్ము ఋశ్యశృంగుడికి ఉంది– రెండు శృంగాలని భావించాడు)* రప్పించడంతో వర్షాలు కురిసి అనావృష్టి తొలగుతుంది. ఆ తర్వాత అతనికి రోమపాదుడు తన పెంపుడు కూతురైన శాంతనిచ్చి వివాహం చేశాడు. దశరథుడు ఆ ఋశ్యశృంగ మహర్షిచేత పుత్రకామేష్టియాగం నిర్వహింపజేసి నలుగురు పుత్రుల్ని పొందుతాడు.

ఈ వివరాలన్నీ సనత్కుమారమహర్షి కృతయుగంలోనే *(రామాయణం త్రేతాయుగం నాటి కథ)* మునులతో చెప్పినట్లు సుమంత్రుడు దశరథుడికి వివరించాడు. "ఆ ఋశ్యశృంగుడు మీకూ అల్లుడే. *(శాంత కౌలస్యాదశరథుల కుమార్తె. దశరథుని మిత్రుడైన రోమపాదుడు సంతానంలేని కారణంగా తాను పెంచుకోవటానికి శాంతను తీసుకెళ్ళాడు.*



## బ్రహ్మానుగ్రహం - కావ్య జననం

ఈ సందర్భంలో సృష్టికర్త అయిన చతుర్ముఖబ్రహ్మ వాల్మీకి ఆశ్రమానికి వచ్చాడు. వాల్మీకి సంభ్రమంతో యథోచితంగా పూజాది సత్కారాలు చేశాడు. బ్రహ్మవంటివాడు తన ముందే ఆసీనుడై ఉన్నా వాల్మీకి తమసానదీతీర సంఘటన గురించే చింతిస్తూ, శ్లోకాన్ని స్మరిస్తున్నాడు.

బ్రహ్మ మందహాసం చేస్తూ, 'నువ్వు దయార్ద్రహృదయంతో పలికిన మాటలు ఛందో బద్ధమైన శ్లోకమే. శోకాన్ని విడిచిపెట్టు. నీ నుంచి వెలువడిన వాక్కు నా సంకల్పంవల్లే జరిగింది. శ్రీరామచరిత్రను ఈ ఛందస్సులోనే రచించు. సర్వం నీకు స్ఫురణకు వస్తుంది. పరమ పవిత్రమైన రామగాథ పాపహరణం, సర్వలోక పూజితమవుతుంది' అని పలికి ఇలా ఆశీర్వదించాడు –

***శ్లో॥ యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ।***
***తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి ॥*** *(బాల. 2–36)*

'ఈ భూమిపై పర్వతాలు, నదులు ఉన్నంతకాలం ఈ రామాయణకథ సర్వలోకాల లోను కీర్తింపబడుతుంది. అంతవరకు నీ కీర్తిప్రతిష్ఠలు నిలిచి ఉంటాయి.' తర్వాత బ్రహ్మ అంతర్ధానమయ్యాడు. బ్రహ్మదేవుని అనుగ్రహంతో దివ్యజ్ఞానం పొందిన వాల్మీకి కావ్యరచనకు పూనుకున్నాడు. వాల్మీకి వేదన వేదసారంగా పరిణమించింది.

## రామాయణ రచనావైశిష్ట్యం

**వాల్మీకి మహర్షి రామాయణాన్ని ఆరుకాండలుగా, అయిదు వందల సర్గలుగా ఇరవై నాలుగు వేల శ్లోకాలతో రచించాడు.** తర్వాత ఉత్తరకాండం రచించాడు. ఈ విషయం బాలకాండ నాల్గవసర్గ రెండవ శ్లోకంలో పేర్కొనబడింది. కాని ప్రస్తుతం లభిస్తున్న సంస్కృత రామాయణాలలో సర్గల, శ్లోకాల సంఖ్య భిన్నంగా కన్పిస్తున్నాయి. గీతాప్రెస్–గోరఖ్‌పూర్ వాళ్ళు ప్రచురించిన శ్రీమద్రామాయణంలో ఆరుకాండల్లో 537 సర్గలు, 20187 శ్లోకాలు ఉన్నాయి. ఉత్తరకాండలో మరో 111 సర్గలు, 3542 శ్లోకాలు ఉన్నాయి.

రామాయణంలోని బాలకాండ, ఉత్తరకాండ (ఉత్తర రామాయణగాథ) ప్రక్షిప్తాలని, వాల్మీకి కావ్యమంతా అనుష్టుప్పు ఛందస్సులోనే వ్రాశాడని, తక్కిన ఛందస్సులలో ఉన్నవి ప్రక్షిప్తాలని చెప్పే విమర్శకులు ఉన్నారు. కాని ఆనందవర్ధనుని (9వ శతాబ్దం) వంటి ఆలంకారికులు, సంప్రదాయజ్ఞులు ఉత్తరకాండతో సహా ఏడు కాండలున్న రామాయణాన్ని వాల్మీకియే రచించాడని అంగీకరించారు.

భారతంలో ఉన్నట్లు రామాయణంలో అవాంతరకథలు(ఉపకథలు) ఎక్కువగా

లేవు. అందువల్ల ఆద్యంతం ప్రధాన కథాసంఘటనలతో రామాయణగాథ సాగుతుంది. ఫలోన్ముఖ మైన వస్త్వైక్యతగల ప్రధానకథ మహాభారతంలో లేదు. అంటే కథయొక్క పరమార్థం ఏమిటో దాని సాధనకోసం, దానికి సంబంధించిన సంఘటనలే రామాయణమంతటా వర్ణింపబడింది. రామాయణ కథ సుఖాంతమే అయినా కావ్యమంతటా కరుణరసమే ఎక్కువగా పోషింపబడింది. సందర్భానుకూలంగా శృంగార, వీర, భయానక, బీభత్స, అద్భుత, హాస్య, రౌద్రరసాలు పోషింపబడ్డాయి. రామాయణం ఇతిహాసంగా భావించినా కాంతాసమ్మితంగా కావ్యగౌరవాన్ని పొందింది. మహాభారతం మనసును ఆలోచింపేటట్లు చేస్తుంది. రామాయణం హృదయాన్ని కరిగిస్తుంది.

శైలి ప్రసాదగుణభరితం. లలిత సరళపదాల కూర్పు వాల్మీకి ప్రత్యేకత. వాల్మీకి కవిత్వమంతా ధారాశుద్ధితో మాధుర్యభరితంగా పాఠకుల్ని అలరిస్తుంది. వస్తువర్ణనలో వాల్మీకి నిష్ణాతుడు. ఋతువర్ణనలు మనోహరంగా ఉంటాయి. కళ్ళముందు సాక్షాత్కరించే రీతిలో ఆయన వర్ణనలుంటాయి. వాల్మీకి వర్ణించిన పుర, ఉద్యాన, పర్వత, అరణ్య, ఋతు, చంద్రోదయ, ఆశ్రమ వర్ణనలు భారతీయ భాషల్లో వెలువడిన మహాకావ్యాల కంతటికీ ఆదర్శమైన వర్ణ్యవస్తువులయ్యాయి.

## వాల్మీకి చిత్రించిన సమకాలీన సమాజం

రామాయణకాలం నాటి సాంస్కృతిక, ధార్మిక, నైతిక, రాజకీయ, ఆర్థిక సంబంధ సమాజ స్వరూపాన్ని వాల్మీకి పలుచోట్ల చిత్రించాడు. ప్రాచీన భారతదేశంలోని సౌహార్ద్ర, పరోపకారాలతో కూడిన ప్రజల జీవితాన్ని వాల్మీకి చిత్రించిన విధానం నిరుపమానం. నాటి కుటుంబ వ్యవస్థ, జీవన విధానాలు తెలుసుకోవటానికి రామాయణం ఎంతగానో ఉపకరిస్తుంది. సమకాలీన రాజనీతి, గార్హస్థ్య జీవితంలోని నీతినియమాలు, పితృవాక్య పరిపాలన, మిత్ర,సోదరుల మధ్య ప్రేమాభిమానాలు, పతిపత్నులు మధ్య అనురాగబంధాలు, స్వార్థరహిత మానవప్రేమ, అతిథుల పట్ల ఆదరగౌరవాలు – వీటినన్నిటినీ అత్యద్భుతంగా, కళ్ళకుకట్టినట్లు వర్ణించిన వాల్మీకి కవికి భారతజాతి ఋణపడి ఉంది.

రామాయణ కాలంలో సమాజం ధార్మిక ప్రవృత్తి కలిగి ఉండేది. సత్యవాక్పాలన ప్రధాన కర్తవ్యంగా పరిగణింపబడేది. రాజు సత్యధర్మాలను అనుసరించి ఆదర్శంగా ఉండాలి. స్త్రీలకు గౌరవ సన్మానాలుండేవి. సర్వధర్మకర్మానుష్ఠానాలు భార్యతో కలిసే భర్త నిర్వహించే వాడు. కుటుంబంలో స్త్రీదే ప్రధాన పాత్ర. స్త్రీలు ధర్మపరాయణులుగా, నీతికుశలురుగా, పాండిత్యం కలవారుగా కన్పిస్తారు. పతిసేవ భార్యకు, పత్నికి సుఖసంతోషాలు కల్పించడం భర్తకు ప్రథమ కర్తవ్యాలు. కాని ధర్మాచరణ సందర్భంలో భర్త భార్యాపుత్రులనే మోహాన్ని త్యజించి కఠినంగా ప్రవర్తించగల నియమ పాలనాశక్తి వాళ్ళకుండేది.



తల్లిదండ్రులకు సంతానం మీద అపారమైనవాత్సల్యం, సంతానానికి తల్లిదండ్రులపై మిక్కిలి భక్తిగౌరవాలుండేవి. బహుభార్యాత్వం చెలామణిలో ఉన్నా పురుషుడి పరస్త్రీ వ్యామోహం గర్హింపబడేది. *(వానరసంఘంలో కొంతమేర, రాక్షససంఘంలో చాలవరకు వ్యతిరేక ధోరణులు కన్పిస్తాయి).* భార్యాభర్తల మధ్య పరస్పరం ప్రేమతోబాటు విశ్వాసం ఉండాలన్నది వాల్మీకి అభిప్రాయం. స్త్రీలకు భర్తలను వరించే హక్కు ఉండేది. కాని గాంధర్వ, ప్రణయ వివాహాలు లేవు. *(రావణుడి రాక్షస ప్రణయం తప్ప).*

ఋషులు, అరణ్యప్రాంతాలలో ఆశ్రమాలు ఏర్పరచుకొని నివసించేవారు. వారి కర్మానుష్ఠానాలు సక్రమంగా సాగేటట్లు చూసే బాధ్యత రాజుది. రాజు పురోహిత మంత్రుల సాయంతో రాజ్యపాలన చేసేవాడు. రాజు నిరంకుశంగా ప్రవర్తించేవాడు కాదు. ప్రజాభిప్రాయాన్ని గౌరవించేవాడు.

## గానగంధర్వులు – కుశలవులు

ఇటువంటి మహాకావ్యరచన చేసిన తర్వాత, తనచే రచింపబడిన రామాయణాన్ని కంఠస్థంచేసి గానం చెయ్యగల సమర్థులైన శిష్యులకోసం ఆలోచిస్తుండగా కుశలవులు వచ్చి వాల్మీకి పాదాల ముందు మోకరిల్లారు. వారిలోని మంచి లక్షణాలను, గాత్రాన్ని, గానం చెయ్యగల సమర్థతను గ్రహించి, వేదసమానమైన రామాయణాన్ని గానం చెయ్యటానికి కుశలవులకు మహర్షి ఉపదేశించాడు. వాల్మీకి ఆశ్రమంలో ఋషులందరూ సమావేశం అయిన తరుణంలో కుశలవులు గానంచేసి అందరిమెప్పును పొందారు.

కుశలవులు అయోధ్యాపురవీథుల్లో రామాయణాన్ని గానంచేస్తుండగా వారి గాన మాధుర్యాన్ని విని పులకరించి, అశ్వమేధయాగదీక్షలో *(ఉత్తరకాండలోని కథ)* ఉన్న రాముడు వాళ్ళని పిలిపించి సభలో గానం చెయ్యమని చెప్పాడు. మునివేషంలో ఉన్న రాజలక్షణాలు కల గొప్పగాయకులైన కుశలవుల గానంలో శ్రీరాముడు తన్మయత్వం చెందాడు. సభలోని వాళ్ళందరూ ఎంత విన్నా తనివితీరని వాళ్ళయ్యారు.

## అయోధ్యానగరం – దశరథుని శోకం

సరయూనదీతీరంలో **'కోసల'** అనే రాజ్యం సర్వసంపదలతో తులతూగుతూంది. దాని రాజధాని అయోధ్య. ఆ పట్టణాన్ని మనువు స్వయంగా నిర్మించుకున్నాడు. ఆ వంశంలో వచ్చిన దశరథుడు కోసల దేశాన్ని ధర్మపథంలో పాలిస్తూ, అయోధ్యాపురవైభవాన్ని ఇనుమడింపజేశాడు. దేశంలోని సమస్త వర్గాలవారు సర్వసుఖసంపదలతో జీవించేవారు.

దశరథుని ఆస్థానంలో ధృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడు అనే ఎనిమిదిమంది సమర్థులు, రాజ్యకార్య నిర్వహణలో తత్పరులైన మంత్రులున్నారు. వసిష్ఠ, వామదేవులనే మహర్షులు ప్రధాన

విశ్వామిత్రుడు రాముడికి ఏ ప్రమాదం జరగదని, అతడు సామాన్యుడు కాదని చెప్పాడు. ఇంతకూ యజ్ఞవిఘ్నానికి ప్రయత్నిస్తున్న రాక్షసులెవరని దశరథుడు అడిగాడు. విశ్వామిత్రుడు 'బ్రహ్మవరప్రసాదంతో గర్వించిన రావణుడు త్రిలోకకంటకుడై ప్రవర్తిస్తున్నాడు. అతడి అనుచరులు మారీచసుబాహువులు రావణ ప్రేరితులై వాళ్ళు యాగభంగం చేస్తున్నా'రని సమాధానం ఇచ్చాడు. ఈ సమాధానం వినగానే 'యముడితో సమానులైన సుందోపసుందుల పుత్రులు మారీచసుబాహువులు. అటువంటి వారితో కయ్యం రాముడివల్ల సాధ్యంకాదు. నేనే వస్తాను – అనుమతి ఇవ్వండి' అని దశరథుడు ప్రార్థించాడు.

ఆ సమాధానంతో కోపించిన విశ్వామిత్రుడు 'మాట ఇచ్చి తప్పడం రఘువంశస్థులకు పాటికాదు. నేను వచ్చిన దారినే వెళ్తాను' అన్నాడు. ఆ సమయంలో భూమి కంపించింది. దేవతలు భయగ్రస్తులయ్యారు.

వసిష్ఠుడు విశ్వామిత్రుడి గుణగణాలను, ఔన్నత్యాన్ని పేర్కొని – ఆడితప్పడం ఇక్ష్వాకు వంశానికి కళంకం తెస్తుందని చెప్పి రాముణ్ణి పంపడానికి అంగీకరింపజేశాడు. రామలక్ష్మణుల్ని పిలిపించి, విశ్వామిత్రుడితో సాగనంపాడు. **రాక్షస సంహారానికి తొలి అడుగు పడింది. రామలక్ష్మణుల పయనం మానవాళి శ్రేయస్సుకు నాంది పలికింది.**

## గురూపదేశం – తాటక సంహారం

రామలక్ష్మణులు విశ్వామిత్రుడితోబాటు సరయూనదికి దక్షిణతీరంలో ఒకటిన్నర యోజనలదూరం పయనించిన పిదప విశ్వామిత్రుడు రాముడికి **బల, అతిబల** అనే మంత్రాలను ఉపదేశించాడు. వాటి ప్రభావంతో అలసట, ఆకలిదప్పులుండవని విశ్వామిత్రుడు పేర్కొన్నాడు. గురువైన విశ్వామిత్రుడికి రాముడు పాదాలొత్తడం వంటి శుశ్రూషలు భక్తితో ఆచరించాడు. ఆ రాత్రి సరయూనదీ తీరంలో విశ్రమించారు.

మరునాటి ఉదయం గడ్డి పరుపుమీద శయనించిన రామలక్ష్మణుల్ని విశ్వామిత్రుడు మేల్కొల్పాడు. ప్రసిద్ధమైన ఆ మేలుకొలుపు –

**శ్లో॥ కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే ।**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥** *(బాల. 23-27)*

కౌసల్య నోములపంటగా జన్మించిన ఓ రామా! తూర్పు దిక్కున ఉషఃకాంతులు వికసిస్తున్నాయి. ఓ పురుషశ్రేష్ఠా! లేచి స్నానసంధ్యావందనాది నిత్యకర్మల్ని ఆచరించు.

తర్వాత సరయూనది గంగానదిలో సంగమించే పవిత్ర ప్రదేశాన్ని చూశారు. ఆ సమీపంలోని ఆశ్రమాల గురించి రాముడు ప్రశ్నించాడు. విశ్వామిత్రుడి వివరణ ఇది – 'పూర్వం శివుడు తపం ఆచరించిన చోటు. మన్మథుడు ఆయన తపోభంగానికై ప్రయత్నించి,



*ఆ తర్వాత దశరథుడికి సంతానం కలుగలేదు. సుమిత్ర, కైకేయిలను వివాహం చేసుకున్నా సంతానప్రాప్తి కలుగలేదు–Puranic Encyclopaedia).* కనుక ఆ మహర్షిని అయోధ్యా నగరానికి తీసుకురండని సుమంత్రుడు దశరథునితో చెప్పాడు.

దశరథుడు సంతోషంతో రోమపాదుడి వద్దకు వెళ్ళి తన కోరికను తెలియజేశాడు. రోమపాదుడు ఋశ్యశృంగుడితో దశరథునిరాక, అతడి కోరిక గురించి చెప్పగానే అతడూ తన భార్య శాంతతో అయోధ్యకు బయల్దేరాడు. ఋశ్యశృంగుడు అయోధ్యకు వచ్చిన చాలాకాలానికి ఒకానొక వసంత ఋతువు ప్రారంభంలో–చైత్రశుద్ధ పూర్ణిమనాడు – అశ్వమేధయాగం చెయ్యాలన్న సంకల్పంతో గురువుల ఆదేశానుసారం సమర్థులైన యోధుల రక్షణలో నలుగురు ఋత్విజులు వెళ్తుండగా అశ్వయాగాన్ని దశరథుడు వదిలిపెట్టాడు.

యజ్ఞాశ్వం వదిలిన ఒక సంవత్సరం తర్వాత వసంత ఋతువు మొదలైనప్పుడు ఋశ్యశృంగుని ప్రధాన ఋత్విజునిగా చేసి, దశరథుడు యజ్ఞం కొనసాగించాడు. కోశాగారం లోని ధనాన్ని పూర్తిగా దానం చేశాడు. చివరకు ఒక బ్రాహ్మణుడు వస్తే అతడికి తన ముంజేతి కంకణాన్ని దానం చేశాడు.

ఋశ్యశృంగుడు దశరథునితో "నీకు పుత్రులు కలగడానికి 'అథర్వశిరస్సు' అనే వేదభాగంలో పేర్కొన్న మంత్రాలలో విధ్యుక్తంగా 'పుత్రకామేష్టి' క్రతువును నిర్వహిస్తాను" అని అన్నాడు. వాల్మీకి ఈ సందర్భంగా యజ్ఞసంబంధమైన అంశాలను విపులంగా వర్ణించాడు.

## దేవతల విన్నపం – విష్ణుదేవుని అభయం

యజ్ఞం కొనసాగుతున్నప్పుడు తమ తమ హవిర్భాగాలు గ్రహించటానికి దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు యజ్ఞశాలలో ప్రత్యక్షం అయ్యారు. అందరూ కలిసి బ్రహ్మతో ఇలా మొరపెట్టుకున్నారు.

"నీ వరప్రభావంతో రావణుడు మరింత విజృంభించి మమ్మల్ని చిత్రహింసలకు గురిచేస్తున్నాడు. అతణ్ణి చంపే ఉపాయం ఆలోచించమన్నారు. బ్రహ్మ – 'రావణుడు *యక్ష, గంధర్వ, దేవ, దానవ, రాక్షసులు మొదలైన వారివల్ల తనకు మరణం సంభవించ కూడదని నన్ను వరం అడిగాడు'.* కనుక మానవుడివల్లే అతనికి మరణం సంభవిస్తుంది" అని సమాధానం ఇచ్చాడు.

ఇంతలో శ్రీమహావిష్ణువు యజ్ఞశాలకు వచ్చాడు. దేవతలందరూ అతడికి సాష్టాంగ ప్రణామాలు చేసి తమను రావణుడి బారినుంచి రక్షించవలసిందని ప్రార్థించారు. విష్ణువు అనుగ్రహిస్తూ తాను మానవుడిగా అవతరించి రావణుణ్ణి బంధుమిత్ర సమేతంగా పరిమార్చి,

పదకొండువేల సంవత్సరాలకాలం ఈ మానవ లోకంలో నివసిస్తానని, పాలన కొనసాగిస్తానని అభయం ఇచ్చాడు.

## యజ్ఞ ఫలం - దివ్యమైన పాయసం

శ్రీ మహావిష్ణువు దశరథ పుత్రుడిగా జన్మించాలని నిర్ణయించాడు. యజ్ఞకుండం నుంచి నల్లటివర్ణంతో, ఎర్రటి ముఖం కలిగి, అరుణవర్ణ వస్త్రాలు ధరించిన ఒక మహా పురుషుడు ఆవిర్భవించాడు. అతడి చేతుల్లో వెండిమూతగల బంగారుపాత్ర ఉంది. అందులో పాయసం ఉంది.

"అశ్వమేథ, పుత్రకామేష్టి యాగాలు నిర్వహించినందువల్ల దేవతల్ని తృప్తిపరిచావు. వాళ్ల అనుగ్రహంతో ఈ దివ్యమైన పాయసం లభించింది. ఇది నీ పత్నులకిచ్చి భుజింప చేసినట్లయితే నీకు పుత్రసంతానం కలుగుతుంది" అని దశరథుడికిచ్చి అతడు అంతర్ధానం అయ్యాడు.

దశరథుడు అమృతసమానమైన ఆ పాయసంలోని సగభాగాన్ని కౌసల్యాదేవికి, మిగిలిన పాయసంలోని సగభాగాన్ని సుమిత్రాదేవికి, ఆ తర్వాత మిగిలిన పావుభాగంనుంచి సగాన్ని (1/8వ వంతు) కైకేయికి ఇచ్చాడు. ఇంకా మిగిలిన 1/8 వ వంతును మళ్ళీ సుమిత్రకు ఇచ్చాడు. ఆ తర్వాత కొంతకాలానికి ముగ్గురూ గర్భవతులయ్యారు.

## దేవతాంశలు - భల్లూక వానరవీరులు

దశరథ తనయుడిగా జన్మించటానికి మహావిష్ణువు నిర్ణయించిన తర్వాత భవిష్యత్తు పరిణామాలను గ్రహించి బ్రహ్మ దేవతలకు కొన్ని ఆదేశాలు ఇచ్చాడు.

మానవావతారంలో విష్ణువు సహాయార్థం అప్సరసలు, ముఖ్య గంధర్వ స్త్రీలు, యక్షవనితలు, నాగకన్యలు, ఋక్ష, కిన్నర, వానర, విద్యాధర యువతులు మొదలైన వారి ద్వారా వానరుల్ని సృజించమని దేవతలకు బ్రహ్మ నిర్దేశించాడు. అంతకు పూర్వమే తాను ఆవలించినపుడు జాంబవంతుడనే ఋక్ష (ఎలుగుబంటు) రాజును పుట్టించినట్లు చెప్పాడు. బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం దేవతలు వానరరూపాలతో పుత్రుల్ని పొందారు.

ఋషులు, సిద్ధులు, చారణులు, నాగులు, విద్యాధరులు వానర భల్లూక వీరుల్ని పుట్టించారు. ఇంద్రుడు - వాలి, సూర్యుడు - సుగ్రీవుడి జన్మకు కారకులయ్యారు. వీళ్లిద్దరూ 'ఋక్షరజు' దనే వానరరాజు కుమారులు. బృహస్పతివల్ల తారుడు, కుబేరునివల్ల గంధ మాదనుడు, విశ్వకర్మవల్ల నలుడు, అగ్నిదేవుని కారణంగా నీలుడు, అశ్వనీదేవతల మానస పుత్రులుగా మైందుడు, ద్వివిదుడు, వరుణుడి అనుగ్రహంతో సుషేణుడు, పర్జన్యుడి అంశంతో శరభుడు, వాయుదేవుని అనుగ్రహంతో ఆంజనేయుడు జన్మించారు.



## పుత్రజననం - అభ్యుదయం

చైత్రశుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రం నాల్గవపాదం, కర్కాటకలగ్నంలో కౌసల్యా దేవికి శ్రీరామచంద్రుడు జన్మించాడు. భరతుడు పుష్యమీ నక్షత్రయుక్త మీనలగ్నంలో చైత్రశుద్ధ దశమినాడు కైకేయికి పుత్రుడిగా, సుమిత్రాదేవికి లక్ష్మణ శత్రుఘ్నులు ఆశ్లేషా నక్షత్రయుక్త చైత్రశుద్ధదశమి గడియల్లో పుట్టారు. పుత్రులు జన్మించిన పదకొండు రోజులు గడిచిన పిమ్మట దశరథుడు వారికి జాతక కర్మ నామకరణోత్సవాలు జరిపించాడు. అనేక దాన ధర్మాలు చేశాడు.

విష్ణ్వంశ సంభూతులైన ఆ రాజకుమారులు వేదశాస్త్రాలను అభ్యసించారు. ధనుర్విద్యలో ఆరితేరారు. ప్రజల హితంలో ఆసక్తి కలవారయ్యారు. అందరూ విజ్ఞాన ఖనులు, సకల సద్గుణ సంపన్నులు. అమోఘ పరాక్రమం కలిగిన శ్రీరాముడు రథ, గజ, తురగాలను అధిరోహించి యుద్ధం చెయ్యడంలో కుశలుడు. ఎల్లప్పుడూ తల్లిదండ్రుల సేవలో నిమగ్నుడు. లక్ష్మణుడు రాముని పట్ల భక్తి తత్పరుడు. ఆయన సేవే మహాభాగ్యంగా భావించేవాడు. రామునికి బహిః ప్రాణం. రాముడు లక్ష్మణుడు తన చెంతలేనిదే నిద్రించే వాడు కాదు. అతడు తోడులేనిదే భుజించేవాడు కాదు.

లక్ష్మణ సోదరుడైన శత్రుఘ్నుడు భరతుడి పట్ల ప్రదర్శించిన సేవాభావం కూడా అటువంటిదే. దశరథుడు తన నలుగురి పుత్రులతో ఇంద్ర, యమ, వరుణ, కుబేరులనే నలుగురు దిక్పాలురతో కూడిన బ్రహ్మదేవునిలా పరమానంద భరితుడయ్యాడు. నలుగురూ వివిధ శాస్త్ర సంపన్నులై, సకల సద్గుణాలలో ప్రకాశించారు. ఏ పరిస్థితుల్లోను, పొరబాటుగా నైనా అకృత్యాలకు పాల్పడేవారు కారు.

## విశ్వామిత్ర మహర్షి ప్రవేశం - రామలక్ష్మణుల పయనం

తన పుత్రుల ఎదుగుదలను చూసి ఆనందంతో ఉన్న దశరథుడు, వారికి తగిన కన్యలతో వివాహం జరిపించాలని మంత్రి పురోహితాది ప్రముఖులతో ఆలోచిస్తున్నపుడు ఒక రోజు విశ్వామిత్రమహర్షి వచ్చాడు. ఆయనను దశరథుడు సగౌరవంగా ఆహ్వానించి, పూజించి, సముచిత ఆసనంలో ఆసీనుణ్ణి చేశాడు.

పరస్పర కుశలాదిక ప్రశ్నలయ్యాక విశ్వామిత్రుడు రాముణ్ణి తనతోబాటు యాగరక్షణ నిమిత్తం పదిరోజుల పాటు పంపించవలసిందని కోరాడు. అందువల్ల రాముడికి సకల శ్రేయస్సులు కలుగుతాయన్నాడు. ఊన షోడశప్రాయుడైన (పదహారేళ్ళు సైతం నిండని వయస్సు) రాముడికి బదులు తాను ససైన్యంగా వస్తానని దశరథుడు విశ్వామిత్రుణ్ణి ప్రాధేయపడ్డాడు. రాముడులేక తాను జీవించలేనన్నాడు.

ఆ బ్రహ్మదత్తుడు కాంపిల్యనగర పాలకుడయ్యాడు. కుశనాభుడు బ్రహ్మదత్తుణ్ణి ఆహ్వానించి తన వందమంది కుమార్తెలను అతడికిచ్చి వివాహం చేశాడు. బ్రహ్మదత్తుని కరస్పర్శకలగగానే వారికున్న గూని మాయమై పూర్వంవలె సౌందర్యవతులయ్యారు. కుమార్తెలు భర్తతో కాంపిల్యనగరం వెళ్ళిన పిదప కుశనాభుడు పుత్రప్రాప్తికోసం పుత్రకామేష్టి యాగం ఆచరించాడు. కుశనాభుని తండ్రి కుశుడు తన కుమారుడు యజ్ఞం నిర్వహిస్తుండగా "కుమారా! సకల సద్గుణాలతో నీకు సమానుడైన 'గాథి' అనే పుత్రుడు నీకు జన్మిస్తా"డని ఆశీర్వదించాడు.

కుశనాభుడు తన భార్య ఘృతాచి ద్వారా 'గాథి' ని పొందాడు. ఆ గాథియే విశ్వామిత్రుని తండ్రి. కుశవంశంలో జన్మించాడు కనుక కౌశికుడని కూడా ప్రఖ్యాతుడయ్యాడు. విశ్వామిత్రుని అక్క సత్యవతికి ఋచీకునితో వివాహమయింది. ఆమె కూడా కౌశిక అని ప్రసిద్ధిగాంచింది. ఆమె పతితోబాటు సశరీరంగా స్వర్గానికి వెళ్ళింది. తర్వాత పరమ ఔదార్యంతో 'కౌశిక' అనే పేరుతో మహానదిగా భూమిపై ప్రవహిస్తున్నది.

ఆమెపై విశ్వామిత్రునికున్న ప్రేమకారణంగా ఆయన హిమాలయ ప్రాంతంలోనే నివసించసాగాడు. ఈ యాగ నిర్వహణకోసమే సిద్ధాశ్రమానికి వచ్చాడు.

పై వివరాలను తెలిపిన విశ్వామిత్రుడి వంశక్రమాన్ని తెలుసుకొని ఆయనను, 'కౌశికి' నదిగా ప్రవహిస్తున్న ఆయన సోదరిని రామలక్ష్మణులు, మునులందరూ ప్రస్తుతించారు. ఆ రాత్రి అందరూ సుఖనిద్ర చెందారు.

## గంగావతరణం

మరుసటి రోజు ప్రయాణంలో గంగానదీ తీరాన్ని చేరారు. గంగానదికి త్రిపథగా పేరుంది. ఆ నదికాపేరు ఎలా వచ్చింది? అలా చీలిపోవడానికి కారణం ఏమిటని రాముడు అడిగిన ప్రశ్నకు విశ్వామిత్రుడు గాంగావతరణ కథను విన్పించాడు.

పర్వతరాజు హిమవంతుడికి, మేరువు కుమార్తె అయిన మనోరమకు కలిగిన సంతానం గంగాదేవి, ఉమాదేవి. దేవతలు తమ ప్రయోజనార్థం గంగను తమకు ఇమ్మని హిమవంతుణ్ణి ప్రార్థిస్తే ఆమెను వారికిచ్చాడు. దేవలోకంలో గంగ దివ్యవాహినిగా అందరి పాపాలు పోగొట్టి పవిత్రుల్ని చేసింది. ఉమ తీవ్రతపస్సుతో శివుణ్ణి మెప్పించి ఆయనను వివాహమాడింది.

పరమశివుడు పుత్రేచ్ఛతో ఉమాదేవితో రతికేళిలో ఉన్నప్పుడు దేవతలు వారి తేజస్సుతో పుట్టే పుత్రుణ్ణి లోకాలు భరించలేవు కనుక సంతానం కనవద్దని కోరారు. శివుడు అందుకు అంగీకరించాడు. కాని తన తేజాన్ని భరించేదెవరని శివుడు ప్రశ్నిస్తే, దేవతలు భూదేవిని అంగీకరింపజేశారు. శివతేజాన్ని భూపతనం చెయ్యగానే, ఉమ



కాలి బూడిదైన చోటు. అప్పటినుంచి మన్మథుడు అనంగుడు (అవయవాలు లేనివాడు) అయ్యాడు. ఈ ప్రాంతానికి ఆ కారణంగా అంగదేశమని పేరు కలిగింది. ఇక్కడి మునులు గొప్ప తపస్సంపన్నులు'. ఆ రాత్రి అక్కడే విశ్రమించారు.

మరుసటిరోజు మునులు ఏర్పాటుచేసిన నావద్వారా గంగానది దాటి నడవసాగారు. కొంతదూరం పయనించిన తర్వాత భయంకరారణ్యం కన్పించింది. ఆ అరణ్యాన్ని చూసి రాముడు ప్రశ్నించగా విశ్వామిత్రుడు ఆ వృత్తాంతాన్ని తెలియజేశాడు.

"వృత్రాసురుణ్ణి చంపిన కారణంగా ఇంద్రుడికి బ్రహ్మ హత్యాపాతకం చుట్టుకుంది. అపవిత్రుడైనందున ఆకలిదప్పులు పీడించసాగాయి. దేవతలు, ఋషులు పవిత్రమైన గంగా తీర్థజలంచేతను, మంత్రపూరితమైన కలశోదకాలతోను స్నానం చేయించారు. దానివల్ల అతడి అపవిత్రత, ఆకలిబాధ తొలగింది. తన శరీరమాలిన్యాలను తొలగించిన ఆ రెండు ప్రదేశాలు 'మలద, కరూశ' అనే పేర్లతో సంపదలతో అలరారుతుందని దేవేంద్రుడు వరం ఇచ్చాడు. దుర్మార్గురాలైన తాటక ఈ రెండు జనపదాలను నిత్యం ధ్వంసం చేస్తున్నది' అలా ధ్వంసం చెయ్యడానికి కారణాన్ని విశ్వామిత్రుడు చెప్పసాగాడు.

'పూర్వం సుకేతుడనే గొప్ప యక్షుడుండేవాడు. సత్ప్రవర్తన కలవాడు. మహావీరుడు. సంతానం కోసం అతడు బ్రహ్మదేవుని గూర్చి తీవ్ర తపస్సు ఆచరించాడు. బ్రహ్మ అతడికి పుత్రభాగ్యం కలిగించలేదు కాని, అనుగ్రహించిన కన్యారత్నానికి వెయ్యి ఏనుగుల బలాన్ని ప్రసాదించాడు. ఆమె తాటక. చక్కటి అందచందాలతో ఉన్న ఆమెను జంభుని పుత్రుడైన సుందునికి ఇచ్చి సుకేతుడు వివాహం జరిపించాడు.

తాటకాసుందులకు మారీచుడనే కుమారుడు జన్మించాడు. అగస్త్యుని కారణంగా సుందుడు మరణించడంతో తన కుమారుడితో కలిసి తాటక అగస్త్యమహర్షిని చంపటానికి పూనుకుంది. మహర్షి కోపించి మారీచుణ్ణి రాక్షసుడిగా, తాటకను భయంకర రూపంలో నరమాంస భక్షకురాలిగా శపించాడు. తాటక ప్రతీకారంగా అగస్త్యుడు సంచరించిన ఈ ప్రదేశాన్నంతటినీ ధ్వంసం చేస్తున్నది.' ఇక్కడికి ఒకటిన్నర యోజనాల దూరంలో తాటక ఈ దారిని ఆక్రమించి నివసిస్తూంది. ఆ దారిలోనే మనం వెళ్ళాలి. స్త్రీ అని చూడకుండా ఆమెను వధించు."

విశ్వామిత్రుడి మాటలు విన్న వెంటనే దిక్కులు పిక్కటిల్లే విధంగా రాముడు ధనుష్టంకారం చేశాడు. ఆ శబ్దానికి కోపించి తాటక ఆ శబ్దం వచ్చిన దిక్కువైపు పరుగెత్తుకొచ్చింది. రామలక్ష్మణుల్ని చూసి ధూళిని ఎగజిమ్ముతూ, తన మాయాశక్తిచేత వాళ్ళకి కన్పించకుండా రాళ్ళవానను కురిపించింది.రాముడు తన శరపరంపరచేత శిలా వర్షాన్ని భగ్నంచేసి తాటక చేతుల్ని తన బాణాలతో ఖండించాడు. లక్ష్మణుడు తమపైకి

వస్తున్న తాటక ముక్కు చెవుల్ని కోశాడు. తాటక వివిధ రూపాలు ధరించి రామలక్ష్మణులకు కన్పించకుండా రాళ్ళను కురిపించింది.

సంధ్యాకాలానికి పూర్వమే *(రాత్రి సమయాలలో రాక్షసులకు బలం పెరుగుతుంది)* తాటకిని సంహరించమని చెప్పిన విశ్వామిత్రుడి సూచనమేరకు శబ్దవేధి విద్యను *(శబ్దం చేస్తున్న వాళ్ళు కన్పించకపోయినా ఆ శబ్దం వస్తున్న దిశనుబట్టి బాణాలతో కొట్టగల నేర్పు)* ప్రదర్శించి బాణాలు ప్రయోగించి తాటకిని రాముడు వధించాడు.

తాటక వధానంతరం మిక్కిలి సంతోషంతో విశ్వామిత్రుడు రాముడికి అనేక అస్త్రాలు ప్రసాదించాడు. రాముడు తాను పొందిన విద్యలను లక్ష్మణుడికి బోధించాడు. రాముడు ప్రశ్నించిన మీదట తాము యజ్ఞం నిర్వహిస్తున్న ప్రదేశం సిద్ధాశ్రమం అని విశ్వామిత్రుడు చెప్పి, దాని విశిష్టతను వివరించాడు.

## దుష్టశిక్షణ – యాగరక్షణ

శ్రీ మహావిష్ణువు వందలాది యుగాలు ఇక్కడ నివసించి, లోకకల్యాణం కోసం తపస్సు చేశాడు. వామనావతారం ముందు తపస్సిద్ధి పొందాడు. కాశ్యపుడు, అదితిద్వారా విష్ణువుని పుత్రుడిగా పొందటానికి తపమాచరించి అనుగ్రహం పొందాడు. వామనుడిగా అవతరించాడు. కనుక 'సిద్ధాశ్రమం' గా ప్రసిద్ధిగాంచింది. వామనుడిపై భక్తిశ్రద్ధల కారణం గానే తాను (స్థాణ్వాశ్రమాన్ని విడిచిపెట్టి) ఈ ప్రదేశాన్ని ఆశ్రయించినట్లు విశ్వామిత్రుడు చెప్పాడు. సిద్ధాశ్రమం చేరి ఆ రాత్రి అక్కడే గడిపాడు.

రామలక్ష్మణులు మరునాటి ఉదయం ప్రాతఃకాల విధుల్ని నిర్వర్తించి, విశ్వామిత్రుని వద్దకు వచ్చి నమస్కరించి– "యాగ విఘ్నం చెయ్యడానికి రాక్షసులు ఎప్పుడు వస్తారో చెప్పండి, వాళ్ళను ఎదుర్కోవడానికి మేము సిద్ధంగా ఉన్నాం" అన్నారు. అక్కడి మునులు రామలక్ష్మణుల్ని ప్రశంసించి – "ఈరోజు నుంచి ఆఱురోజుల వరకు విశ్వామిత్రమహర్షి మౌనదీక్షలో ఉంటారు. రాక్షసులు ఏ సమయంలోనైనా యాగభంగానికి పూనుకోవచ్చు. మీరు అప్రమత్తంగా ఉంటూ ఆరు రోజులు యాగరక్షణ చెయ్యాలి" అన్నారు. అయిదు రోజులు ఏ అవాంతరమూ జరుగలేదు. ఆఱవరోజు రాముడు లక్ష్మణుడితో జాగ్రత్తగా ఉండవలసిందని అంటుండగానే యజ్ఞగుండంలోనుంచి అగ్నిజ్వాలలు ఒక్కుమ్మడిగా లేచాయి. *(ఇది రాక్షసుల రాకకు సూచన).*

భయంకరమైన మారీచ సుబాహువులు, వారి అనుచరులు అక్కడికి చేరి కుండపోతగా పైనుంచి రక్తాన్ని వర్షింపజేశారు. వేదిక యొక్క పరిసరాలన్నీ తడిశాయి. 'శీతేషువు' అనే పేరున్న మానవాస్త్రాన్ని ప్రయోగించి రాముడు మారీచుని నూరు యోజనాల దూరంలో సముద్రపు నీటిలో పడవేసి స్పృహ లేకుండా చేశాడు. ఆగ్నేయాస్త్రంతో



సుబాహువును సంహరించాడు. వాయవ్యాస్త్రంతో తక్కిన రాక్షసుల్ని తుదముట్టించాడు. యజ్ఞం పూర్తయింది. మునులు సంతోషించారు. విశ్వామిత్రుడు "నువ్వు నీ తండ్రికి ఇచ్చిన మాటను నిలబెట్టుకున్నావు. నీ చర్య కారణంగా 'సిద్ధాశ్రమం' అనే పేరు ఈ ఆశ్రమానికి సార్థకమయింది" అని ప్రశంసించాడు.

ఆ రాత్రి ఆనందంగా అక్కడే విశ్రాంతి తీసుకున్నారు. తెల్లవారిన పిదప రామ లక్ష్మణులు విశ్వామిత్రుడితో తమ తదనంతర కర్తవ్యాన్ని నిర్దేశించమన్నారు. విశ్వామిత్రుడు 'మిథిలానగర చక్రవర్తి జనకుడు యజ్ఞం చెయ్యాలని సంకల్పించాడు. గొప్ప ధార్మికుడైన ఆయన నిర్వహిస్తున్న యజ్ఞం చూడాలని వెళ్తున్నాం. అక్కడ అద్భుతమైన మహాధనుస్సు ఉంది. దాన్ని మీరు చూడవచ్చు అన్నాడు.' తర్వాతి పయనం మిథిలానగరం వైపు సాగింది.

## మిథిలా ప్రయాణం – సీతారాముల కల్యాణం

సూర్యాస్తమయ సమయానికి శోణనదీతీరం చేరి అక్కడ బసచేశారు. దట్టమైన వృక్షాలతో శోభిల్లుతున్న ఈ ప్రదేశం ఎవరిదని రాముడు అడిగాడు. విశ్వామిత్రుడు రామ లక్ష్మణులకు, తన శిష్యులకు ఇలా చెప్పాడు –

### విశ్వామిత్రుని వంశ ప్రశస్తి

విశ్వామిత్రుని వంశానికి మూల పురుషుడు కుశుడు. అతడు బ్రహ్మమానస పుత్రుడు. అతడి భార్య వైదర్భి. ఆ దంపతులకు నలుగురు కుమారులు. వారిలో కుశాంబుడు కౌశంబీపురాన్ని, కుశనాభుడు మహోదయ పట్టణాన్ని, అధూర్తరజసుడు ధర్మారణ్యం అనే నగరాన్ని, వసువు గిరివ్రజపురాన్ని నిర్మించి ధర్మబద్ధంగా పాలించసాగారు. ప్రస్తుతం విశ్వామిత్రాదులు విశ్రమించిన ప్రదేశం వసురాజు పాలనలోనిది.

కుశనాభుడు, ఘృతాచి అనే భార్యద్వారా వందమంది కన్యారత్నాలను సంతానంగా పొందాడు. యువతులుగా వాళ్ళు ఉద్యానవనంలో విహరిస్తున్నప్పుడు వాయుదేవుడు ముగ్ధుడై తనను పెళ్ళాడమని కోరాడు. కన్యలు తిరస్కరించడంతో వారి శరీరాల్లోకి జొరబడి గూనివాళ్ళుగా చేశాడు.

ఆ కాలంలోనే చూళి అనే పేరుగల ఇంద్రియ నిగ్రహం గలిగిన మహాముని ఉండేవాడు. అతడు బ్రహ్మ గురించి తపస్సు చేస్తున్నప్పుడు ఊర్మిళ పుత్రిక అయిన **'సోమద'** అనే గంధర్వ స్త్రీ సపర్యలు చేస్తుండేది. ఆమె శుశ్రూషకు సంతోషించి ముని ఆమెకు ఏమి కావాలో కోరుకొమ్మన్నాడు. బ్రహ్మజ్ఞానంగల కుమారుణ్ణి ప్రసాదించమని ఆమె ప్రార్థించింది. చూళి తన మానసపుత్రుడిగా **బ్రహ్మదత్తుణ్ణి** ప్రసాదించాడు.

విశ్వామిత్రుడు ఈ వివరాలన్నీ తెలియజేసి 'రామా! ఈ ప్రదేశంలోనే పూర్వం దేవేంద్రుడు నివసించి తపస్సిద్ధురాలైన దితికి పరిచర్యలు చేశాడు. ఇక్ష్వాకు మహారాజుకు 'అలంబుస' అనే భార్య ద్వారా కలిగిన విశాలుడనే పరమ ధార్మికుడి పేరుతో 'విశాల' అనే ఈ నగరం నిర్మింపబడింది. ఇక్ష్వాకువంశంలోనే వచ్చిన కాకుత్స్థుని కుమారుడు 'సుమతి' ఈ నగరాన్ని ప్రస్తుతం పాలిస్తున్నాడు' అని విశ్వామిత్రుడు చెప్పాడు.

## అహల్యాశాపవిముక్తి

'సుమతి' ఆతిథ్యం స్వీకరించి, ఆ రాత్రి అక్కడే గడిపి, మరుసటి రోజు విశ్వామిత్ర సమేత రామలక్ష్మణులు మిథిలానగరానికి పయనం అయ్యారు. మిథిలా నగర సమీపంలోని ఒక వనంలో శ్రీరాముడు నిర్మానుష్యమైన ఆశ్రమాన్ని చూశాడు. అది ప్రాచీనమైనదైనా రమ్యంగా ఉంది. ఆశ్రమం నిర్జీవంగా ఉండే కారణం ఏమిటని రాముడు ప్రశ్నించాడు.

అది గౌతమ మహర్షి ఆశ్రమం. ఒకనాడు దేవతల పూజలను సైతం పొందిన ఆశ్రమం. గౌతముడు తన భార్య అహల్యతో కలిసి అనేక సంవత్సరాలు ఆ చోట తపస్సు చేశాడు. ఒకరోజు గౌతమమహర్షి ఆశ్రమంలోలేని సమయం చూసి దేవేంద్రుడు మహర్షి రూపంలో వచ్చి అహల్యతో సంగమాన్ని ఆశించాడు. వచ్చినవాడు ఇంద్రుడని గ్రహించి కూడా అహల్య చాంచల్యానికి లోనయింది. మహర్షి ఇంటికి వచ్చే సమయం అయిందని, వెంటనే వెళ్ళమని అహల్యకోరగా, ఇంద్రుడు భయపడుతూ వెలుపలికి వచ్చాడు. కాని ఇంతలో మహర్షి అక్కడికి వచ్చాడు. దివ్యజ్ఞానంతో జరిగిన వృత్తాంతం గ్రహించి, అతణ్ణి 'విగత వృషణుడివి' కమ్మని శపించాడు. అహల్యను చూసి 'వేలకొద్ది సంవత్సరాలు అన్నపానాలులేక వాయుభక్షణతో తపిస్తూ ఈ ఆశ్రమంలో పడివుంటావు. భస్మశాయినివై ఎవరికీ కన్పించవు, శ్రీరాముడు ఈ ఘోరవనానికి వచ్చినప్పుడు అతడి దర్శనంతో పవిత్రురాలివై నిజరూపం పొందుతావు' అని అనటంతోబాటు విముక్తిని కూడా తెలియజేసి తపమాచరించడానికి హిమవత్పర్వతాలకు వెళ్ళాడు.

దేవేంద్రుడు దేవకార్యనిమిత్తమై ఆ దుశ్చర్యకు పూనుకోవడంవల్ల దేవతల విజ్ఞప్తి మేరకు పితృదేవతలు మేషవృషణాలను ఇంద్రుడికి అతికించారు. విశ్వామిత్రుడు ఈ వృత్తాంతాన్ని తెలియజేసి శ్రీరాముణ్ణి ఆశ్రమంలోకి అడుగిడమన్నాడు. శాపప్రభావంతో ముల్లోకాలకు కన్పించని అహల్య శాపవిముక్తిపొంది, వాళ్ళకి కనిపించింది. పరస్పరం పాదాభివందనాలు చేసుకున్నారు. గౌతమ మహర్షి కూడా అక్కడికి చేరుకున్నాడు. దంపతుల సత్కారం అందుకొని రామలక్ష్మణ విశ్వామిత్రులు మిథిలానగరానికి చేరుకున్నారు.



క్రుద్ధురాలై దేవతల్ని సంతానహీనులుగా, భూమిని ఎత్తుపల్లాలుగా, ఊషరక్షేత్రాలుగా కమ్మని శపించింది.

శివతేజస్సు భూమిపై ప్రవహిస్తున్నప్పుడు దేవతలు అగ్నిని వాయువు సాయంతో దహించి వెయ్యమని కోరారు. అగ్ని అలాగే చేశాడు. అక్కడ రెల్లు గడ్డి పెరిగింది. దేవతలు బ్రహ్మతో తమ సేనకు నాయకుడు కావాలని కోరారు. బ్రహ్మ వారితో అగ్ని గంగాదేవిని కలిసి శివతేజస్సును ప్రవేశపెడితే కలిగే శిశువు వారికి సేనాధిపతి అవుతాడన్నాడు. అగ్ని గంగను కలిసి శివతేజాన్ని గర్భస్థం చేశాడు. గంగ భరించలేక అగ్నితో చెప్పినప్పుడు హిమాలయం అడుగుభాగంలో వదలమన్నాడు. గంగాదేవి అలాగే చేసింది. అక్కడే బంగారం, వెండి, రాగి, ఇనుము, తగరం మొదలైన లోహాలు, ధాతువులన్నీ ఉద్భవించాయి. శివ తేజస్సువల్ల కుమారుడు జన్మించాడు. ఆరుగురు కృత్తికల్ని శిశువులకు పాలివ్వడానికి నియమించారు. వారి కారణంగా కార్తికేయుడిగా, ఆరు ముఖాలతో పాలు త్రాగినందువల్ల షణ్ముఖుడిగా, గంగాగర్భస్కన్నుడు (జారినవాడు) కనుక స్కందుడిగా కుమారస్వామి వ్యవహరింపబడ్డాడు. అగ్ని ఆ బాలుణ్ణి దేవసేనాధిపతిగా చేశాడు.

అయోధ్యానగరాన్ని పూర్వం సగరుడనే (రాముని పూర్వీకుడు) చక్రవర్తి పాలించాడు. అతడికి ఇద్దరు భార్యలు. (ఈయన భార్యల పేర్లు సుమతి, కేశిని అని బ్రహ్మాండపురాణం). సంతానంలేని సగరుడు భృగుమహర్షిని ప్రార్థించగా ఆయన ఒక భార్యకు ఏకైక పుత్రుడు, మరొక భార్యకు అరవైవేల మంది కుమారులు కలుగుతారన్నాడు. రాణుల కోరికమేరకు వారికి సంతానం కలిగింది. అసమంజుడని ఏకైక పుత్రునిపేరు. అతడు దుర్మార్గుడిగా ప్రవర్తించాడు. అతడి కుమారుడు అంశుమంతుడు ధార్మికుడిగా, మహావీరుడిగా ఖ్యాతి గడించాడు.

సగరుడు అశ్వమేధయాగం తలపెట్టి యాగాశ్వాన్ని వదిలిపెట్టాడు. ఇంద్రుడు మాయోపాయంతో పాతాళంలో కపిలమహర్షి తపస్సుచేస్తున్న చోట అశ్వాన్ని దాచాడు. యాగాశ్వాన్ని వెతకటానికి సగరపుత్రులు 60 వేలమంది అన్నిచోట్లా వెళ్ళారు. సగరుని ఆనతి మేరకు పాతాళంవరకు అన్ని దిక్కుల్లోను తవ్వారు. చివరకు దిగ్గజాలు సైతం కన్పించాయి. ఎట్టకేలకు యాగాశ్వాన్ని కనుగొన్నారు. అక్కడే తపస్సు చేస్తున్న కపిల మహర్షిని అనుమానంతో నిందించారు. మహర్షికోపాగ్నికి కాలి బూడిదయ్యారు.

యజ్ఞదీక్షలో ఉన్న సగరుడు కుమారులకోసం మనుమడు అంశుమంతుణ్ణి పంపాడు. అతడు వెతుకుతూ పాతాళానికి వెళ్ళాడు. దిగ్గజాలకు నమస్కరించి ఆశీస్సులు పొందాడు. తన పినతండ్రుల కోసం వెతుకుతున్న అతడికి వారి మేనమామ అయిన గరుత్మంతుడు (60 వేలమంది సగరపుత్రుల తల్లి సుమతి. ఆమె వినతాకశ్యపుల పుత్రిక. వినతాపుత్రుడు

గరుత్మంతుడు –విష్ణు, బ్రహ్మాండపురాణాలు) జరిగినదంతా చెప్పాడు. నీ పినతండ్రులకు సద్గతులు కలగాలంటే దివినున్న గంగాజలం పాతాళానికి రావాలన్నాడు.

అంశుమంతుడు వారికి తర్పణలనిచ్చి, కపిల మహర్షి అనుగ్రహంతో యాగాశ్వాన్ని సగరుడికి అప్పగించి జరిగిన వృత్తాంతాన్ని తెలియజేశాడు. యజ్ఞం పూర్తిచేసిన సగరుడు తన మనుమడికి పట్టంగట్టి దేవగంగను తెచ్చే ప్రయత్నంచేసి విఫలుడయ్యాడు. అంశుమంతుడు, అతని కుమారుడు దిలీపుడు తపస్సు చేసినా ప్రయోజనం లేకపోయింది. దిలీపుని పుత్రుడైన భగీరథుడు తపస్సుచేసి గంగను భరించగలశక్తి శివుడికి మాత్రమే ఉందని తెలుసుకొని శివుని అనుగ్రహానికి తపస్సుచేసి, ఆయనను మెప్పించి గంగను శివుని జటాజూటంలోకి అవతరించవలసిందని ప్రార్థించాడు. శివుని జటాజూటంలోకి వచ్చిన గంగ ఆయన అనుమతితో ఏడు పాయలుగా చీలి, ఒక పాయ భగీరథుడి వెంట రాసాగింది. దారిలో జహ్నుముని ఆశ్రమానికి వచ్చి భగీరథుడు ఆయనకు నమస్కరించాడు. గంగ తన వేగాన్ని ఆపుకోలేక ఆశ్రమాన్ని ముంచెత్తింది. మహర్షి కోపంతో గంగను త్రాగాడు. భగీరథుడు మహర్షిని ప్రార్థించగా, ఆయన చెవి నుండి గంగను బయటికి వదిలాడు. జహ్నుముని నుంచి వెలువడింది కనుక గంగాదేవికి జాహ్నవి అని పేరుకలిగింది.

భగీరథుడు గంగను తీసుకొని పాతాళానికి వెళ్ళి తన పూర్వీకుల భస్మరాశులపై ప్రవహింపజేసి వారికి పుణ్యలోకప్రాప్తి కలిగించాడు. భగీరథుడి కారణంగా భాగీరథి అనే పేరు కూడా గంగకు సార్థకమయింది. ఇలా ముల్లోకాలలో గంగాదేవి ప్రవహించటంవల్ల త్రిపథగా ప్రఖ్యాతి గాంచింది. దేవలోకంలో మందాకినిగా, భూలోకంలో గంగానదిగా, పాతాళలోకంలో భోగవతిగా ప్రసిద్ధిగాంచింది. సగరవంశస్థులు త్రవ్విన గోతులన్నీ గంగతో నిండి సాగరాలుగా వ్యవహరింపబడ్డాయి.

ఈ కథ విన్న రామలక్ష్మణులు, మునులు సంతోషంతో ఆ రాత్రి విశ్రమించారు.

## క్షీరసాగర మథనం – మరుత్తుల జననం

మరునాటి ప్రయాణంలో 'అమరావతి' లా ప్రకాశిస్తున్న 'విశాల' అనే నగరం ఎదురయింది. ఆ పట్టణం గురించి పాలకుడిగురించి రాముడు అడిగిన ప్రశ్నకు విశ్వామిత్రుడు ఆ వృత్తాంతాన్ని చెప్పనారంభించాడు.

కశ్యపమహర్షికి దితి, అదితులనే ఇద్దరు భార్యలు. దితి సంతానం దైత్యులు. అదితి సంతానం ఆదిత్యులు. క్షీరసాగర మథనంవల్ల అమృతంపుట్టి దానివల్ల మరణంలేని స్థితిని పొందవచ్చని గ్రహించి మందరపర్వతాన్ని కవ్వంగా, వాసుకిని త్రాడుగా చేసి దితి, అదితి పుత్రులు చెరొకవైపు చేరి సాగరమథనం చేశారు.



తొలుత అందులోంచి హాలాహలం (విషం) పుట్టింది. శివుడు దాన్ని భక్షించి సర్వలోకాలను రక్షించాడు. 'ధన్వంతరి' అనే వైద్య శిరోమణి జన్మించాడు. ఆ తర్వాత 'రసం' ఆవిర్భవించింది. అందులోంచి 60 కోట్ల మంది స్త్రీలు పుట్టారు. వాళ్ళనెవరూ స్వీకరించలేదు. రసం నుంచి పుట్టారు కనుక అప్సరసలై భోగస్త్రీలయ్యారు. లక్ష్మీ, కౌస్తుభ మణులను విష్ణువు స్వీకరించాడు. ఇతరమైన వాటిని దేవేంద్రాది దేవతలు పరిగ్రహించారు. చివరగా అమృతం జనించింది. దానికోసం దైత్యులు, ఆదిత్యులమధ్య గొడవ జరిగింది. విష్ణువు మోహిని రూపలో అమృతాన్ని దేవతలకు పంచాడు. పిదప జరిగిన పోరులో ఆదిత్యులు దైత్యుల్ని సంహరించారు.

తన సంతానం అదితి సంతానంవల్ల నశించిందని తెలిసిన దితి శోకంతో భర్త అయిన కశ్యపమహర్షివద్దకు వెళ్ళి అదితి సంతానాన్ని సంహరించగల పుత్రుణ్ణి తనకు ప్రసాదించమని ప్రార్థించింది. వెయ్యి సంవత్సరాలబాటు పవిత్రతను కాపాడుకుంటూ తాను చెప్పిన నియమాలతో వ్రతం ఆచరిస్తే ఆమె కోరినవిధంగా పుత్రుడు జన్మించగలడని చెప్పి కాశ్యపమహర్షి తపోవనానికి వెళ్ళాడు.

దితి 'కుశప్లవనం' అనే క్షేత్రానికి వెళ్ళి తీవ్రతపస్సు మొదలుపెట్టింది. ఆకాలంలో దేవేంద్రుడు దితికి అన్నిరకాల సేవలు చేశాడు. 990 సంవత్సరాలు గడిచాయి. అపుడు దితి దేవేంద్రుడికి తన సంకల్పాన్ని చెప్పింది. కాని దేవేంద్రుడి శుశ్రూషల కారణంగా అతడికి తన పుత్రుడు అపకారం తలపెట్టకుండా చూస్తానంది. ఈ విధంగా ప్రస్తావిస్తున్నపుడు మధ్యాహ్నం సమయం అయింది. నిద్రముంచుకు రావడంతో అలాగే తూలి నిద్రించింది. అప్పుడామె తల పాదాలను తాకింది. పగటిపూట నిద్ర, తలవెంట్రుకలు పాదధూళిని స్పృశించడంవల్ల ఆమె అశుచి కావడంతో ఇంద్రుడు ఆమె గర్భంలో జొరబడి నూరంచుల తన వజ్రాయుధంతో గర్భస్థ శిశువును మూడు ముక్కలు చేశాడు. గర్భస్థ శిశువు ఏడుస్తుండగా మారుద, మారుద (ఏడవకు, ఏడవకు) అని దేవేంద్రుడు వారించాడు.

దితి మేల్కొని జరిగిన సంఘటనల్ని గ్రహించి, దేవేంద్రుణ్ణి బయటకు రమ్మని వేడుకొంది. వెలుపలికి వచ్చిన అతనితో, ఇందులో దేవేంద్రుడు చేసిన తప్పేమీ లేదని, తానే అశుచినయ్యానని చెప్పి ఏడుముక్కలైన తన శిశువులు ఏడుగురుగా, సప్తలోకాలకు పాలకులవుతారని, సప్తవిధ వాయువులకు అభిమానదేవతలై 'మరుత్తులు' అనే పేరుతో ప్రసిద్ధిచెంది, దివ్యలోకాలలో సంచరిస్తారని, అందుకు దేవేంద్రుడు అనుగ్రహించాలని చెప్పగా, దేవేంద్రుడు అలాగేనని తల్లికి నమస్కరించాడు. మారుద (ఏడవకు) అని దేవేంద్రుడు పలకడంవల్ల మరుత్తులుగా వ్యవహరింపబడ్డారు. ఆ తర్వాత దితి, దేవేంద్రులు ఇద్దరూ స్వర్గానికి చేరుకున్నారు.

మీ కుమార్తెలయిన సీతా, ఊర్మిళలను ఇచ్చి వివాహం చెయ్యడం యుక్తం' అని వసిష్ఠుడు జనకుడితో అన్నాడు.

జనకుడు "మంచివంశానికి చెందిన వధువు తండ్రి. కన్యాదాన సమయంలో తన వంశవృత్తాంతాన్ని తెలియజెయ్యడం సమంజసం. మా వంశానికి మూలపురుషుడు నిమి మహారాజు, అతని కుమారుడు మిథి. అతడే మిథిలానగర నిర్మాత. మొదటి జనకుడు. అతని కుమారుడు ఉదావసుడు–నందివర్ధనుడు–సుకేతుడు–దేవరాతుడు(శివుడు న్యాసంగా తన ధనుస్సును ఇచ్చినవాడు)–బృహద్రథుడు(రాజర్షిగా కీర్తిగాంచాడు)–మహావీరుడు–సుధృతి–దృష్టకేతువు(రాజర్షి)–హర్యశ్వుడు–మరువు–ప్రతింధకుడు–కీర్తిరథుడు–దేవమీఢుడు –విబుధుడు–మహీధ్రకుడు–కీర్తిరతుడు(రాజర్షి)–మహారోముడు–స్వర్ణరోముడు(రాజర్షి) –హ్రస్వరోముడు–ఈయన కుమారులు నేను, నా తమ్ముడు కుశధ్వజుడు. అగ్రజుడైన నన్ను మా తండ్రి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. కొంతకాలానికి సుధన్వుడనే సాంకాశ్యపుర రాజు మిథిలాపురంపై దండెత్తి శివధనుస్సును, సీతను తనకు ఇవ్వవలసిందని కోరాడు. నేను తృణీకరించడంతో నాతో యుద్ధంచేసి మరణించాడు. సాంకాశ్యరాజ్యానికి నా తమ్ముణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశాను" – అని తన వంశక్రమాన్ని పేర్కొన్నాడు.

'నేటి నుండి మూడవరోజున ఉత్తర ఫల్గుణీ నక్షత్రం. ఆ రోజు వివాహ కార్యక్రమం జరిపించవచ్చు. నా మొదటి కూతురు సీతాదేవిని రామచంద్రునికి, రెండవ కుమార్తె ఊర్మిళను లక్ష్మణస్వామికిచ్చి వివాహం చేస్తా' నని మూడుసార్లు జనకుడు పలికాడు.

జనక మహారాజు ఇలా చెప్పిన తర్వాత విశ్వామిత్ర మహాముని వశిష్ఠమహర్షి సమక్షంలో దశరథునితో "ఇక్ష్వాకు, విదేహ మహారాజుల వంశాలు రెండూ సాటిలేనివి. ధర్మాత్ముడైన కుశధ్వజుని కుమార్తెలు మాండవీ శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నులకిచ్చి వివాహం జరిపిస్తే మంచిది" అని పేర్కొన్నాడు. అందరూ ఆనందించారు. అందరి సమ్మతి మీద పండితుల నిర్ణయం మేరకు నాటికి మూడవ రోజున సంతాన ప్రదుడైన భగప్రజాపతి 'ఉత్తర' నక్షత్రంలో ఉన్నప్పుడు వివాహం జరిపించాలని నిర్ణయించారు. నిర్ణయించిన ముహూర్తంలో మహావైభవోపేతంగా వివాహాలు జరిగాయి. పెళ్ళికి ముందే కేకయరాజ పుత్రుడు, భరతుడి మేనమామ అయిన 'యుధాజిత్తు' అక్కడికి వచ్చాడు. తన తండ్రి ఆజ్ఞ మేరకు మేనల్లుడిని చూడాలని అయోధ్యకు వెళ్ళి, అటునుంచి మిథిలానగరం చేరుకున్నానని చెప్పాడు.

వివాహ సమయంలో సర్వాలంకారభూషిత అయిన సీతను అగ్ని సమక్షంలో శ్రీరాముడి ఎదురుగా కూర్చుండబెట్టి కౌసల్యానందనుడైన శ్రీరామచంద్రునితో ఇలా అన్నాడు–



## బ్రహ్మర్షి విశ్వామిత్రుడు

విశ్వామిత్రుడి రాకను తెలుసుకున్న జనకమహారాజు తన పురోహితుడైన శతానంద మహర్షితో (అహల్యాగౌతముల పుత్రుడు) కలిసి వెళ్ళి ఆయన అర్ఘ్యపాద్యాదుల్ని, అతిథి సత్కారాలు నెరపి పూజించాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణుల్ని పరిచయంచేసి, జరిగిన వృత్తాంతాలన్నిటినీ తెలియజేశాడు. తన తల్లి శాపవిముక్తికి కారణమైన రాముణ్ణి కీర్తిస్తూ, అందుకు ప్రేరకుడైన విశ్వామిత్ర మహర్షి చరిత్రను శతానందుడు చెప్పాడు –

విశ్వామిత్రుడు క్షత్రియుడు. గాధి పుత్రుడు. చాలాకాలం ప్రజారంజకంగా పాలన చేసినవాడు. అక్షౌహిణీ సైన్యంతో చతురంగబలాలతో భూమండలం అంతటా సంచరిస్తూ ఒకనాడు వసిష్ఠ ఆశ్రమానికి వచ్చాడు. వసిష్ఠమహర్షి కామధేనువు సంతతి అయిన 'శబల' అనే ధేనువును పిలిచి అతిథి మర్యాదలు చెయ్యమన్నాడు. 'శబల' శక్తిని చూసి విశ్వామిత్రుడు ఆ ధేనువును కోరగా,వసిష్ఠుడు నిరాకరించడంతో బలవంతంగా గోవును తీసుకుపోసాగాడు.

**'శబల'** అపారసైన్యాన్ని సృష్టించి విశ్వామిత్రుడి సైన్యాన్ని నాశనం చేసింది. విశ్వామిత్రుడు ఆగ్రహించి ఆ సైన్యాన్ని నిర్మూలించి వసిష్ఠమహర్షి మీదికి వెళ్ళాడు. విశ్వామిత్ర సంతానమైన రాకుమారులు వసిష్ఠుణ్ణి నిగ్రహించారు. వసిష్ఠుడు తన తపశ్శక్తితో వాళ్ళని నిర్మూలించాడు. తన రాజదండం మహర్షి బ్రహ్మదండం ముందు వ్యర్థమని భావించి విశ్వామిత్రుడు మిగిలిన ఒక కుమారుడికి రాజ్యం అప్పగించి బ్రహ్మ గురించి ఘోర తపస్సుచేసి, ఆయనచేత 'రాజర్షి' అని పిలిపించు కున్నాడు. కాని తృప్తి చెందని విశ్వామిత్రుడు మళ్ళీ తపస్సు మొదలుపెట్టాడు.

వంద యజ్ఞాలు చేసిన త్రిశంకువు బొందితో స్వర్గానికి వెళ్ళాలని, కులగురువు వసిష్ఠుడు, అతడి పుత్రులచేత తిరస్కరింపబడి విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించాడు. విశ్వామిత్రుడు తన తపశ్శక్తినంతా ధారపోసి త్రిశంకువు కోసం నూతన స్వర్గాన్ని సృష్టించాడు. తర్వాత పశ్చిమదిక్కుకు వెళ్ళి ఘోరతపస్సు చేశాడు. యజ్ఞపశువుగా అంబరీషుడి వెంట వెళ్తున్న శునశ్శేపుడికి అభయం ఇచ్చి అగ్నిమంత్రాలను అతడిచే పఠింపజేసి విముక్తి కల్గించాడు.

తపశ్శక్తి తరిగిపోగా మళ్ళీ తపోదీక్షకు పూనుకున్నాడు. మేనకచేత ఆకర్షింబడి కామపరవశుడై పది సంవత్సరాలు గడిపాడు. ఇదంతా దేవతలు కుట్ర అని గ్రహించి, మళ్ళీ తపస్సు మొదలుపెట్టాడు. బ్రహ్మ దేవతలతో ప్రత్యక్షమై 'నువ్వు మహర్షివి అయ్యావు' అన్నాడు. విశ్వామిత్రుడు 'నేను జితేంద్రియుడినే కదా' అని అడిగాడు. 'దానికింకా పరిపక్వత కావాలి' అని బ్రహ్మ పలికి అంతర్ధానం అయ్యాడు.

ఇంద్రుడు రంభను మన్మథుడి సహకారంతో విశ్వామిత్రుడి తపోభంగానికి పంపిస్తాడు. రంభనుచూసి ఇంద్రుడి పన్నాగం అని గ్రహించి ఆమెను పదివేల సంవత్సరాలు రాయిగా పడి ఉండమని శపించాడు. తనలోని కోపాన్ని నిగ్రహించడానికి మళ్ళీ తపస్సు చెయ్యసాగాడు. ఇంద్రుడి పరీక్షను నెగ్గి కోపాన్ని జయించి, దీర్ఘకాలం తపస్సు చెయ్యగా, ఆ వేడికి లోకాలన్నీ తపించసాగాయి. అప్పుడు బ్రహ్మ దేవతలతో సాక్షాత్కరించి 'నువ్వు బ్రహ్మర్షివి' అన్నాడు. విశ్వామిత్రుడు వసిష్ఠుని అంగీకారం కోరగా వశిష్ఠముని వచ్చి 'నువ్వు బ్రహ్మర్షివే' అన్నాడు.

విశ్వామిత్రచరిత్రను వివరించిన శతానందుడు 'ఇంతటి అమోఘ తపస్సంపన్నుని సాన్నిహిత్యం నీకు సర్వవిధాల శ్రేయస్కరం' అని రాముడితో చెప్పగా రామలక్ష్మణులు ఆనందించారు. ఆ తర్వాత వారి వారి ఆవాసాలకు చేరుకున్నారు.

## శివధనుర్భంగం

మరుసటి దినం జనకుడు విశ్వామిత్రుణ్ణి, రామలక్ష్మణుల్ని ఆహ్వానించాడు. తాను చెయ్యగల కార్యాన్ని ఆదేశించమని జనకుడు విశ్వామిత్రుని అడిగాడు. రామలక్ష్మణులకు శివధనుస్సు చూపించవలసిందని విశ్వామిత్రుడు కోరాడు. జనకుడు అప్పుడు శివధనుస్సు తన ఇంట్లో ఉండటానికి కారణం చెప్పాడు – తమ మూలపురుషుడైన 'నిమి' వంశంలో ఆరవ చక్రవర్తి అయిన దేవరాతునికి, తాను దక్షయజ్ఞంలో ప్రయోగించిన ధనుస్సును శివుడు న్యాసంగా (భద్రపరచి మళ్ళీ యజమానికి ఇవ్వవలసిన వస్తువు) ఇచ్చాడు. అప్పటి నుంచి ఆ ధనుస్సు ఆ వంశంరాజులతో పవిత్రంగా పూజింపబడుతూ ఉంది. సీత జన్మవృత్తాంతాన్ని కూడా జనకుడు తెలియజేశాడు.

"ఒకప్పుడు నేను యాగనిమిత్తం భూమిని దున్నుతుండగా నాగటిచాలు నుంచి ఒక శిశువు వెలువడింది. నాగలి చాలున లభించినందువల్ల ఆమెకు సీత *(సీత అంటే నాగలిచాలు అని అర్థం)* అని పేరుపెట్టి, అపురూపంగా పెంచుతున్నాను. ఆమె అయోనిజ అయినా నాచేత పెంపబడినందువల్ల నాకూతురయింది. ఆమెకు వరుణ్ణి నిర్ణయించడానికి పరాక్రమమే శుల్కంగా పరిగణించాను. శివధనుస్సును ఎక్కుపెట్టినవాడే ఆమెకు భర్తగా నిర్ణయించాను. ఎందరో రాజకుమారులు ప్రయత్నించి విఫలులయ్యారు. ఆ కారణంగా వాళ్ళందరూ నాపై పగబూని దండెత్తారు. కాని దేవతలు అనుగ్రహంతో వాళ్ళని నిగ్రహించ గలిగాను".

జనకుడి మాటలు విన్న తర్వాత శివధనుస్సును రాముడికి చూపమని విశ్వామిత్రుడు అడిగాడు. జనకుని ఆదేశంతో బలిష్ఠులు, దీర్ఘకాయులైన అయిదువేలమంది పురుషులు ఎనిమిది చక్రాలున్న బండిపై ఉన్న ఆ ధనుస్సున్న పెట్టెను తోసుకువచ్చారు. విశ్వామిత్రుని



ఆదేశంతో రాముడు ఆ పెట్టెను తెరచి ధనుస్సు మధ్యభాగాన్ని అవలీలగా పట్టుకున్నాడు. శ్రీరాముడి కరస్పర్శతోనే ఆ ధనుస్సు వంగింది. వింటి నారిని సంధించి, దాన్ని ఆకర్ణాంతం (చెవుల వరకు) లాగాడు. వెంటనే విల్లు పెళ్ళున విరిగింది. అది పిడుగుపాటులా ధ్వనించడంతో భూమి కంపించింది. పర్వతాలు బద్దలైనట్లు తోచింది. రామలక్ష్మణులు, జనకవిశ్వామిత్రులు తప్ప అందరూ మూర్ఛపోయారు.

## పెళ్ళిసందడి

జనకుడు ఆనందభరితుడై తన పుత్రిక రాముణ్ణి భర్తగా పొంది మా వంశకీర్తి ప్రతిష్ఠల్ని ఇనుమడింప చెయ్యగలదన్నాడు. విశ్వామిత్రుని అనుమతితో మంత్రులను పిలిచి అయోధ్యకు వెళ్ళి ఈ శుభవార్తను దశరథమహారాజుకు తెలియజెయ్యమన్నాడు. మూడు రోజులపాటు నిర్విరామంగా పయనించి వాళ్ళు దశరథుడికి వివరాలు వెల్లడించారు.

ఆ రాత్రి దశరథుడు మంత్రి పురోహితాది సమస్త అధికార ప్రతినిధుల్ని సమావేశ పరచి, ఆ పరమానందవార్తను తెలియజేసి సమస్త సన్నాహాలతో మరునాటి ఉదయం విదేహ (మిథిలానగరం) రాజ్యానికి పయనం అయ్యాడు. నాలుగు రోజులు పయనించి మిథిలానగరానికి కోసలదేశ (అయోధ్యానగర) పరివారమంతా చేరుకున్నారు. ఇంతలో జనకుడు సాంకాశ్యనగర పాలకుడైన తన తమ్ముడు కుశధ్వజుని ఆహ్వానించాడు. పరస్పర కుశలాదిక ప్రశ్నలు అయిన తర్వాత వివాహ సుముహూర్త నిర్ణయానికి సమావేశమైనప్పుడు వసిష్ఠుడు దశరథమహారాజు వంశక్రమాన్ని తెలియజేశాడు. ఆ క్రమం ఇలా ఉంది.

అవ్యక్త పరబ్రహ్మ–చతుర్ముఖబ్రహ్మ–మరీచి–కశ్యపుడు–సూర్యుడు(వివస్వంతుడు)–వైవస్వత మనువు (తొలి ప్రజాపతి)– ఇక్ష్వాకువు (తొలి అయోధ్యాపతి) – కుక్షి – వికుక్షి–బాణుడు–అనరణ్యుడు–పృథువు–త్రిశంకువు–దుందుమారుడు–యవనాశ్వుడు–మాంధాత–సుసంధి (ఇతనికి ధ్రువసంధి, ప్రసేనజిత్తు అనే ఇద్దరు కొడుకులు), ధ్రువసంధి పుత్రుడు భరతుడు–అసితుడు–సగరుడు–అసమంజుడు–అంశుమంతుడు–దిలీపుడు–భగీరథుడు–కకుత్స్థుడు–రఘుమహారాజు–ప్రవృద్ధుడు(కల్మాషపాదుడు)–శంఖణుడు–సుదర్శనుడు–అగ్నివర్ణుడు–శీఘ్రగుడు–మరువు–ప్రశుశ్రుకుడు–అంబరీషుడు–నహుషుడు–యయాతి–నాభాగుడు–అజుడు–దశరథుడు–రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు.

పై వంశక్రమంలో సుప్రసిద్ధులైన కొందరు చక్రవర్తుల పేర్లతో రాముణ్ణి సంబోధించడం రామాయణం అంతటా కన్పిస్తుంది. ఇనవంశోద్భవుడు, ఇక్ష్వాకుతిలకుడు–కాకుత్స్థుడు–రఘురాముడు అని సంబోధింపబడటంతోబాటు దశరథుని పుత్రుడు కనుక దాశరథిగా, సీతకు పతి కనుక సీతాపతిగా కూడా సంబోధించడం మిక్కుటంగా అనేక రామాయణగాథల్లో కన్పిస్తుంది. 'అతిపవిత్రమైన ఇక్ష్వాకు కులసంభవులైన రామలక్ష్మణులకు

రామాయణం అంతటా శకునాల ప్రస్తావన, గ్రహాల స్థితిగతులు, ముహూర్తాల నిర్ణయం కన్పించినట్లే బాలకాండలోనూ చోటుచేసుకున్నాయి. విశ్వామిత్రుని కారణంగా రాముడికి లభ్యమైన దివ్యాస్త్రాలు, భావి రామ విజయానికి పునాదులు వేశాయి. విశ్వామిత్రుడు చెప్పిన ఉపకథలద్వారా మంచి చెడుల్ని గ్రహించి, చెడువల్ల కలిగే చేటును నొక్కి చెప్పడం జరిగింది. ఇంద్రియ నిగ్రహం యొక్క ఔన్నత్యాన్ని విశ్వామిత్రుని కథ ద్వారా గ్రహించవచ్చు. సీతారాముల కలయిక భారతీయ ఉన్నత గార్హస్థ్య జీవితానికి నిదర్శనం. భావి దుష్ట సంహారానికి సంకేతం.

## అద్భుత కల్పన

అహల్యను రాయిగా పడి ఉండమని గౌతముడు శపించినట్లు తర్వాత వెలువడిన రామాయణాల్లో కన్పిస్తుంది. రాతిని నాతిగా చేసిన రఘురాముడిగా ఈ కల్పన కన్పిస్తుంది. అంతేకాక అహల్యావిమోచనానంతరం మిథిలానగరం వెళ్తున్న సందర్భంలో గంగానదిని దాటవలసివచ్చినపుడు నావికుడు రాముడితో చెప్పిన మాటలు మనోహరమైన వర్ణన.

**శ్లో॥ *క్షాళయామి తవ పాదపంకజం నాథ! దారుదృషదోః కిమన్తరమ్।***
***మానుషీకరణచూర్ణమస్తి తే పాదయోరితి కథా ప్రథీయసీ ॥*** *(బాల. 6-3)*

ప్రభూ! వస్తువును స్త్రీగా మార్చే శక్తి నీ పొడి పాదాలకు ఉందని అంటున్నారు. కట్టెకు రాయికి మధ్య తేడా ఏముంది? కనుక పద్మంవంటి నీ పాదాలను కడుగుతాను.

ఇంకా చమత్కారమైన మాటలు నావికుడు చెప్పినట్లు కల్పించబడింది.

**శ్లో॥ *పాదామ్బుజం తే విమలం హి కృత్వా***
***పశ్చాత్పరం తీరమహం నయామి।***
***నోచేత్తరీ సద్యువతీ మలేన***
***స్యాచ్చేద్విభో విద్ధి కుటుంబహానిః॥*** *(బాల. 6-4)*

దేవా! నేను నీ పాదపద్మంలోని ధూళిపోయేటట్లు కడిగి తర్వాత గంగానది అవతలి ఒడ్డుకు తీసుకువెళ్తాను. లేకపోతే నీ పాదధూళి చేత ఈ నావ మంచి యువతి అయిందంటే నా కుటుంబానికి నష్టమని తెలుసుకో!

రాముణ్ణి నది దాటించే సమయంలో గుహుడు చెప్పినట్లు కూడా కొన్ని రామాయణాల్లో కల్పించబడింది.

**శ్లో॥ *శ్రీకంఠచాపదళనధురీణబాలబాహవే ।***
***నమః సీతానుషక్తాయ రామాయాపన్నివారిణే ॥***

**శ్లో॥ *అన్యోన్యసదృశాకారౌ త్రైలోక్యగృహదంపతీ।***
***ఇమౌ యువాం ప్రణామ్యహం భజామ్యద్యకృతార్థతామ్॥***

* * * * *



**శ్లో॥ *ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ ।***
***ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥*** *(బాల. 73-26)*

నా పుత్రిక అయిన సీత నేటినుంచి నీకు సహధర్మచారిణి. (ధర్మార్థకామ ఆచరణ లోను, కష్టసుఖాలలోను సర్వదా ఈమె తోడుగా ఉంటుంది.) విధ్యుక్త ధర్మాన్ని అనుసరించి పాణిగ్రహణం చెయ్యవలసింది. నీకు శుభం కలుగుతుంది. (మిక్కిలి ప్రేమాదరాలతో ఈమెను స్వీకరించు.)

పై విధంగానే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు క్రమంగా ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులను జనక, కుశధ్వజులు కన్యాదానం చేశారు.

వివాహానంతరం మరునాడు విశ్వామిత్రుడు హిమవత్పర్వతాలకు పయనం అయ్యాడు. దశరథుడు కూడా సపరివారంగా అయోధ్యానగరానికి పయనం అయ్యాడు. జనకుడు తన కుమార్తెలకు అరణంగా ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, వీరులైన యోధులు, దాసదాసీజనాన్ని ఇచ్చాడు. పుష్కలంగా వెండి,బంగారు,ముత్యాలు,పగడాలను కన్యాధనంగా సమర్పించాడు.

## పరశురాముని గర్వభంగం

అయోధ్యానగరానికి వధూవరులతో బయలుదేరిన దశరథునికి అనేక అపశకునాలు తోచాయి. దశరథుడు ఆందోళనతో ఉండగా వసిష్ఠుడు శకున ఫలితాలను వివరించాడు.

పక్షుల భయంకరమైన అరుపులు రాబోయే అశుభాన్ని సూచిస్తున్నాయి. కాని మృగాల ప్రదక్షిణలు వాటి ఉపశమనాన్ని తెలుపుతున్నాయి. ఇలా మాట్లాడుతున్న సమయంలోనే భూమిని కంపింపజేస్తూ, చెట్లను పడగొడుతూ పెద్ద సుడిగాలి వీచింది. గాఢాంధకారం అలముకుంది. వసిష్ఠుడు, ఇతర మహర్షులు, దశరథుడు, ఆయన పుత్రులు మాత్రం చైతన్యంతో ఉన్నారు. ఇతరులు నిశ్చేష్టులయ్యారు. ఆ సమయంలో జమదగ్ని కుమారుడైన పరశురాముడు కన్పించాడు. అప్పుడు వసిష్ఠాది మహర్షులు తమలో తాము తర్కించుకోవడం మొదలుపెట్టారు.

'పూర్వం క్షత్రియుడైన కార్తవీర్యార్జునుడు ఇతని తండ్రి జమదగ్నిని చంపడంవల్ల క్షత్రియులపై కోపించి చంపినట్లే ఇప్పుడుకూడా వచ్చాడేమో' నని భావించారు.

పరశురాముడు శ్రీరాముని చూసి 'నువ్వు శివధనుస్సుని విరిచిన పరాక్రమవంతుడి వని విన్నాను. ఇదిగో విష్ణు ధనుస్సు. ఇది శివధనుస్సు కంటె అధికశక్తిమంతంగా దేవతలు, ఋషులచేత భావింపబడింది. ఋచీకుడు వద్ద న్యాసంగా శ్రీ మహావిష్ణువు ఉంచాడు. ఈ ధనుస్సును తన కుమారుడు, నా తండ్రి అయిన జమదగ్నికి ఋచీకుడు ఇచ్చాడు. నా తండ్రి అస్త్రసన్యాసం చేసిన సమయంలో కార్తవీర్యార్జునుడు ఆయనను సంహరించాడు.

నేను ఇరవై ఒక్కసార్లు దండెత్తి క్షత్రియుల్ని పుట్టినవాణ్ణి పుట్టినట్లు తుదముట్టించాను. ఈ భూమండలాన్ని జయించి కాశ్యపమహర్షికి దక్షిణగా సమర్పించాను. తపోబలంతో మహేంద్రగిరి చేరి అక్కడ ప్రశాంతంగా తపం చేస్తున్నాను. శివధనుస్సు విరిచిన సంగతి తెలిసి వచ్చాను. నీకు శక్తి ఉంటే నాకు తాతల నుంచి సంక్రమించిన ఈ విష్ణుధనుస్సును గ్రహించు. బాణాన్ని సంధించు. అప్పుడు నీతో ద్వంద్వయుద్ధం చేస్తాను' అన్నాడు.

దశరథుడు ఎంత ప్రాధేయపడినా పరశురాముడు విన్పించుకోలేదు. శ్రీరాముడు కోపంతో పరశురాముని నుంచి ధనుర్బాణాలు గ్రహించాడు. బాణాన్ని సంధించాడు. పరశురాముడు తన వైష్ణవ తేజాన్ని కోల్పోయాడు. రాముడు పరశురామునితో ఇలా అన్నాడు – "నువ్వు బ్రాహ్మణుడివి కనుక నాకు పూజ్యుడివి. పైగా నాకు మిక్కిలి పూజ్యుడైన విశ్వామిత్రుని సోదరి సత్యవతికి మనుమడివి. (పరశురాముని తాత అయిన ఋచీకుని భార్య సత్యవతి, వారి కుమారుడు జమదగ్ని. జమదగ్ని పుత్రుడు పరశురాముడు) కనుక నీ ప్రాణాలు తియ్యడం నాకు ఇష్టం లేదు. క్షణకాలంలో ఒక లోకం నుంచి మరో లోకానికి వెళ్ళగల గమనశక్తి నీకుంది. తపోబలంతో సాధించుకున్న సాటిలేని పుణ్యలోకాలు ఉన్నాయి. ఈ బాణ ప్రయోగంలో దేనిని నశింపజెయ్యాలి. నువ్వు కోరినట్లే చేస్తాను".

పరశురాముడు శ్రీరాముని సాక్షాత్తు శ్రీమహావిష్ణువే అని గ్రహించి "రామా! కశ్యప మహర్షికి ఈ భూమండలాన్నంతటినీ సమర్పించాను. కనుక నేనిక్కడ నివసించరాదు. నా గమనశక్తితో మహేంద్రగిరి వెళ్ళాలి. కాబట్టి నా పుణ్యరాశుల్ని నశింపజెయ్యి" అని రాముడితో అన్నాడు. బాణప్రయోగంతో పరశురాముని పుణ్యరాశులు నశించాయి. అతడు మహేంద్రగిరికి చేరుకున్నాడు. ఆవరించిన చీకట్లు తొలగాయి. శ్రీరాముడు ధనుర్బాణాలను వరుణదేవుడికి న్యాసంగా సమర్పించాడు.

అయోధ్యానగరం చేరుకున్న తర్వాత సుఖసంతోషాలతో కాలం గడిపారు. కొంత కాలానికి దశరథుడు భరతుడ్ని పిలిచి 'యుధాజిత్తు నిన్ను తీసుకొని పోవడానికి వచ్చి ఇక్కడే ఉన్నాడు. మీ తాతగారికి ప్రీతి కూర్చడానికి నీ మేనమామతో అక్కడికి వెళ్ళు' అన్నాడు. తండ్రి మాటను శిరసావహించి భరతుడు తల్లిదండ్రులకు, గురువులకు శ్రీరాముడికి నమస్కరించి, లక్ష్మణుని ఆలింగనం చేసుకొని, తమ్ముడైన శత్రుఘ్నుడితో తల్లుల వద్ద సెలవు తీసుకొని తాతగారింటికి పయనం అయ్యాడు.

శ్రీరాముడు పౌరులకు ప్రియాన్ని, హితాన్ని కూర్చే కార్యాలను నెరవేర్చేవాడు. వేదాలు, ధర్మశాస్త్రాలు పేర్కొన్న రీతిలో రామలక్ష్మణుల తల్లిదండ్రులకు, గురువులకు తగిన సేవలను అందించసాగారు. శ్రీరాముడి సౌశీల్యం, ఉదాత్త ప్రవర్తన, సద్గుణాలు చూసి దేశవాసులందరూ సంతోషించారు.



సీతారాముల పరస్పరానురాగం దినదిన ప్రవర్ధమాన మయింది. లక్ష్మీదేవి సహిత శ్రీ మహావిష్ణువులా సీతారాములు సకల భోగభాగ్యాలతో శోభిల్లసాగారు.

## కొన్ని విశేషాలు

**బాలకాండ 77 సర్గలతో, 2249 శ్లోకాలతో విలసిల్లుతూ ఉంది.** సప్తర్షుల అనుగ్రహంతో బోయ, మహర్షి అయ్యాడు. ఆ మహర్షి ఇచ్చిన శాపం ఆయన పాలిట వరమై ఆదికవిగా, ఆదిమహాకావ్యం రూపొందడానికి కల్పించింది. రామాయణమంతటా వరాలు, శాపాలు కోకొల్లలుగా కన్పిస్తాయి. వాల్మీకి రామాయణంలో 61 శాపాలు, 82 వరాలు చోటు చేసుకున్నాయి అని శ్రీ ర.బిడే పేర్కొన్నారు. (వాల్మీకి రామాయణము శాపములు–వరములు).

వాల్మీకి శాప శ్లోకం మంగళాచరణ శ్లోకంగా పండితులు విశ్లేషించారు. (శ్రీమద్రామాయణము – గీతాప్రెస్ – గోరఖ్‌పూర్ – 1వ సంపుటం, పుట–80)

***శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః।***
***యత్ క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్॥***

'ఓ శ్రీనివాసా! కామాతురుడైన దుష్టరావణుని చంపి, నువ్వు చిరస్థిరకీర్తి పొందావు' అని పండితుల వివరణ.

ఈ శ్లోకంలో రామాయణంలోని ఏడుకాండల కథాంశాలు సూచింపబడ్డాయని పేర్కొన్న పండితులున్నారు.

1. **మా, నిషాద** – లక్ష్మీదేవి అవతారం అయిన సీతాదేవిని చేబట్టినవాడా! ఇది సీతారాముల కళ్యాణాన్ని అంటే బాలకాండను సూచిస్తుంది.
2. **ప్రతిష్ఠాం,త్వం, అగమః** – పితృవాక్య పరిపాలనచేసి కీర్తిగాంచావు. ఈ పదాల ద్వారా అయోధ్యాకాండ స్ఫురిస్తుంది.
3. **శాశ్వతీః సమాః** – ఆడినమాట తప్పక పెక్కు సంవత్సరాలు అరణ్యవాసం చేశావు. అరణ్యకాండ వృత్తాంతాన్ని తెలియజేస్తుంది.
4. **క్రౌంచమిథునాత్** – తారావాలి దంపతులతో (కుటిల ప్రవర్తనగల) వాలివధ కిష్కింధకాండ సూచన.
5. **ఏకమ్** – ఏకైక వీరుడు హనుమంతుడు, సుందరకాండ
6. **అవధీః** – లోక కంటకుడైన రావణ సంహారం చేశావు యుద్ధకాండ ధ్వనిస్తుంది.
7. **కామమోహితమ్** – పట్టాభిషేకం తర్వాత సీతాదేవి వనవిహార కుతూహలం – ఉత్తరకాండ వృత్తాంతం.

## మంథర మాత్సర్యం - మంత్రాంగం

శ్రీరాముడి యువరాజ పట్టాభిషేక వార్తవినగానే ప్రజలందరూ సంబరాలు చేసుకున్నారు. పట్టణమంతా అలంకారాలతో ప్రకాశించింది. ఎక్కడ చూసినా పండుగ వాతావరణం నెలకొంది. శ్రీరాముడు వేకువజామునే లేచి తన గృహానికి అలంకారాలు చేయించాడు. కాలకృత్యాలు తీర్చిన తర్వాత సూర్యోపాసనతో గాయత్రీ మంత్రం జపించాడు. బ్రాహ్మణులు శ్రీ సీతారాములను స్వస్తి వచనాలతో ఆశీర్వదించారు.

పురమంతటా వేదఘోషలు మిన్నుముట్టాయి. ఈ సందడిని కైకేయి అరణపుదాసి (పుట్టినింటి నుంచి మెట్టినింటికి కైకేయి వెంట వచ్చిన పరిచారిక) ప్రాసాదం మీద నుంచి చూసింది. సమీపంలోనే ఉన్న మేడమీద శ్రీరాముణ్ణి పెంచిన దాదిని చూసి విశేషం ఏమిటని ప్రశ్నించింది. మంథర గురించి తెలిసినా సంతోషంతో ఉన్న ఆ దాది పట్టాభిషేక వార్తను చెప్పింది. గూనిదైన మంథర లోలోపల కుతకుతలాడింది. మండిపడుతూ కైలాస శిఖరం వంటి ఎత్తైన రాజప్రాసాదం నుంచి త్వరగా దిగి శయ్యపై పడుకొని ఉన్న కైక వద్దకు వెళ్ళి తాను తెలుసుకున్న వార్తను ప్రకటించింది. కైక వెంటనే అపరిమితమైన ఆనందంతో ఆ ప్రియవార్తను తీసుకొచ్చిన ఆమెను ఏదైనా వరం కోరుకొమ్మంది.

మంథర ఛీత్కరించుకొని క్రమక్రమంగా దుర్బోధ చేస్తూ రాముడు రాజయితే కౌసల్య రాజమాత అవుతుందని, కైకేయి దాసిలా జీవించవలసివస్తుందని, అలాగే భరతుడు సేవకుడిగా పరిచర్యలు చెయ్యవలసివస్తుందని, పైగా రాముడి తర్వాత రాజ్యార్హతగల భరతుడికి భద్రత ఉండదని చెప్పి కైక మనస్సును పూర్తిగా విషపూరితం చేసింది. రామ పట్టాభిషేక భంగానికై ఆలోచించి కైకతో ఇలా అంది.

"నీ భర్త దశరథుడు పూర్వం జరిగిన దేవాసుర యుద్ధంలో ఇంద్రుడికి సాయపడాలని భావించి తన అనుచరగణమైన రాజులతో, నిన్ను వెంటబెట్టుకొని దండకారణ్యంలో శంబరాసురుడనే తిమిధ్వజుడు నివసించే వైజయంతపురం చేరాడు. అక్కడ దశరథునికి, రాక్షసులకు మధ్య ఘోరయుద్ధం జరిగింది. ఆ పోరులో గాయపడి మూర్ఛితుడైన దశరథుని, రథసారథిగా ఉన్న నువ్వు రణరంగానికి దూరంగా తీసుకువెళ్ళావు. అక్కడ కూడా రాక్షసుల శస్త్రాలకు గురై గాయపడిన ఆయనను మరో చోటికి తీసుకువెళ్ళి శీతోపచారాలతో కాపాడావు. అలా తన్ను ఆదుకున్న నిన్ను చూసి, పరవశించి ఏవైనా రెండు వరాలు కోరుకొమ్మని దశరథుడు చెప్పాడు. నువ్వు నాకు ఇష్టం అయినప్పుడు వరాలు అనుగ్రహించమని కోరావు. అందుకతడు అంగీకరించాడు. ఎలాగైనా నీ భర్తను ఒప్పించి రామపట్టాభిషేకాన్ని ఆపించు. భరతుని యువరాజ పట్టాభిషిక్తుణ్ణి చెయ్యమని, రాముడు పద్నాలుగు సంవత్సరాలు వనవాసానికి పంపమని రెండు వరాలు కోరు, ఆ పద్నాలుగు ఏళ్ళ పాలనలో భరతుడు తన ప్రజారంజక పాలనద్వారా ప్రజల అభిమానాన్ని చూరగొన గలడు" అని తన దురాలోచనను వివరించింది.



# అయోధ్యా కాండం

***రామాభిరామం నయనాభిరామం - వాచాభిరామం వదనాభిరామమ్ ।***
***సర్వాభిరామం సదాభిరామం వందే - సదా దాశరథిం చ రామమ్ ॥***

## రామపట్టాభిషేక సంకల్పం - సన్నాహం

భరతశత్రుఘ్నులు మాతామహుని ఇంట్లో సర్వసుఖాలు,అందరి ఆదరాభిమానాలను పొందుతున్నా తండ్రి దశరథుని స్మరిస్తూ ఉండేవారు. యుధాజిత్తు (అశ్వదళాలపై పర్యవేక్షణ చేసేవాడు కనుక అశ్వపతి అని కూడా ప్రసిద్ధిగాంచాడు) ఇద్దరినీ పుత్రవాత్సల్యంతో చూసేవాడు. దశరథుడూ భరతశత్రుఘ్నుల పట్ల బెంగతో ఉండేవాడు. ఇంద్రాది దేవత లెందరున్నా జ్యేష్ఠ పుత్రుడైన బ్రహ్మపై శ్రీ మహావిష్ణువు ప్రీతిపాత్రుడైనట్లే దశరథుడికి శ్రీరాముడు ఎక్కువ ప్రీతిపాత్రుడు.

రఘురాముడు లోకోత్తర సుందరుడు. మహావీరుడు. ఇతరుల సుగుణాలను మాత్రమే గ్రహించేవాడు. సద్గుణాలలో దశరథుని మించినవాడు. మృదుస్వభావి. మధుర భాషణుడు. అస్త్రాభ్యాసం చేస్తున్నా విరామసమయాల్లో జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు, సజ్జనులతో వివిధ విషయాలు చర్చించేవాడు. కోపాన్ని జయించినవాడు. దయార్ద్ర హృదయుడు, వేదజ్ఞులకు ఎదురుగా వెళ్ళి పూజించేవాడు. దీనజన సంరక్షకుడు. సామాన్య విశేషధర్మాలు చక్కగా తెలిసినవాడు. నియమనిష్ఠల్ని పాటించేవాడు. దుష్టనిగ్రహం, ప్రజాపరిపాలన అనే క్షత్రియ ధర్మాలు పాటించేవాడు. లౌకిక వైదిక విషయాలు యుక్తియుక్తంగా మాట్లాడటంలో బృహస్పతి వంటివాడు. మానసికంగా, శారీరకంగా చక్కటి ఆరోగ్యం కలవాడు. ఉత్తమోత్తమ గుణాల పెన్నిధి. ఆ కారణంగా ప్రజలందరికీ ఇష్టుడు, బహిః ప్రాణమైనవాడు. వేదవేదాంగాలను, శాస్త్రాలను అధ్యయనం చేసినవాడు శస్త్రాలను (మంత్రాలు పఠించకనే విడిచేవి) ప్రయోగించడంలో ధనుర్ధారాదులందరిలో దశరథుడు మిన్న. ఆయన కంటె రాముడు గొప్పవాడు. కళంకరహితుడు, సత్యవర్తనుడు. అసూయ (ఇతరుల గుణాలను దోషంగా పరిగణించడం) లేనివాడు. గర్వరహితుడు. మాత్సర్యం (ఇతరుల ఉన్నతిని చూసి ఓర్వలేకుండటం) లేనివాడు. అతిరథులచేత (ఒకే సమయంలో పలువురు విలుకాండ్రతో పోరాడగల యోధులు) పూజలందుకునేవాడు.

ఇటువంటి సాటిలేని శుభలక్షణాలలో, విశిష్టగుణాలతో శోభిల్లే రాముడు రాజైతే ప్రజలు సుఖసంతోషాలతో జీవిస్తారని, దశరథుడు భావించాడు. పైగా తాను వయోవృద్ధుడు. ఇక పాలనా భారాన్ని మోయలేను. శ్రీరాముణ్ణి యువరాజుగా చెయ్యడానికి మంత్రులతో సమాలోచనం చేసి దశరథుడు నిర్ణయించాడు.

ఆ వెనువెంటనే మహారాజు వివిధ నగర ప్రజల్ని, ఆయా ప్రదేశాలలో ఉండే జానపదుల్ని, దేశంలోని ప్రముఖుల్ని, సామంతరాజుల్ని వేర్వేరుగా రప్పించాడు. వ్యవధి తక్కువ కావడంలో తన మామగారైన కేకయరాజును, శ్రీరామచంద్రుని మామగారైన జనకమహారాజును ఆహ్వానించలేదు. క్రమంగా ఆ శుభవార్త విని వాళ్ళు ఆనందిస్తారని భావించాడు. వచ్చిన అతిథుల్ని సముచితరీతిలో సత్కరించాడు. ఆహ్వానితులు తమకు ఏర్పాటుచేసిన ఆసనాల్లో కూర్చున్నారు.

## సకల జన సమ్మోదం

దశరథుడు తన మనస్సంకల్పాన్ని వెలిబుచ్చాడు. రఘువంశస్థుల ప్రశస్తిని, తన పరిపాలన గురించి ప్రస్తావించాడు. ముసలితనం వల్ల రాజ్యభారాన్ని వదిలి విశ్రాంతి పొందాలని చెప్పాడు. గురుతరమైన పాలనాభారాన్ని ఆంతరంగికులైన బ్రాహ్మణోత్తముల అనుమతితో, ప్రజల శ్రేయస్సు ఆశించి కుమారుడికి అప్పగించాలని భావించినట్లు వివరించాడు. శ్రీరాముణ్ణి యువరాజుగా చెయ్యటం తనకు ఇష్టమైనా, ప్రజలకు హితమయింది మరొకటి ఉంటే చెప్పమని దశరథుడు ప్రకటించాడు.

దశరథుడు ఇలా చెబుతుండగానే సామంతరాజులు, వశిష్ఠాది బ్రాహ్మణోత్తములు, పురప్రముఖులు, జానపదులు తమ హర్షాన్ని ప్రకటించి, రాజు ప్రతిపాదన దేశకాలాలకు తగినదని ఏకాభిప్రాయానికి వచ్చారు. వర్షించే మేఘాన్ని చూసి 'క్రేంకారాలు' చేసే నెమళ్ళ వలె ఆనందంతో దశరథుణ్ణి అభినందించారు. శ్రీరాముడి గుణగణాలను శ్లాఘించారు. తన సంకల్పం సర్వజనామోదం పొందినందుకు దశరథుడు పరమానంద భరితుడయ్యాడు.

## వసిష్ఠ మహర్షి ఆదేశం – తండ్రి హితోపదేశం

తన ప్రతిపాదనను అంగీకరించిన అందరికీ దశరథుడు కృతజ్ఞతల్ని తెలియజేశాడు. "ఈ చైత్రమాసం మనోహరంగా, సర్వసుఖావహంగా ఉంది. ఇది పట్టాభిషేకానికి అనువైన సమయం. మహర్షి! పట్టాభిషేకానికై నిర్వహించవలసిన పనులను గురించి, సిద్ధపరచవలసిన సంభారాల గురించి ఈ రోజే ఆజ్ఞాపించండి" అని వసిష్ఠమహర్షిని ప్రార్థించాడు.

వసిష్ఠుడు సుమంత్రాది మంత్రుల్ని, ఉన్నతాధికారుల్ని పట్టాభిషేక సందర్భంగా చెయ్యవలసిన అన్ని పనులను గురించి స్పష్టంగా వివరించి, వాటినన్నిటినీ వెంటనే



అమలుచెయ్యాలని ఆదేశించాడు. దశరథుడు సుమంత్రునితో శ్రీరాముని తీసుకురమ్మన్నాడు. సుమంత్రుడు రథంలో రాముణ్ణి తీసుకువచ్చాడు.

దశరథుడు కుమారునితో అంతవరకు జరిగిన సంఘటనల్ని తెలియజేశాడు. "సర్వ గుణాలతో శోభిల్లుతున్న నువ్వు వినయవంతుడిగా ప్రవర్తించు. కామక్రోధాలవల్ల కలిగే వ్యసనాలను పరిత్యజించు. పరోక్షంగా గూఢచారులనుంచి, ప్రత్యక్షంగా ప్రజలనుంచి రాజ్యవిశేషాలను వాస్తవాలను గ్రహించి, అధికారుల్ని అన్నివర్గాలవారిని రంజింపజేస్తూ పాలనకొనసాగించు" అని రాజనీతి సంబంధమైన అనేక విషయాలను రాముడికి దశరథుడు తెలియజేశాడు.

ఈ శుభవార్త విన్న శ్రీరాముడు తండ్రికి నమస్కరించి తన భవనానికి చేరుకున్నాడు. ప్రజలందరూ వెళ్ళిన తర్వాత దశరథుడు మంత్రులతో సమాలోచన చేసి ముహూర్తం నిర్ణయించాడు. మంత్రుల్ని పంపించి, తన అంతఃపురానికి చేరిన దశరథుడు మళ్ళీ రాముణ్ణి పిలుచుకు రమ్మని సుమంత్రుని ఆదేశించాడు. రాముడు ఏదైనా అవాంతరం జరిగిందేమో నన్న సందేహంతో తండ్రివద్దకు వచ్చాడు.

రాముడు వచ్చిన పిదప తన కర్తవ్య నిర్వహణ గురించి, చేసిన యజ్ఞాలను గురించి చెబుతూ వందలాది యజ్ఞాలను ఆచరించటం వల్ల **దేవఋణం**, వేదాధ్యయనం చేత **ఋషిఋణం**, సత్సంతాన ప్రాప్తివల్ల **పితృఋణం**, దానధర్మాల కారణంగా **విప్రఋణం**, ధర్మసుఖానుభవంతో **ఆత్మఋణం** అనే ఋణపంచకాన్ని తీర్చుకున్నట్లు చెప్పాడు. తనకు సమీప కాలంగా తరచూ కలలో అనేక అపశకునాలు కన్పిస్తున్నాయని, తన జన్మనక్షత్రంలో అశుభగ్రహాలైన సూర్య, కుజ, రాహువులు చేరినట్లు జ్యోతిష్కులు చెబుతున్నారని చెప్పాడు. ఇంకా "ఈదుర్నిమిత్తాలు రాజు మరణం కాని, తీరని ఆపదలు కాని సంభవించడానికి సూచనలని దైవజ్ఞుల అభిప్రాయం. కనుక నా బుద్ధి మారకముందే నువ్వు పట్టాభిషిక్తుడివి కావాలి. ఈ రోజు చంద్రుడు పునర్వసు నక్షత్రంలో ఉన్నాడు. రేపు పుష్యమీ నక్షత్రంలో ఉన్న సమయంలో పట్టాభిషేకం జరపడం ప్రశస్తం. అందువల్ల ఇప్పటి నుంచే నియమాలు పాటిస్తూ నువ్వూ, సీత రాత్రివేళ ఉపవాసదీక్ష పూని దర్భాసనాలమీద శయనించాలి" అని చెప్పి దశరథుడు రాముణ్ణి సాగనంపాడు.

ఈ వార్తను అప్పటికే విన్న కౌసల్య, సుమిత్ర, లక్ష్మణులు కౌసల్యా మందిరంలో సమావేశమయ్యారు. శ్రీరాముడు తల్లులిద్దరికీ నమస్కరించాడు. వసిష్ఠమహర్షి సీతారాముల చేత ఉపవాసదీక్షను స్వీకరింపజేశాడు.

అయోధ్యా పట్టణమంతటా హాహాకారాలు చెలరేగాయి. పురప్రజలందరి ముఖంలో దైన్యం గోచరిస్తుండగా శ్రీరాముని వనవాస ప్రయాణం కొనసాగింది.

### అనుసరించిన ప్రజలు - అనుమతించని ప్రభువు

సుమంత్రుడు సారథిగా సీతారామలక్ష్మణులు అధిరోహించిన రథధూళిని చూస్తూ దశరథుడు దుఃఖంతో నేలపై పడ్డాడు. కౌసల్యాదేవి సాయంతో దశరథుడు కౌసల్యా మందిరం చేరాడు.

రాముడి వెంట అయోధ్యాపురమంతా కదిలింది. రాముడు వాళ్ళతో తనవెంట రావద్దని, వారికి తనపై ప్రియం ఉంటే అది భరతుడిపై చూపమని, భరతుడు సర్వవిధాల సమర్థుడని చెప్పి అయోధ్యాపురం తిరిగి వెళ్ళమని చెప్పాడు.

బ్రాహ్మణ శ్రేష్ఠులు రాముణ్ణి మరలి రమ్మని, అయోధ్యాపురవాసులకు రక్షగా ఉంటూ పాలించవలసిందని విన్నవించారు. తలపండిన తాము అభ్యర్థిస్తున్నామని, అందుకు సమ్మతించ నట్లయితే తమను వారివెంట తీసుకువెళ్ళమని కోరారు.

ఇంతలో అందరూ తమసానదీతీరం చేరారు. నాటి రాత్రి అక్కడే విశ్రమించారు. ప్రజలెవ్వరూ మేల్కోవడానికి ముందే శ్రీరాముడు సుమంత్రుడిచే రథం సిద్ధం చేయించి, తమసానదిని దాటిన తర్వాత కొంతదూరం ఉత్తరదిశగా (అయోధ్యవైపు) వేగంగా రథాన్ని తోలించాడు. మళ్ళీ వెనక్కి మళ్ళించి అరణ్యంవైపు పయనం కొనసాగించాడు.

ప్రజలు మేల్కొని శ్రీరాముని జాడ తెలియక పోవడంతో అయోధ్యకు తిరుగుముఖం పట్టారు. అలా తిరిగి వచ్చిన భర్తలను భార్యలు నిందించారు.

## అరణ్యగమనం - మునుల సందర్శనం

రాముడు పయనం చేస్తున్న దారిలో పల్లె ప్రజలు కైకేయీ దశరథుల్ని నిందించడం వింటూ రాముడు కోసల రాజ్యభూముల్ని దాటుతూ వెళ్ళాడు. వేదశ్రుతి అనే నదిని దాటి అగస్త్య మహర్షి నివసించే దక్షిణదిక్కువైపు పయనించి గోమతీనదీ తీరం చేరాడు. అక్కడ అనేక జనపదాలను చూపి పూర్వం మనువు ఇక్ష్వాకు మహారాజుకు ఇచ్చిన ప్రదేశం ఇది అని రాముడు సీతకు చెప్పాడు. కోసల దేశపు పొలిమేరలకు చేరిన తర్వాత అయోధ్యానగరం వైపు తిరిగి నమస్కరిస్తూ, దేశరక్షకులైన దేవతల్ని, నగరాన్ని ఉద్దేశిస్తూ తన వన ప్రయాణానికి అనుమతి ఇవ్వమని ప్రార్థించాడు రాముడు.

మహారథుడైన (తనను, తన సారథిని రక్షిస్తూ యుద్ధం చెయ్యగలవాడు) శ్రీరాముడు శృంగబేరపురం సమీపంలోని గంగాతీరాన్ని చేరగానే సుమంత్రుడితో ఈ రాత్రి ఇక్కడే గడుపుదాం అన్నాడు. గుహుడనే నిషాదరాజు ఆ ప్రాంతానికి అధిపతి. శ్రీరామభక్తుడు.



## కైక పంతం - పట్టాభిషేక భగ్నం

కైక వెంటనే కార్యక్రమాన్ని అమలు పరచడానికి పన్నాగం పన్నింది. కోపగృహం లోకి ప్రవేశించింది. తాను ధరించిన ఆభరణాలను విసిరి కొట్టింది. మలిన వస్త్రాలతో వెంట్రుకల్ని ఒకే జడగా ముడివేసుకొని నేలమీద పవ్వళించింది.

దశరథుడు సుమంత్రాది మంత్రులకు శ్రీరామపట్టాభిషేకానికి సంబంధించి ఆజ్ఞల నిచ్చి గురువైన వశిష్ఠుని అనుమతిపొంది, తన అంతఃపురంలోని రాణులకు ఈ శుభవార్తను చెప్పాలని భావించి, ముందుగా తనకు ప్రీతిపాత్రురాలైన కైకేయి గృహానికి వెళ్ళాడు. ప్రతీకారి (ద్వారపాలకురాలు) కైక కోపాన్ని తెలియజేసింది. దశరథుడు విషాదవదను డయ్యాడు. కలవరపడ్డాడు. కాళ్ళూ, చేతులూ తడబడ్డాయి. ఇంద్రియాలు వ్యాకులానికి లోనయ్యాయి.

కోపగృహంలోకి ప్రవేశించి కైకను కోపకారణం ఏమిటని పరిపరివిధాల అడిగి ప్రాధేయపడ్డాడు. ఆమె కోరిక ఏమిటో తీరుస్తానన్నాడు. ప్రమాణపూర్వకంగా మాట ఇమ్మంది కైక.

"రాముణ్ణి చూడక క్షణమైనా నేను జీవించలేను. రాముడి కోసం నా ప్రాణాలను కాని, ఇతర పుత్రుల్ని కాని, బంధుమిత్రుల్నికాని వదిలిపెట్టడానికి సిద్ధంగా ఉన్నాను. ఆ రాముడిపై ప్రమాణం చేస్తున్నాను. కోరికల్ని తెలియజెయ్యి. తప్పక తీరుస్తా" నని దశరథుడు ప్రమాణం చేశాడు.

కైక దశరథునితో మంథర సూచించినట్లే తనకు ఇస్తానన్న రెండు వరాలను భరతుని పట్టాభిషేకం, రామునివనవాసం ద్వారా ప్రసాదించమంది. కైక కోరికల్ని విని దశరథుడు అదరిపడ్డాడు. చింతాక్రాంతుడయ్యాడు. పరితాపానికి లోనయ్యాడు. విలపించి స్పృహ కోల్పోయాడు. దశరథుడు ఎన్నివిధాల విన్నవించుకున్నా బ్రతిమాలినా, కనీసం రామవనవాస కోరికనైనా విడిచిపెట్టమని ప్రాధేయపడినా ఆమె అంగీకరించలేదు. మాట తప్పడం నీతికాదని హెచ్చరించింది కైక. ఆ రాత్రి దశరథునిపాలిట అశనిపాతం అయ్యింది. సూర్యోదయమయింది. పట్టణమంతా చైతన్యవంతమయ్యింది. పురవీథులన్నీ సింగారించు కున్నాయి. సుమంత్రుడు శ్రీరామమందిరానికి వెళ్ళాడు. ఇద్దరూ కలిసి దశరథుని నివాసానికి బయలుదేరారు.

ఆ భవనంలోని మూడు కక్ష్యల్ని రథంలో గడిచి, తర్వాతి రెండు కక్ష్యల్ని కాలినడకతో దాటి, ఆ చోట తన్ను అనుసరిస్తున్న వారిని ఆపి, రాముడు అంతఃపురంలోకి వెళ్ళాడు. శుష్కించిన ముఖంతో దీనంగా ఉన్న దశరథుణ్ణి చూశాడు. కైకను కారణం

అడిగాడు. కైక "ప్రతిజ్ఞాపూర్వకంగా నీ తండ్రి నాకొక మాట ఇచ్చాడు. అది నీ వల్లనే నెరవేరాలి. తన నోటితో దాన్ని చెప్పలేక సతమతమవుతున్నాడు" అని చెప్పింది.

రాముడు –

**శ్లో॥ తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభికాంక్షితమ్ ।**
**కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే ॥** (అయోధ్యా. 18–30)

"తల్లీ! రాజుగారి కోరిక ఏమిటో వివరించు. దాన్ని తప్పక ఆచరిస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను. రాముడు రెండవ మాట పలుకడు (ఆడినమాట తప్పడు)" అని వాగ్దానం చేశాడు.

కైక తాను కోరిన వరాలను చెప్పింది. ఏ వికారాలకు లోను కాని రాముడు తప్పక పితృవాక్యాన్ని శిరసావహిస్తాను. దండకారణ్యానికి పద్నాలుగేళ్ళ వనవాసానికై వెళ్తానన్నాడు. సీతను, కౌసల్యామాతను అనునయించి వస్తానని కౌసల్యా మందిరానికై బయలుదేరాడు.

## పితృవాక్య పాలన – పురప్రజల ఆవేదన

రాముడు కౌసల్యా మందిరానికి వెళ్ళాడు. ఆమెకు నమస్కరించి తన వనవాస వార్తను తెలియజేశాడు. ఆమె దుఃఖం వర్ణనాతీతం. "నువ్వు యువరాజువైతే నా కష్టాలన్నీ కడతేరుతాయని ఆశించాను. నువ్వు జన్మించిన నాటి నుంచి (ఉపనయనం–రెండవజన్మ) పదిహేడు సంవత్సరాలుగా నేను ఈ రోజుకోసం నిరీక్షించాను" అని కౌసల్య బాధపడింది. రాముడామె దుఃఖాన్ని ఉపశమింపజేశాడు.

శ్రీరాముని వనవాస సంకల్పం తెలిసి లక్ష్మణుడు ఆవేశంతో అందరినీ చంపి శ్రీరాముణ్ణి ప్రభువును చేస్తానన్నాడు. కైకను దూషించాడు. శ్రీరాముడు అతణ్ణి వారించాడు. లక్ష్మణుడు తాను కూడా వనవాసానికి వస్తానని పట్టుబట్టాడు. సీతకూడా సహధర్మచారిణిగా తన కర్తవ్యం అంటూ వనవాసానికి సిద్ధమయింది.

లక్ష్మణుడు అన్న సూచనతో వసిష్ఠాశ్రమంలో ఉన్న దివ్యాయుధాలు తీసుకువచ్చాడు. భూరిదానాలుచేసి, రామలక్ష్మణులు చందనపుష్పాదులతో అలంకరించిన ఆయుధాలు ధరించారు. దశరథుడి అనుజ్ఞ కోసం సీతతో కలిసి కైకమందిరానికి వెళ్ళారు. తనను సత్యసంధుణ్ణి చెయ్యడం కోసం రాముడు చేసిన త్యాగాన్ని ప్రస్తావిస్తూ దశరథుడు విలపించాడు. ఒకరినొకరు ఓదార్చుకుంటున్న సందర్భంలో అంతఃపురమంతా శోకంతో కూడిన హాహాకారాలతో నిండింది.

సుమంత్రుడు కైక దుర్బుద్ధిని తీవ్రంగా నిందించాడు. ఈ సందర్భంలో సుమంత్రుడు కైక తల్లి మూర్ఖస్వభావాన్ని ప్రస్తావించాడు. కేకయరాజుకు (కైక తండ్రికి) ఒక గంధర్వయోగి



సమస్త ప్రాణుల శబ్దాలను, భావాలను గ్రహించగల శక్తిని, పశుపక్ష్యాదుల భాషల్ని అర్థం చేసుకొనే సామర్థ్యాన్ని వరంగా అనుగ్రహించాడు. ఒకరోజు పాన్పుదగ్గర పక్షుల జంట మాట్లాతుతుండగా దాని భావం గ్రహించి కేకయరాజు మూడుసార్లు నవ్వాడు. ఆయన తన్ను చూసి పరిహసిస్తున్నాడని భావించి, కైక తల్లి ఎందుకు నవ్వుతున్నావో కారణం చెప్పమంది.

అప్పుడతడు తన భార్యలో "ఓ దేవీ! ఆ విషయం నేను బయటపెడితే నాకు మరణం సంభవిస్తుంది" అన్నాడు. నువ్వు జీవించినా, మరణించినా నాకు కారణం తెలియవలసిందేనని మూర్ఖంగా పట్టుబట్టింది. కేకయరాజు తనకు వరం ఇచ్చిన గంధర్వ యోగిని సంప్రదించాడు. ఆ యోగి "నువ్వు కారణం తెలియజేస్తే నీకు చావు తప్పదు. ఆమె చావుకు సిద్ధమైనా నువ్వు రహస్యాన్ని చెప్పవద్దు" అన్నాడు. మీ తండ్రి యోగి మాటలు పాటించి మీ తల్లికోరికను నిరాకరించి కుబేరుడిలా హాయిగా జీవిస్తున్నాడని సుమంత్రుడు చెప్పి, **"వేపచెట్టునుంచి తేనె కారదు** అన్నది లోకోక్తి. అలాగే నీ తల్లి గుణగణాలే నీకూ వచ్చాయి". అని రాముడంతటి ధర్మాత్ముడు రాజ్యం ఏలినప్పుడు ఎవరికీ ఎటువంటి లోటు ఉండదని ఈ నీచమైన కోరికను విడిచిపెట్టమన్నాడు. కాని కైకలో ఇసుమంత చలనం కూడా కన్పించలేదు.

శ్రీరాముని వనవాసం సుఖంగా సాగటానికి, అతడి వెంట పరివారాన్ని పదార్థాలను పంపమని దశథుడు సుమంత్రుణ్ణి ఆదేశించినప్పుడు కైక అభ్యంతరం చెబుతుంది. రాముడు తనకు ఒక పలుగు, గంప చాలన్నాడు. కైకేయి నారచీరల్ని స్వయంగా తీసుకువచ్చి 'వీటిని ధరించు' అని రాముడికిచ్చింది. రాముడు వాటిని ధరించాడు. లక్ష్మణుడూ తన పట్టువస్త్రాలకు బదులు తండ్రి ఎదుటే నారచీరల్ని ధరించాడు. సీతాదేవి వాటిని చూసి జింకలా భయపడింది. వాటిని ధరించే విధం తెలియని సీతకు రాముడు ఆమె పట్టుచీర మీదే నారచీరల్ని కట్టాడు.

వసిష్ఠుడు కైకను తీవ్రంగా మందలించి రాముడికే వనవాసంకాని, సీతకు కాదని ఆమెకు తగిన వస్త్రాలను, ఆభరణాలను వాహనం మీద చేర్పించాడు.

లక్ష్మణుడు కౌసల్యాదేవి, వసిష్ఠాది పెద్దలకు నమస్కరించి తదుపరి సుమిత్రాదేవికి నమస్కరించి అనుమతించమని కోరినపుడు ఆమె లక్ష్మణుడితో అన్న మాటలు ఆమె ఉన్నత వ్యక్తిత్వాన్ని, ఔన్నత్యాన్ని సూచిస్తాయి.

**శ్లో॥ రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజమ్ ।**
**అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్ ॥** (అయోధ్య. 40–9)

శ్రీరాముణ్ణి తండ్రిగా భావించు, సీతను తల్లిగా పరిగణించు, అడవిని అయోధ్యగా పరిగణించు వెళ్ళిరా! నాన్నా! అంది.

దశరథుడు ఇలా తన పూర్వవృత్తాంతాన్ని చెప్పి దుఃఖపూరితుడై జ్ఞానకర్మేంద్రియాలన్నీ వశం తప్పాయని చెబుతూ రాముణ్ణి స్మరిస్తూ ప్రాణాలు విడిచాడు. దేశమంతటా విషాదఛాయలు అలముకున్నాయి. ఆ సమయంలో కుమారులు ఎవరూ లేనందున దహన సంస్కారాలు జరిపించటానికి అక్కడున్న బంధుమిత్రులు ఇష్టపడరు కనుక, రాజు పార్థివ శరీరాన్ని తైలద్రోణిలో భద్రపరిచారు.

## భరతుని అయోధ్యా ప్రవేశం – తల్లిపై ఆగ్రహం

రాజులేని రాజ్యంలో అల్లకల్లోల పరిస్థితుల్ని గురించి మార్కండేయాది మహర్షులు వసిష్ఠునికి వివరించారు. వసిష్ఠుని ఆదేశానుసారం భరతశత్రుఘ్నుల్ని తీసుకురావడానికి దూతలు వేగవంతమైన గుఱ్ఱాలను అధిరోహించి కేకయనగరానికి పయనం అయ్యారు. అతివేగంగా పయనించి వాళ్ళు నగరాన్ని సమీపించిన నాటి ఉదయమే భరతుడు దుస్స్వప్నం కన్నాడు. ఆ కారణంగా కలతచెంది శోకమగ్నుడయ్యాడు. అయోధ్యనుంచి వచ్చిన దూతలు వసిష్ఠుని ఆదేశాన్ని వివరించారు. (రామవనవాసం, దశరథుని మరణం – ఇత్యాది విషయాలు వసిష్ఠుని సూచన మేరకు చెప్పలేదు) భరత శత్రుఘ్నులు మాతామహుని అనుమతితో బయలుదేరారు.

ఏడు రోజులపాటు పయనించి, ఎనిమిదవ రోజు సూర్యోదయాన ఎదురుగా ఉన్న అయోధ్యానగరాన్ని చూశాడు. అయోధ్యానగరం కళావిహీనంగా కన్పించింది. ఏదో ఆపదను శంకించాడు భరతుడు. నగరానికి పశ్చిమదిశలోని వైజయంతం అనే ద్వారంలో భరతుడు ప్రవేశించాడు. అయోధ్యలో ఏనాడు చూడని అప్రియదృశ్యాలు, అశుభ శకునాలను చూశాడు. రాజభవనంలో తండ్రి కన్పించక పోవడంతో తల్లి కైకేయిని చూడటానికి వెళ్ళాడు.

కైకేయి ద్వారా తండ్రి మరణవార్తను విని విలపించాడు. క్రమక్రమంగా తాను లేనప్పుడు జరిగిన పరిణామాలన్నిటినీ తెలుసుకున్నాడు. దుఃఖానికి, ఆవేశానికి లోనైన భరతుడు కైకను పలువిధాలుగా దూషించాడు. కౌసల్యామందిరానికి వెళ్ళి భరతుడు తాను నిర్దోషినని అనేక విధాలుగా ఒట్టుపెట్టాడు.

సూర్యుడికి ఎదురుగా నిలిచి మలమూత్రాలు విసర్జించటం, గోవుని కాలితో తన్నటం, పనిచేయించుకొని భృత్యునికి తగిన వేతనం ఇవ్వకపోవటం, పన్నువసూలుచేసి రాజు ప్రజాక్షేమాన్ని విస్మరించటం – ఇటువంటి పాపకార్యాలకు ఎటువంటి దుర్గతి కలుగుతుందో అటువంటి దుర్గతి నాకూ పడుతుందని భరతుడు ఒట్టుపెట్టాడు. కౌసల్యాదేవి భరతుడి సౌశీల్యాన్ని గ్రహించింది.

వసిష్ఠుని ఓదార్పుతో భరతుడు తండ్రి అంత్యక్రియలు చేశాడు. పదిరోజుల వరకు నేలపై శయనించాడు. పదకొండో రోజున భరతుడు శుచియై, శుద్ధిపుణ్యాహవాచన క్రియ



ఉత్తమ పాలకుడు. శ్రీరాముడు తమ ప్రాంతానికి వచ్చాడని తెలియగానే సపరివారంగా అక్కడికి చేరుకున్నాడు. వివిధ రకాల భోజన పదార్థాలను స్వీకరించమని గుహుడు అభ్యర్థించాడు. అతడి భక్తిని, సహృదయాన్ని అభినందిస్తూ "పితృవాక్యపాలన చేస్తూ, నారచీరలు ధరించాను. ఫలమూలాలే నాకు ఆహారం. గుర్రాలకు గడ్డిని మాత్రమే స్వీకరిస్తాను' అని అంతవరకే స్వీకరించాడు. ఆ రాత్రి అక్కడే విశ్రమించారు. రాత్రి అంతా లక్ష్మణుడితో బాటు గుహుడు మేల్కొని సంభాషిస్తూ రామరక్షణ విషయమై జాగ్రత్త పాటించాడు.

మరుసటిరోజు ఉదయం సుమంత్రుణ్ణి రాముడు అయోధ్యకు మరలి పొమ్మన్నాడు. ఇక తన ప్రయాణం కాలినడకన సాగుతుందని పేర్కొన్నాడు. తన ముగ్గురు తల్లులకు, తండ్రికి నమస్కారాలు తెలియజేసి అందరినీ ఉద్దేశించి చక్కటి మాటలు పలికి వాటిని వారి వద్ద చెప్పమన్నాడు. గుహుడు సిద్ధం చేసిన నావను ఎక్కి నావికుల్ని పడవ నడపమని ఆదేశించాడు. సీతాదేవి గంగానదికి నమస్కరిస్తూ తన వనవాసం శుభంగా జరిగితే బ్రాహ్మణోత్తములకు లక్షగోవుల్ని అమూల్యమైన వస్త్రాలను దానం చేస్తానని ప్రార్థించింది.

నావ అవతలి ఒడ్డు చేరగానే నావదిగిన తర్వాత రాముడు లక్ష్మణుణ్ణి ఉద్దేశించి "జనావాసం లేని అడవి ప్రాంతంలో చాలా జాగ్రత్తగా ఉండాలి. నువ్వు ముందు నడుస్తుంటే సీత నీ వెంట నడుస్తుంది. నిన్నూ, సీతను రక్షిస్తూ మీ వెనుక నేను అనుసరించి వస్తాను" అన్నాడు.

జన పదాలను దాటి తొలిరాత్రి గడిపారు. రెండవరోజు ఉదయం గంగానది, యమున సంగమించే ప్రయోగక్షేత్రం చేరడానికి దట్టమైన అడవుల ద్వారా ముందుకు సాగారు. సూర్యాస్తమయానికి సంగమప్రదేశంలోని భరద్వాజ ఆశ్రమానికి చేరుకున్నారు. భరద్వాజుడు వారిని ఆహ్వానించి అతిథి మర్యాదలు చేశాడు. ఇక అక్కడే నివసించమని కోరాడు.

కాని రాముడు "కోసల దేశపు జనపదాలకు ఇది సమీప ప్రాంతం. నేనిక్కడ ఉన్న విషయం పసిగడితే ప్రజలు తరచుగా వచ్చి వెళ్ళే అవకాశం ఉంది. కనుక ఆశ్రమవాసానికి తగిన, జనులకు అందుబాటులో లేని ప్రదేశాన్ని సూచించండి" అని ప్రార్థించాడు. భరద్వాజుడు అక్కడికి పదిక్రోసుల దూరంలో ఉన్న చిత్రకూట పర్వతప్రదేశం అందుకు అనువైన చోటన్నాడు. మహర్షులెందరో వందలాది సంవత్సరాలు తపస్సు చేసి సిద్ధి పొందిన చోటని పేర్కొన్నాడు.

మూడవరోజు ఉదయం భరద్వాజుడు సూచించిన మార్గంలో సీతారామలక్ష్మణులు ప్రయాణానికి ఉన్ముఖులయ్యారు. "యమునా నదిని దాటిన తర్వాత నల్లటి మర్రిచెట్టు

కన్పిస్తుంది. ఆ చెట్టు నీడలో చాలామంది సిద్ధులు నివసిస్తుంటారు. సీతాదేవి ఆ చెట్టుకు నమస్కరించి ఆశీస్సులు పొందడం శ్రేయస్కరం" అని భరద్వాజుడు చెప్పాడు.

రామలక్ష్మణులు తామే ఒక తెప్పను సిద్ధం చేసుకొని యమునానదిని దాటారు. సీతాదేవి మర్రిచెట్టుకు నమస్కరించి తన వనవాసం నిర్విఘ్నంగా కొనసాగాలని ప్రార్థించింది. కొంతదూరం పయనించి యమునా నదీతీరంలోని ఒక సమతల ప్రదేశానికి చేరి, మూడవ రోజు రాత్రి అక్కడ విశ్రమించారు.

చిత్రకూట పర్వతానికి చేరుకొని, దాని సౌందర్యానికి ముగ్ధులై నివాసయోగ్యంగా పరిగణించారు. సీతారామలక్ష్మణులు వాల్మీకి మహర్షి ఆశ్రమాన్ని దర్శించి ఆ మునీశ్వరునికి నమస్కరించి తమను పరిచయం చేసుకున్నారు. తర్వాత లక్ష్మణుడితో రాముడు పర్ణశాలను నిర్మించమని చెప్పాడు. నిర్మాణం జరిగిన తర్వాత వాస్తుశమనం (శాంతి) చెయ్యాలని రాముడు నిర్ణయించి వైశ్వదేవ బలికార్యం, రుద్రయాగం, వైష్ణవయాగం నిర్వర్తించి, గ్రహారిష్టాలు తొలగడానికి పుణ్యాహవచన శాంతిజపాలు మొదలైన వాటిని రాముడు పఠించాడు.

సీతారామలక్ష్మణులు గంగానది దక్షిణ తీరం చేరి, అటునుంచి ప్రయాణమైన పిమ్మట వాళ్ళు కన్పించేంతవరకు గుహుడు, సుమంత్రుడు వారివైపు చూస్తూ గడిపారు. అటు పిమ్మట గుహుని వద్ద సెలవు తీసుకొని సుమంత్రుడు అయోధ్యకు పయనం అయ్యాడు.

## నగర రోదనం – దశరథుని మరణం

సుమంత్రుడు తీసుకువచ్చిన శ్రీరాముడు లేని శూన్యరథాన్ని చూసి నగర ప్రజలు శోకపూరితులయ్యారు. సుమంత్రుడు రాజగృహంచేరి, రాముడు పేరు పేరునా పలకరించి చెప్పమన్న మాటలు విన్పించాడు. దశరథుడు దుఃఖంతో మూర్ఛిల్లాడు. అంతఃపురంలోని వారందరూ ఆక్రందనలు చేశారు. అంతఃపురంనుండి వెలువడిన ఆర్తనాదాలు విని నగరంలోని వృద్ధులు, స్త్రీ పురుషులు రోదించారు.

సుమంత్రుడు తాను బయలుదేరినప్పటినుంచి అప్పటివరకు జరిగిన వృత్తాంతాన్ని వివరించాడు. కుమారుని ఎడబాటు సహించలేక రోదిస్తున్న కౌసల్యాదేవి అనునయ వాక్యాలతో ఓదార్చాడు. కౌసల్యాదేవి ఉద్వేగంతో దశరథుని నిష్ఠూరాలాడింది. శ్రీరాముడు అరణ్యాలకు వెళ్ళిన తర్వాత ఆరవరోజు దశరథమహారాజు గతంలో తాను చేసిన దుష్కార్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని ఆ విషయాన్ని కోపం తగ్గిన కౌసల్యతో చెప్పాలని భావించాడు.



## దశరథుని ఉత్సాహం – మునిశాపం

అర్ధరాత్రివేళ తాను చేసిన ఆ కార్యాన్ని పదే పదే తలపోస్తూ కౌసల్యకు జరిగిన వృత్తాంతాన్ని దశరథుడు చెప్పాడు.

"నేను యువకుడిగా ఉన్నప్పుడు శబ్దాన్ని బట్టి బాణప్రయోగం (శబ్దవేధి) చెయ్యడంలో సమర్థుడినన్న ఖ్యాతి గడించాను. మన వివాహానికి ముందు యువరాజుగా ఉన్న నేను ఒక వర్షాకాలంలో వేటాడే కోరికతో సరయూనది తీరానికి చేరాను. రాత్రివేళ నీళ్ళు త్రాగటానికి నదీతీరానికి వచ్చే మృగాన్ని చంపాలని ఒక రహస్య ప్రదేశంలో విల్లు ఎక్కుపెట్టి దాగి ఉన్నాను.

ఆ సమయంలో నీటిలో కడవను ముంచుతున్న ధ్వని విన్పించింది. గాఢాంధకారం కనుక ఆ రేవు నాకు కన్పించలేదు. ఆ శబ్దం ఏనుగు నీళ్ళు త్రాగుతున్నప్పుడు వెలువడే శబ్దంలా అన్పించింది. బాణం ఎక్కుపెట్టి ప్రయోగించాను. మనిషి హాహాకారం విన్పించింది. ఆ తర్వాత మాటలు విన్పించాయి. 'ఎవరికీ ఎన్నడూ అపకారం తలపెట్టని నావంటి తాపసిపై శస్త్రప్రయోగం చేసిందెవరు?' ఈ మాటలు వినగానే వ్యాకులమైన చిత్తంతో, భయంతో అక్కడికి చేరుకున్నాను. ఒక ఋషికుమారుణ్ణి చూశాను. నన్ను దహించి వేస్తున్నట్లుగా చూసి అతడు నాతో ఇలా చెప్పాడు.

"మహారాజా! నేనీ వనంలో నివసిస్తున్నాను – నా తల్లిదండ్రుల దాహం తీర్చటానికి నీటికోసం ఈ రేవుకు వచ్చాను. నేను నీకు చేసి అపకారం ఏమిటి? నన్ను బాణంతో ఎందుకు కొట్టావు? అంధులైన నా తల్లిదండ్రులకు ఇక దిక్కెవరు? వెంటనే మా తండ్రి వద్దకు వెళ్ళి జరిగింది చెప్పు. ఆయన్ని ప్రసన్నం చేసుకో. లేకపోతే కోపంతో శపిస్తాడు. ఆయువు పట్టున తగిలిన బాణంతో అతడు విలవిలలాడుతున్నాడు. బాణం తీస్తే మరణిస్తాడు. తియ్యకపోతే నరకయాతన అనుభవిస్తాడు. ఇలా నేను తటపటాయిస్తున్నపుడు అతడు 'నేను బ్రాహ్మణుణ్ణి కాను. వైశ్యునివల్ల శూద్రస్త్రీకి జన్మించినవాణ్ణి. కనుక బ్రహ్మహత్యాదోషం నీకు అంట'దని చెప్పాడు. నేను బాణాన్ని లాగివేశాను. అతడు ప్రాణాలు విడిచాడు.

ముని కుమారుని తల్లిదండ్రులవద్దకు వెళ్ళి జరిగింది చెప్పి, వాళ్ళిద్దరినీ అక్కడికి తీసుకెళ్ళాను. ఆ తల్లిదండ్రులు కుమారుడి శరీరాన్ని స్పృశిస్తూ విలపించారు. 'నా వలె నీకు కూడా పుత్రశోకంవల్ల మరణం సంభవిస్తుం'దని ఆ ముని శపించాడు. భక్తిశ్రద్ధలతో తండ్రికి పరిచర్యలు చేసి, పుణ్యకార్యాలు ఆచరించటంవల్ల మునికుమారుడు దివ్యశరీరం ధరించి తల్లిదండ్రులకు నమస్కరించి ఇంద్రుడితో స్వర్గం చేరాడు. అప్పటి నా దుష్కృత్యం కారణంగానే నేనిప్పుడు పుత్రవియోగంతో మరణానికి దగ్గరయ్యాను.

## పాదుకా పట్టాభిషేకం

తుదకు భరతుడు శ్రీరాముడితో “పూజ్యుడవైన సోదరా! బంగారంతో తాపబడిన నీ పాదుకలివి. ఈ పాదరక్షల్ని ఒక్కసారి నీ పాదాలకు తొడిగి అనుగ్రహించు. అవే సమస్తలోకాల యోగక్షేమాలను సమకూరుస్తుంది” అని ప్రార్థించాడు. అందుకు అంగీకరించిన శ్రీరాముడు వాటిని తొడిగి భరతుడికి ఇచ్చాడు.

ఆ పాదుకలకు ప్రణమిల్లి భరతుడు “ఈ పధ్నాలుగు సంవత్సరాలు జటధారిగా నారచీరల్ని ధరించి పళ్ళను, కందమూలాలను ఆహారంగా తీసుకుంటూ నీ రాకకోసం ఎదురుచూస్తుంటాను. నగరం వెలుపలే ఉంటూ రాజ్యపాలన భారాన్ని నీ పాదాలమీదే ఉంచుతాను. పధ్నాలుగు సంవత్సరాలు గడిచిన మరుసటి రోజు నీ దర్శనం కానట్లయితే అగ్నిప్రవేశం చేస్తాను” అని దృఢంగా పలికాడు.

శ్రీరాముని ఆమోదం పొందిన భరతుడు ఆ పాదుకల్ని రాజు అధిరోహించే ‘శత్రుంజయ’ మనే శ్రేష్ఠమైన ఏనుగు అంబారిపై ఉంచాడు. తర్వాత రాముడి అనుజ్ఞతో వీడ్కోలు పలికి అంబారిపై ఉన్న పాదుకల్ని తన తలపై ఉంచుకొని, శతృఘ్నసహితుడై రథాన్ని అధిరోహించాడు. అన్నదమ్ముల మధ్య సాగిన అనురాగాన్ని, ఆదరాభిమానాలను చూసి ప్రజలే కాక, సమస్త ప్రకృతి పులకరించింది.

భరతుడు శ్రీరాముడు లేని అయోధ్యలో నివసించలేనని నందిగ్రామం వెళ్ళి, గురువులతో “పూజ్యులారా! మా అన్న శ్రీరాముడు తనంతట తాను ఈ రాజ్యాన్ని న్యాసంగా ఇచ్చాడు. రాజ్యప్రజల యోగక్షేమ బాధ్యతల్ని రాముడి పాదుకలే వహిస్తాయి. నేను నిమిత్త మాత్రుణ్ణి” అని వినయంగా పలికి సింహాసనంపై పాదుకల్ని ఉంచి నందిగ్రామం నుంచే పాలనావ్యవహారాలు నిర్వహించసాగాడు.

## స్థానచలనం - అత్రి దంపతుల ఆదరం

భరతుడు అయోధ్యకు మరలి వెళ్ళిన తర్వాత కొంతకాలానికి అక్కడున్న తాపసులు ఆ ప్రదేశం విడిచి వెళ్ళడానికి సిద్ధమైనట్లు శ్రీరాముడికి గోచరించింది. కారణం అడగ్గా ఖరుడనే రాక్షసుడు ఇబ్బందులు కలుగజేస్తున్నాడని, అందుకై మునులందరూ ఆ ప్రదేశాన్ని విడిచిపెట్టాలని భావిస్తున్నారని ఒక వృద్ధ తాపసి సమాధానం చెప్పాడు.

ఋషులందరూ ఆశ్రమాలను విడిచి వెళ్ళిన తర్వాత రాముడు తనలో ఇలా తలపోశాడు. భరతుడు మొదలైన ఆత్మీయులు తనను ఇక్కడే కలిశారు. వాళ్ళ స్మృతులు తన్ను వెంటాడతాయి. సైన్యం, శిబిరం ఏర్పాటైనందువల్ల ఏనుగుల పేడలతో, గుర్రాల లద్దెలతో ఆ ప్రదేశం అపవిత్రమయింది. కనుక మరొకచోటికి వెళ్ళడమే మంచిదని పించింది.



ఆచరించాడు. పన్నెండో రోజున షోడశం, సపిండీకరణం మొదలైన శ్రాద్ధకర్మల్ని నిర్వహించాడు. పదమూడవ రోజున అస్థిసంచయనం కోసం శ్మశానానికి వెళ్ళి తండ్రి చితి ప్రదేశాన్ని సమీపించి దుఃఖంతో విలపించాడు. అపరక్రియలు ఆచరించిన తర్వాత భరతుడు శ్రీరాముని వద్దకు వెళ్ళాలని నిర్ణయించాడు.

శత్రుఘ్నుడు, భరతునితో ‘ఒక స్త్రీ కారణంగా అడవులకు వెళ్ళవలసి వచ్చింది కదా!’ అని పలుకుతున్నప్పుడే ఒంటినిండా సొమ్ములతో తూర్పువాకిలివద్ద తచ్చాడుతున్న మంథరను ద్వారపాలకులు తీసుకువచ్చి శత్రుఘ్నుని ముందు నిలబెట్టారు. శత్రుఘ్నుడు అన్నిటికీ మూలకారణమైన మంథరను నేలపై లాగుతూ తీసుకురాగా ఆమె ధరించిన నగలన్నీ చెల్లాచెదురుగా నేలపైపడ్డాయి.

కైకేయి భయంతో భరతుని శరణు జొచ్చింది. ‘స్త్రీవధను రాముడు సహించడు. నాకూ కోపం ఉన్నా శ్రీరాముడు నిందిస్తాడనే భయంతో నేను సహనం పాటిస్తున్నాను, మంథరను విడిచిపెట్టు’ అని భరతుడు శత్రుఘ్నుణ్ణి ఆదేశించాడు.

తాను పట్టాభిషేకం చేసుకోవడానికి సుతరామూ ఇష్టపడటం లేదని, రాముణ్ణి ఒప్పించి అయోధ్యకు తీసుకువస్తానని, వసిష్ఠాది పెద్దల సమక్షంలో పలికి అందుకైన సన్నాహాలు భరతుడు మొదలుపెట్టాడు.

## భరతుని ప్రయత్నం - రాముని దృఢసంకల్పం

భరతుడు మంత్రులు, పురోహితులు, తల్లులతో సపరివారంగా రాముడు వెళ్ళిన మార్గంలో పయనించాడు. వివిధ ఆయుధాలున్న విలుకాండ్రు, 60 వేల రథాలు, లక్షమంది ఆశ్వికులు భరతుడి వెంట పయనించారు. 9 వేల ఏనుగులు అనుసరించాయి.

శృంగిబేరపుర సమీపంలో విడిసిన భరతుని సేనను చూసి గుహుడు అనుమానించి, తన అనుచరుల్ని పోరుకు సన్నద్ధంగా ఉండమని గుహుడు ఆదేశించాడు. భరతుడి ఆంతర్యం గ్రహించడానికి కానుకలతో ఎదురేగి దర్శించాడు. వారి మధ్య సంవాదంలో భరతుడికి రాముడిపైగల భక్తిని చూసి గుహుడు చలించిపోయాడు. గుహుడి ద్వారా సీతారామ లక్ష్మణులు అక్కడ గడిపిన వివరాలను భరతుడు తెలుసుకున్నాడు. గుహుని సహకారంతో 500 నావలు, స్వస్తికమనే పేరుగల మరికొన్ని నావల సాయంతో సైన్యమంతా గంగానదిని దాటింది. భరతుడు భరద్వాజ ఆశ్రమానికి వెళ్ళి ఆయనను దర్శించాడు.

## భరద్వాజుని విందు

భరద్వాజమహర్షి ‘తిరుగులేని రాజ్యాధికారం చేజిక్కించుకోవడానికి రామ లక్ష్మణులకు అపకారం చెయ్యాలని పూనుకున్నావా?’ అని భరతుని ప్రశ్నించాడు. భరతుడు

తీవ్ర ఉద్వేగంతో 'త్రికాలజ్ఞులైన మీరు కూడా నన్ను దోషిగా భావిస్తే నేను జీవించి ప్రయోజనం లేదు' అని చెప్పి తన మనోగతాన్ని మహర్షికి వివరించాడు. భరద్వాజుని అభ్యర్థన మేరకు భరతుడు ఆ రాత్రి ఆశ్రమంలోనే గడపడానికి నిర్ణయించాడు. మహర్షి అతణ్ణి సపరివారంగా అతిథిమర్యాదలు స్వీకరించడానికి ఆహ్వానించాడు.

సైన్యాన్ని అంతటినీ ఆశ్రమ సమీపానికి మహర్షి ఆదేశం మేరకు భరతుడు రప్పించాడు. మహర్షి సత్కారాలు నిర్వహించడానికి విశ్వకర్మను ఆహ్వానించాడు. ఇంద్ర, యమ, వరుణ, కుబేరుల్ని ఆహ్వానించి తనకు తోడ్పడమని కోరాడు.

ఆకాశంలో ప్రవహించే నదుల్ని, పడమరగా వెళ్ళే నదుల్ని, గానవినోదాలకై విశ్వావసువు,హాహాహూహూ మొదలైన దేవగంధర్వుల్ని, అప్సరసలనందరినీ ఆహ్వానించాడు. రంభ, ఊర్వశి, మేనకలు, బ్రహ్మలోకంలోని అప్సరసలను, వీణావాదంలో నైపుణ్యంగల తుంబురుని ఆహ్వానించాడు. ఇంకా దేవతల నెందరినో ఏకాగ్రచిత్తంతో శిక్షా, వ్యాకరణ శాస్త్రాలతో తెలిపిన స్వరాలలో ఆహ్వానమంత్రాలు పఠించాడు. పూలవానలు కురిశాయి. సుగంధపరిమళాలు వ్యాపించాయి. కుబేరుని చైత్రరథం అక్కడికి వచ్చింది.

ఎన్నో అపురూపమైన సంఘటనలు చోటుచేసుకున్నాయి. అత్యంత వైభవోపేతమైన సకల సదుపాయాలతో భరద్వాజుని విందు సాగింది. మరునాటి ఉదయం శ్రీరాముని ఆశ్రమానికి దారిచూపమని భరతుడు భరద్వాజ మహర్షిని ప్రార్థించాడు. ఆ సందర్భంగా తల్లిని నిందించిన భరతుణ్ణి వారించి కైకేయి దోషం ఏమీ లేదని రామ వనవాసం అందరికీ సుఖ సంతోషాలు కలుగజేస్తుందని భరద్వాజ మహర్షి చెప్పాడు.

## అన్నదమ్ముల అనురాగం

ఆ సమయంలో శ్రీరాముడు సీతాదేవికి చిత్రకూట పర్వత ప్రదేశంలోని వనశోభల్ని, మందాకినీ నదీతీరంలోని మనోహర దృశ్యాల్ని చక్కగా వర్ణిస్తున్నాడు. ఇంతలో అడవి మృగాల అలజడుల్ని చూసి అందుకు కారణమేమిటో తెలుసుకొమ్మని రాముడు లక్ష్మణుణ్ణి ఆదేశించాడు. భరతుడు సైన్యంతో వస్తున్న దృశ్యాన్ని చూసిన లక్ష్మణుడు కోపంతో రాముని వద్ద భరతుని నిందిస్తాడు. రాముడు లక్ష్మణుని కోపాన్ని ఉపశమింపజేశాడు. భరతుని ఉద్దేశం తనను తిరిగి ఆహ్వానించడమేనని రాముడు లక్ష్మణుడితో చెప్పాడు.

ఇంతలో రామాశ్రమం భరతుని కంటపడింది. వెంటనే భరతుడు పరవశానికి లోనయ్యాడు. వజ్రాయుధం, ధ్వజం, పద్మం, అంకుశం, అమృతకలశం మొదలైన రాజ చిహ్నాలున్న అన్న పాదపద్మాలకు శిరసువంచి నమస్కరిస్తే కాని తనకు శాంతి లభించదని భరతుడు భావించాడు.



రాముణ్ణి చూడగానే భరతుడు కన్నీటి పర్యంతమయ్యాడు. కంఠం రుద్ధమయింది. 'అన్నా' అని పలికి అంతకుమించి మాట్లాడలేకపోయాడు. నారచీరల్ని ధరించి, జటాధారిగా, భూమిపై సాష్టాంగపడి ఉన్న భరతుణ్ణి శ్రీరాముడు దగ్గరకు తీసుకొని కౌగిలించుకున్నాడు.

రాముడు భరతుని అనునయిస్తూ 'పెద్దలపట్ల, రాజ్యపాలన విషయంలో ధర్మబద్ధంగా ప్రవర్తిస్తున్నావు కదా!?' అని ప్రశ్నించి రాజనీతిని బోధపరిచాడు. భరతుడు తండ్రి మరణ వార్త తెలియజేసి తిలోదకాలు సమర్పించమన్నాడు. తండ్రి మరణవార్త వినగానే నిశ్చేష్టుడైన రాముడు నరకబడిన చెట్టులా భూమిపై పడ్డాడు. తెప్పరిల్లి దుఃఖంతో తండ్రి గుణగణాలను పరిగణిస్తూ భావోద్వేగానికి లోనయ్యాడు. శోకమగ్నుడైన రాముడితోబాటు సీతాలక్ష్మణులు విలపించారు. శ్రీరాముడు జలతర్పణం సమర్పించాడు. తమ్ములతో కలిసి తిలతర్పణ పూర్వకంగా పిండప్రదానాలు గావించాడు.

వసిష్ఠ మహర్షి దశరథ పుత్రుల్ని ముందుంచుకొని శ్రీరాముడి దర్శనార్థం త్వరత్వరగా వచ్చాడు. శ్రీరాముడు తల్లులకు ప్రణమిల్లాడు. సీతను చూసిన కౌసల్యకు దుఃఖం ఆగలేదు. వసిష్ఠ మహర్షి పాదాలకు రాముడు నమస్కరించాడు.

అందరూ కుదుటపడిన పిదప భరతుడు 'కోసల రాజ్యానికి నువ్వు పట్టాభిషిక్తుడివి కావాలి. సమస్త ప్రజానీకం నీకోసం వచ్చారు. పెద్దవాడివైన నీవే రాజు కావలసిన వాడివి. నీకు తమ్ముడు, శిష్యుడు, దాసుణ్ణీ అయిన నన్ను కరుణించి అనుగ్రహించ' మని శ్రీరాముణ్ణి వేడుకున్నాడు.

తండ్రి ఆనతిని శిరసావహించడం ఉత్తమ ధర్మమని, ఆయన ఆదేశానుసారం తాను వనవాసం పూర్తిచేసుకొని అయోధ్యకు తిరిగి వస్తానని సమాధానం ఇచ్చాడు. భరతుడు పరిపరివిధాల బ్రతిమాలినా, నచ్చజెప్పినా శ్రీరాముడు తిరస్కరించాడు. "తండ్రిని సత్యసంధుణ్ణి చెయ్యటమే మనకర్తవ్యం" అని శ్రీరాముడు నిశ్చయంగా పలికాడు.

ఈ సందర్భంలో జాబాలి (ఎనిమిది మంది మంత్రులలో ఒకడు) నాస్తికవేదం వినిపించి, రాజ్యపాలన చెయ్యమని శ్రీరాముడికి చెప్పాడు. శ్రీరాముడు అధర్మమార్గాన్ని బోధిస్తూ, ధర్మమార్గం అని చెప్పడం సముచితం కాదని, "నేను చేసిన ప్రతిజ్ఞను నేనే ఉల్లంఘిస్తే ఇతరులకు నేనలా ఉపదేశించగలను" అని ప్రశ్నించాడు. కొంత కోపాన్ని సైతం ప్రదర్శించాడు. జాబాలి రాముణ్ణి శాంతపరుస్తూ "ఎలాగైనా నిన్ను రాజ్యపాలనకు అంగీకరింపజెయ్యడానికే నేనలా మాట్లాడాను" అని చెప్పి క్షమించమని కోరాడు.

వసిష్ఠ మహర్షి కూడా ఇక్ష్వాకు వంశక్రమాన్ని తెలియజేసి, అతణ్ణి రాజ్యపాలన చేపట్టమని హితం పలికాడు. తనకు జన్మనిచ్చిన తండ్రిమాటను జవదాటడం తనకేమాత్రం సమ్మతం కాదని శ్రీరాముడు దృఢంగా పలికాడు.

తీరంలో ఉన్నట్లు, రామాయణ రచనాకాలంలోను అక్కడే నివసించినట్లు బాలకాండలో ఉంది. అలాగే సీతాపరిత్యాగ సందర్భంలోను వాల్మీకి అక్కడే ఉన్నట్లు ఉత్తరకాండలో ఉంది. బహుశా భరతుని ఆగమనం వరకు వాల్మీకి అక్కడే నివసించి ఆ తర్వాత మరెప్పుడో తమసానదీ తీరంలో ఆశ్రమాన్ని నిర్మించుకొని జీవించినట్లు భావించవచ్చు.

చిత్రకూట పర్వతంలో పర్ణశాల నిర్మాణానంతరం వాస్తుశమనం (శాంతి) గురించి రాముడు పేర్కొన్నాడు. రాముడు సర్వశాస్త్రాలలో నిష్ణాతుడని అతడి శకున శాస్త్రజ్ఞానం, వాస్తుశాస్త్రజ్ఞానం, యాగనిర్వహణ ఋజువు చేస్తున్నాయి.

**శ్రీ మహిమాభిరాముడు వసిష్ఠమహాముని పూజితుండు సు**
**త్రామ వధూకళాభరణ రక్షకు దాశ్రిత పోషకుండు దూ**
**ర్వామల సన్నిభాంగుడు మహాగుణశాలి దయాపరుండు శ్రీ**
**రాముడు ప్రోచు భక్త తతి రంజిల్లునట్లుగ నెల్లకాలమున్.** – మొల్ల.

* * * * *



ఆ చోటునుంచి బయలుదేరి వాళ్ళు అత్రిమహాముని ఆశ్రమం చేరారు. అత్రి మహర్షి స్వయంగా శ్రీరాముడికి అతిథి మర్యాదలు చేశాడు. వృద్ధురాలైన ఆయన పత్ని అనసూయాదేవి తపోమహిమను గురించి అత్రి శ్రీరాముడికి చెప్పాడు. సీతాదేవి ఆమెకు వినమ్రంగా నమస్కరించింది. అనసూయ సీతకు పతివ్రతా ధర్మాలు బోధించింది. సీతకు శ్రేష్ఠమైన మాలలు, వస్త్రాలు, ఆభరణాలు, అంగరాగాలు (కుంకుమ, చందనం మొదలైనవి) అనులేపనాలు (మైపూతలు, కర్పూరం, అగరు కస్తూరి) మొదలైన పరిమళ ద్రవ్యాలను ఇచ్చి ఆశీర్వదించింది.

సీతాదేవి ద్వారా ఆమె పరిణయ వృత్తాంతాన్ని విని అనసూయ ఆనందించింది. అనసూయాదేవి తానిచ్చిన వస్త్రాభరణాలను ధరించి తనకు చూపమని కోరింది. సీత దాన్ని పాటించి ఆమెను సంతోషపరిచింది. సీతాదేవికి అత్రి పత్ని అనురాగాలతో ఇచ్చిన కానుకల్ని చూసి శ్రీరాముడు హర్షించాడు.

ఆ రాత్రి గడిచిన పిదప తాపసులు స్నానాదికాలు ముగించుకొని హోమకార్యాలను ఆచరించారు. రామలక్ష్మణులు తమ ప్రయాణాన్ని అనుమతించమని అత్రి దంపతుల్ని ప్రార్థించారు. వనప్రదేశం రాక్షసులు, క్రూరమృగాలతో నిండినదనీ, ఆహార పదార్థాలు తీసుకురావడానికి ఈ మార్గంలోనే వెళ్తుంటారని, కనుక ఈ దుర్గమారణ్యంలోకి ప్రవేశించడానికి ఇదే తగిన మార్గం అని మునులు చెప్పారు.

వాళ్ళకి అంజలి ఘటించి, ఆశీస్సులు పొంది శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలిసి మునులు చూపిన మార్గంలోనే మహారణ్యంలోకి ప్రవేశించాడు.

## విశేషాలు – విశ్లేషణ

వాల్మీకి రామాయణంలో యుద్ధకాండ తర్వాత పెద్దది అయోధ్యకాండ. **ఇందులో 119 సర్గలు, 4320 శ్లోకాలున్నాయి.** యుద్ధకాండ పేరుకు తగ్గట్టు మొత్తం పోరాటాల మయం. అయోధ్యకాండ మానవ సంబంధాలను, ధర్మబద్ధమైన జీవితాన్ని, ఆదర్శమానవుణ్ణి చిత్రించిన విభాగం.

సామాన్య మానవుల్లో కలిగే భయాందోళనలు, అసూయామాత్సర్యాలు, సుఖ దుఃఖాలు రామాయణ పాత్రల్లోనూ కన్పిస్తాయి. రాముడు ప్రతి సందర్భంలోను ఆదర్శప్రాయంగా కన్పిస్తాడు. తల్లిదండ్రుల పైనున్న అపార భక్తిశ్రద్ధల కారణంగా సువిశాల సామ్రాజ్యాధికారాన్ని తృణప్రాయంగా భావించటం. అత్యంతక్లేశంతో కూడిన అరణ్య వాసాన్ని అంగీకరించటం, చిఱునవ్వుతోనే అన్నిటినీ స్వీకరించటం, ఈ పరిణామాలన్నిటికీ బాధ్యులైన అందరిపై ప్రేమాభిమానాలను, భక్తి గౌరవాలను యథాప్రకారమే ప్రదర్శించటం

ఇవన్నీ ఆదర్శమానవుని లక్షణాలు. ఇవేవీ మానవాతీత కార్యాలు కావు. స్వార్థంలేని, మానవాళి హితం కోరే ఏ మనిషికైనా సాధ్యమే.

ఎంతటి ధీరోదాత్తుడైనా, తన తండ్రి మరణవార్త విని రాముడు సామాన్య మానవుడిలా విలపించాడు. తన తమ్ములపట్ల ప్రేమను అపరిమితంగా ప్రకటించాడు. భరత, లక్ష్మణ, శత్రుఘ్నులకు రాముడంతటి నిగ్రహం లేకపోయినా వాళ్ళు ప్రదర్శించిన ఆవేశం ధర్మాగ్రహం మాత్రమే. రాముడో, గురువో, హితుడో ఔచిత్యానౌచిత్యాలను సూచించ గానే తమ ఆగ్రహాన్ని అనుగ్రహంగా మలచుకున్నారు.

సహధర్మచారిణిని సైతం ఎడబాసి పధ్నాలుగేళ్ళు సీతారాముల సేవకే పరిమితమైన లక్ష్మణుడు, తనకు అనాయాసంగా దక్కిన రాజ్యాధికారాన్ని, వైభవాన్ని తృణప్రాయంగా భావించి, నిరాడంబరంగా, మహర్షిలా జీవించి రాజ్యపాలన అంతటినీ రాముడి పేరుమీదుగా చేసిన భరతుడు, ఏ ప్రతిఫలమూ ఆశించక భరతుడి సేవనే పరమావధిగా భావించిన శత్రుఘ్నుడు–వీరి త్యాగనిరతి, స్వార్థరాహిత్యం,ధర్మానుష్ఠానం అసాధారణమైనవి. రాముణ్ణి మించిన ఆదర్శం వీరిది.

సీతకు సహజ సిద్ధంగా అలవడిన పాతివ్రత్య లక్షణాలు, దుర్గమమైన అరణ్యవాసాన్ని సంతోషంగా స్వీకరించేటట్లు చేసింది. పతి కష్టసుఖాలన్నిటిలోను పత్నికి భాగం ఉందని భావించిన ఉత్తమమైన ఇల్లాలు సీత. ఉన్నత భారత కుటుంబ వ్యవస్థకు సీత చూపిన ఆదర్శం అనుసరణీయం. అనసూయ చేసిన హితబోధ భవిష్యత్తులో జరుగబోయే అత్యంత క్లిష్టపరిస్థితుల్ని సీత తట్టుకునే స్థైర్యాన్ని కలుగజేసింది.

అమిత పుత్రవ్యామోహంలో కైకేయి భర్తమరణానికి కారకురాలయింది. దశరథుడు నరకయాతన (మనోవేదన) అనుభవించి చావును ఆహ్వానించాడు. మోహంవల్ల కలిగే అనర్థాలను వాల్మీకి ఈ పాత్రల ద్వారా చిత్రీకరించాడు. కౌసల్యాదేవి పుత్రవాత్సల్యంతో భర్తను తూలనాడింది. కైకను నిందించింది. సుమిత్రాదేవి వ్యక్తిత్వం రాముని వ్యక్తిత్వానికి ఏ మాత్రం తీసిపోనిది. తన ఇద్దరు కుమారులు సేవక భావాన్నే ప్రదర్శించినా అమితంగా ఆనందించింది. లవలేశమైనా స్వార్థచింతన ఆమెకు కలుగలేదు. రాముని ఎడబాటుకు కృశించిన కౌసల్యాదేవిని ఓదార్చింది. కాని తన పుత్రుని ఎడబాటును స్థితప్రజ్ఞతతో స్వీకరించింది. పైగా లక్ష్మణుడికి –

***శ్లో॥ రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజమ్ ।***
***అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత! యథాసుఖమ్ ॥***

అని హితం పలికింది. ఇందులోని సామాన్యార్థం ఇంతకుముందే చెప్పబడింది. పండితులు చెప్పిన విశేషార్థం (అంతరార్థం) ఇది.



దశము=పక్షి, రథము=వాహనం –– దశరథుడు=పక్షి (గరుత్మంతుడు) వాహనంగా కలవాడు విష్ణువు, విద్ధి=అని తెలుసుకో, మా=లక్ష్మీదేవి/తల్లి, సీతాదేవి సాక్షాత్తు ఆ లక్ష్మీదేవి అని గ్రహించు, అయోధ్య=దేవతలకు కాని, రాక్షసులకుకాని జయించటానికి సాధ్యం కానిది. అంటే అది 'అపరాజిత' అనే పేరుగల వైకుంఠమే. కనుక శ్రీరామపాదస్పర్శతో పవిత్రమైన అడవిని అయోధ్యగా (వైకుంఠంగా) భావించు.

ఉన్నత సంస్కారం ఉన్న వాళ్ళు కనుక కౌసల్యా, కైకేయిలు సైతం తమ ప్రవర్తనకు వెంటనే సిగ్గిల్లి, పశ్చాత్తాపం చెందారు. తన కొడుకు అరణ్యవాసానికి కారకురాలైన కైకేయిని కౌసల్య పూర్తిగా క్షమించగలిగింది.

రాముడు యువరాజుగా పట్టాభిషిక్తుడిగా నా కష్టాలన్నీ కడతేరుతాయని, జన్మించి నప్పటినుండి పదిహేడేళ్ళుగా నిరీక్షిస్తున్నాని రామవనవాస నిర్ణయమప్పుడు కౌసల్య చెప్పింది. అంటే పట్టాభిషేక సన్నాహ సమయానికి రాముడి వయస్సు 17 ఏళ్ళేనని అన్పిస్తుంది. జన్మించడం అంటే ఉపనయనం – అది ద్విజులకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు రెండవ జన్మ. విశ్వామిత్రుడు రామలక్ష్మణుల్ని తనతో బాటు యాగరక్షణకు తీసుకెళ్ళినపుడు వారి వయస్సు 16 ఏళ్ళకు కొంతలోబడిన ప్రాయం (ఊన షోడశవర్షప్రాయం). క్షత్రియులకు శిశువు తల్లి కడుపున పడింది మొదలు పదకొండో సంవత్సరంలో ఉపనయనం చెయ్యాలి. ఆ తర్వాత 17 ఏళ్ళు గడిచాయంటే శ్రీరాముడికి పట్టాభిషేకం తలపెట్టినప్పుడు 27 ఏళ్ళు పూర్తయి 28వ సంవత్సరం జరుగుతుండాలి. 16వ ఏట వివాహమై పన్నెండేళ్ళు అయోధ్యలో శ్రీరాముడు గడిపాడన్నది కూడా పై వయస్సునే నిర్ధారిస్తుంది.

ప్రయాగనుంచి చిత్రకూట పర్వత ప్రాంతానికి దశక్రోశాల (దశక్రోశః) దూరం అని భరద్వాజుడు రాముడితో అన్నాడు. ఈ దూరమానం గురించి గీతాప్రెస్, గోరఖ్‌పూర్ వారు ప్రచురించిన శ్రీమద్రామాయణములో ఇచ్చిన వివరణ (సంపుట–1, పుట–493).

దశక్రోశః–ఏకశేషద్వంద్వ విధిని అనుసరించి దశచ, దశచ, దశచ=దశ అని వ్యాఖ్యానిస్తే దశక్రోశ సమాసానికి ముప్పై క్రోసులని అర్థం వస్తుంది. ఒక క్రోసమండే రెండు మైళ్ళు. అంటే 30×2=60 మైళ్ళు. ప్రయాగనుంచి చిత్రకూటానికి 60 మైళ్ళు. ఇప్పటి దూరమానం ఎనభై మైళ్ళని పేర్కొంటున్నారు. నాటికి నేటికి దూరమానానికి ఉన్న తేడాలవల్ల ఈ మైళ్ళ భేదం ఉండవచ్చు లేదా ప్రయాగ నుంచి చిత్రకూట ప్రారంభ ప్రదేశానికి ఆ నాడు 60 మైళ్ళు ఉండవచ్చు.

సీతారామలక్ష్మణులు చిత్రకూట పర్వతప్రాంతంలో వాల్మీకి ఆశ్రమాన్ని, వాల్మీకి మహర్షిని సందర్శించినట్లు అయోధ్యాకాండలో ఉంది. వాల్మీకి ఆశ్రమం తమసానదీ

అడుగు భాగంలో గృహం నిర్మించుకొని అక్కడే నివసిస్తున్నారు. ఆ అప్సరసల ఆభరణ ధ్వనులు, సంగీత ధ్వనులవలె మీరిప్పుడు విన్నారు" అని ముని వివరించాడు.

అటు పిమ్మట పది సంవత్సరాలబాటు వివిధాశ్రమాలలో సీతారామలక్ష్మణులు గడిపి, మళ్ళీ సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి చేరుకున్నారు. కొంతకాలం మునీశ్వరుల అతిథి సత్కారాలను స్వీకరిస్తూ ఆ ఆశ్రమంలో గడిపారు. ఒకరోజు సుతీక్ష్ణమహర్షి వద్దకు వెళ్ళి శ్రీరాముడు "మహర్షీ! అగస్త్యమహాముని ఈ దండకారణ్యం లోనే నివసిస్తున్నట్లు చాలమంది చెబుతుండగా విన్నాను. కాని విశాలమైన ఈ ప్రాంతంలో ఆయనెక్కడున్నది నాకు తెలియడం లేదు. ఆయన ఆశ్రమ ప్రదేశం ఎక్కడుందో తెలియజేయమని ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

సుతీక్ష్ణ మహర్షి "ఈ ఆశ్రమానికి దక్షిణ దిక్కులో నాలుగు యోజనాల దూరంలో అగస్త్య సోదరుని ఆశ్రమం ఉంది. అది పవిత్రమైన ప్రదేశం. ఒకరాత్రి ఆ ఆశ్రమంలో గడిపి మరునాటి ఉదయం దక్షిణదిశవైపు ఒకయోజనం దూరం పయనిస్తే అగస్త్యాశ్రమం చేరుకుంటారు. మీరు ఈ రోజే బయలుదేరడానికి సిద్ధంకండి" అని మార్గనిర్దేశం చేశాడు.

సూర్యుడస్తమిస్తున్న సంధ్యాకాలంలో అగస్త్యసోదరుని ఆశ్రమం చేరి సీతారామ లక్ష్మణులు ఆయనకు నమస్కరించారు. ఆ రాత్రి అక్కడ బసచేయడానికి అనుమతి కోరి విశ్రమించారు. రాముడు ఆ ఆశ్రమానికి చేరకముందే అగస్త్యముని తపశ్శక్తిని, వాతాపి, ఇల్వలులనే రాక్షసుల్ని అంతంచేసిన తీరును సీతారామలక్ష్మణులకు వివరించాడు.

మరునాడు మహర్షి అనుమతితో అగస్త్య సందర్శనార్థం పయనం అయ్యారు. దారిలో రాముడు "అగస్త్యుడు తన తపః ప్రభావతో వింధ్యపర్వతాన్ని స్తంభింపచేసినందువల్ల (అగమ్-పర్వతమ్, స్తంభయతీతి అగస్త్యః) ఆయన అగస్త్య నామంతో ప్రసిద్ధుడయ్యాడు. అగస్త్యమహర్షి కారణంగానే వింధ్యకు దక్షిణదిశలోని ప్రాంతమంతా సురక్షితంగా ఉంది" అని సీతాలక్ష్మణులకు అగస్త్య మహర్షి గురించి విశేషాలు చెబుతుండగా ఆశ్రమానికి చేరుకున్నారు.

లక్ష్మణుడి ద్వారా తమ రాకను అగస్త్యమహామునికి తెలియజేయమని చెప్పి, ఆయన ఆహ్వానించగానే సీతారామలక్ష్మణులు ఆయన దర్శనంకోసం బయలుదేరారు. అగస్త్య మహాముని తన శిష్యులతో బాటు వాళ్ళకు ఎదురేగాడు. సీతారామలక్ష్మణులు అగస్త్యమునికి పాదాభివందనం చేశారు.

అగస్త్యుడు వాళ్ళకి అతిథి సత్కారాలు చేశాడు. విశ్వకర్మ నిర్మించిన వైష్ణవ చాపాన్ని దేవేంద్రుడు ఇచ్చిన అక్షయమైన తూణీరాలను (బాణాలను కొరతలేకుండా సమకూర్చేవి) బంగారు ఒర కలిగిన బంగారు ఖడ్గాన్ని రాముడికి బహూకరించాడు.



# అరణ్య కాండం

***శ్రీ రాఘవం దశరథాత్మజమప్రమేయం***
***సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్।***
***ఆజానుబాహుమరవిందదళాయతాక్షం***
***రామం నిశాచరవినాశకరం నమామి॥***

## దండకారణ్య ప్రవేశం - దనుజ సంహారం

సాటిలేని మహావీరుడైన రాముడు అసాధ్యమైన దండకారణ్యంలోని ప్రవేశించాడు. అక్కడ అనేక తాపసాశ్రమాలు కన్పించాయి. మునులు సీతారామలక్ష్మణులకు స్వాగతం పలికారు. ఆశ్రమ సమూహం అంతటా వేదఘోషలతో ప్రతిధ్వనించింది. రాముడితో 'తమరక్షణ భారం ఆయనదేనని, తాము శాపాయుధాలను విడిచామని, తపోవిధులకు శత్రువైన కోపాన్ని పరిత్యజించామని, నగరంలో ఉన్నా కాననంలో ఉన్నా అతడే తమ ప్రభువని, కనుక గర్భస్థ శిశువును తల్లి కాపాడుతున్నట్లు అనుక్షణం రాముడే తమను రక్షించాలని' వేడుకున్నారు. ఆ తర్వాత పూలు, కందమూల ఫలాలు, ఇతర ఆహార పదార్థాలు వాళ్ళకి సమర్పించి అతిథి మర్యాదలు చేశారు. ఆ రాత్రి అక్కడే గడిపి అరణ్య ప్రయాణాన్ని కొనసాగించారు సీతారామలక్ష్మణులు.

దారిలో కొండలా ఉన్న రాక్షసుడు అనేక మృగాలను శూలంలో గుచ్చుకొని తారస పడ్డాడు. అతడిది అతిభయంకర వికృతాకారం. రామలక్ష్మణుల్ని చూసి "పాపాత్ములైన మీ ఇద్దరినీ చంపి, సీతను నా భార్యగా చేసుకుంటాను" అన్నాడు. అతడు విరాధుడనే రాక్షసుడు. నిత్యం మునుల మాంసాన్ని భక్షించేవాడు. సీతాదేవి నడుమును పట్టుకొని పైకెత్తి కొంతదూరం వెళ్ళి రామలక్ష్మణులతో పై విధంగా పలికాడు. సీత భయంతో సుడిగాలికి దెబ్బతిన్న అరటి చెట్టులా కంపించింది.

రాముడు హతాశుడై దీనంగా విలపించాడు. లక్ష్మణుడు అతణ్ణి ఓదార్చి, తానిప్పుడే ఆ రాక్షసుణ్ణి వధిస్తానని ఆవేశంతో పలికాడు. జయుడు, శతహ్రదలకు కుమారుడైన విరాధుడు "నా తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ఇచ్చిన వరప్రభావంతో శస్త్రాలేవీ నన్ను చంపలేవు. నా శరీరాన్ని ఏవీ ఛేదించలేవు" అని రామలక్ష్మణులతో పలికి, ప్రాణాలపై తీపి ఉంటే సీతను విడిచి వెంటనే వెళ్ళండి. లేకపోతే యుద్ధంలో మిమ్మల్ని హతమార్చి మీ రక్తాన్ని తాగుతాను అని హెచ్చరించాడు.

రామలక్ష్మణు లెన్నిరకాలుగా ప్రయత్నించినా అతడు చావకపోవడంతో శ్రీరాముడు తమ్ముణ్ణి చూసి "లక్ష్మణా! శస్త్రాలతో ఇతణ్ణి చంపడం అసాధ్యం. కనుక ఈ రాక్షసుణ్ణి భూమిలో పాతిపెడదాం" అన్నాడు. ఆ మాటలు విన్న రాక్షసుడికి పూర్వస్మృతి కలిగింది. శ్రీరాముడితో వినయంగా, "ఓ మహాపురుషా! ఇంద్రుని అంతటి బలశాలి అయిన నీ దెబ్బకు చచ్చాను. నువ్వు శ్రీరాముడివని గ్రహించాను. నేను తుంబురుడనే గంధర్వుణ్ణి. రంభ అనే అప్సరసపై మక్కువతో కుబేరుని సేవకు సకాలంలో పాల్గొనలేకపోయాను. అందువల్ల కుబేరుడు నన్ను శపించాడు. నీ వల్ల శాపవిముక్తి పొందాను. ఇక్కడికి ఒకటిన్నర యోజనం దూరంలో శరభంగ మహర్షి ఆశ్రమం ఉంది. అక్కడికి వెళ్తే ఆయనవల్ల మీకు మేలు కలుగుతుంది" అన్నాడు.

విరాధుణ్ణి గొయ్యి తీసి పూడ్చి పెట్టిన తర్వాత శ్రీరామాదులు శరభంగ ఆశ్రమం వైపు పయనించారు.

## మహర్షుల అనుగ్రహం - సీతాదేవి సంశయం

శరభంగ ఆశ్రమానికి కొంతదూరంలో ఉండగానే ఆశ్రమ సమీపంలో దివ్యతేజస్సుతో వెలుగుతున్న అద్భుతవ్యక్తిని రాముడు చూశాడు. అతడు భూమిని తాకకుండా వెళ్ళాడు. అతణ్ణి దేవతలు అనుసరించారు. రాముడు అతడు ఇంద్రుడే అని నిర్ధారించాడు.

ఇంద్రుడు శరభంగ మహర్షితో 'రాముడు ఇటే వస్తున్నాడు. దేవతలకు దుష్కరమైన కార్యాన్ని ఆయన సాధించాలి. ఆ పిమ్మటే ఆయన్ని దర్శిస్తాను" అని రథం ఎక్కి స్వర్గం చేరుకున్నాడు. శరభంగమహర్షిని సమీపించి, నమస్కరించి ఆ దివ్య పురుషుణ్ని గురించి రాముడు ప్రశ్నించాడు.

"అతడు ఇంద్రుడు. బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు నన్ను బ్రహ్మ (సత్య) లోకానికి తీసుకువెళ్ళడానికి వచ్చాడు. నా తపశ్శక్తి ప్రభావంతో నాశనంలేని బ్రహ్మలోక, స్వర్గాది సమస్త లోకాల శుభఫలాలన్నీ నాకు లభించాయి. నా తపః ఫలాలన్నిటినీ అతిథివై వచ్చిన నీకు సమర్పిస్తున్నాను. మీరు సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి వెళ్ళండి. ఆయన మీకు యోగ్యమైన నివాస ప్రదేశాన్ని సూచించగలడు. నీ దర్శనం కోసమే నేనింత వరకు శరీరంతో ఉన్నాను" అని మహర్షి చెప్పి, అగ్నిని ప్రతిష్ఠించి, బ్రహ్మమేథ మంత్రాలు పఠిస్తూ అగ్నిలో ప్రవేశించాడు. అందులోంచి 15 ఏళ్ళ బాలుడి రూపంతో అగ్ని తేజస్సుతో ప్రకాశిస్తూ, వెలువడి బ్రహ్మలోకం చేరాడు.

శరభంగ మహర్షి దివంగతుడైన తర్వాత మునీశ్వరులు ఎందరో రాముణ్ని దర్శించారు. పితృవాక్య పరిపాలన నెపంతో తాపసుల్ని రక్షించడానికే శ్రీరాముడు వచ్చాడని ఆ మునులు పేర్కొన్నారు. తర్వాత శ్రీరాముడు సుతీక్ష్ణ మహర్షిని సందర్శించాడు. "నా



పుణ్యకర్మల ప్రభావంవల్ల లోకాలన్నీ నా వశంలో ఉన్నాయి. వాటిని నీకు సమర్పిస్తున్నాను" అని మహర్షి చెప్పినప్పుడు, శ్రీరాముడు "పుణ్యలోకాలను తనంతటతానే సాధించు కుంటానని, అప్పటికి నివాసయోగ్యమైన ప్రాంతం గురించి చెప్పు"మని మహర్షిని అడిగాడు. మరుసటి రోజు ఉదయం దండకారణ్య ప్రాంతంలోని మహామహుల ఆశ్రమాలనన్నిటినీ దర్శించాలని తనకు, సీతాలక్ష్మణులకు, తన వెంట ఉన్న మునులకు అనుమతిని ఇవ్వమని మహర్షిని ప్రార్థించి రాముడు పయనం కొనసాగించాడు.

దారిలో సీత రాముడివద్ద ఒక సంశయాన్ని వెలిబుచ్చింది. "స్వామీ! మీరు ముని ధర్మాన్ని పాటిస్తున్నారు, కోరికలవల్ల జనించే వ్యసనాల నుంచి బయటపడిన వాళ్ళు మాత్రమే ఆ ధర్మాన్ని పాటించగలరు. అబద్ధాలాడటం, పరస్త్రీ వ్యామోహం, తనకు ఎటువంటి శత్రుభావం లేకపోయినా ప్రాణిహింసకు పూనుకోవడం - ఇవి కామజాలైన (కోరికలవల్ల పుట్టే) వ్యసనాలు. మీరు సత్యసంధులు. ఏ పరిస్థితుల్లోను అసత్యం పలుకరు. ఏకపత్నీవ్రతులు. జితేంద్రియులు. కనుక పరస్త్రీ వ్యామోహం మీకు లేదు. కాని మీకు రాక్షసుల పట్ల శత్రుత్వం ఏమీ లేదు కదా! వాళ్ళని చంపుతానని ప్రతిజ్ఞ చేయడం ఎంతవరకు సమంజసం" అని అడిగింది.

అప్పుడు శ్రీరాముడు "తాపసులు లోకక్షేమం ఆశించి తపస్సు ఆచరిస్తుంటారు. సాధుస్వభావులైన వాళ్ళని హింసించే రాక్షసుల్ని అణచివెయ్యడం క్షత్రియ ధర్మం. ధర్మనిరతులుగా, కందమూలాలనే ఆహారంగా స్వీకరించే వాళ్ళు తాపసులు. నన్ను ఆశ్రయించారు. రక్షించవలసిన వాళ్ళకోసం, దుష్ట స్వభావుల్ని శిక్షించడం ధర్మం" అని సమాధానం ఇచ్చాడు. 'ఎట్టిపరిస్థితుల్లోనూ ప్రతిజ్ఞాభంగానికి పాల్పడ'నని దృఢంగా పలికాడు.

## మాండకర్ణి మహర్షి వృత్తాంతం - అగస్త్యమహర్షి సందర్శనం

మునులతో కలిసి కొంతదూరం వెళ్ళిన తర్వాత సూర్యాస్తమయ సమయంలో ఒక యోజనం మేర విస్తరించిన మనోహరమైన తటాకాన్ని చూశారు. అందులోంచి చక్కటి సంగీతం, మధురగానం విన్పించింది. ఆ సంగీతం విని ధర్మభృతుడనే మహర్షిని రామలక్ష్మణులు దాని విశేషం ఏమిటని ప్రశ్నించారు.

"ఆ సరస్సు పేరు పంచాప్సరం". అన్ని కాలాలలోనూ నీళ్ళు సమృద్ధిగా ఉండేటట్లు మాండకర్ణి అనే మహర్షి తన తపః ప్రభావంతో దీన్ని నిర్మించాడు. గాలిని, నీటిని మాత్రమే గ్రహించి పదివేల సంవత్సరాలు తీవ్రమైన తపస్సు చేశాడు. దేవతలు భయపడి అయిదుగురు దివ్యాంగనల్ని మునివద్దకు పంపారు. పరస్పరం కామపరవశులై ఈ తటాకం

దాన్ని చూసి ఆశ్చర్యం చెంది, దాన్ని సొంతం చేసుకోవాలన్న వ్యామోహంలో రామలక్ష్మణుల్ని పిలిచి చూపింది.

లక్ష్మణుడు "అన్నా ఇది నిజమైన జింక కాదు. రాక్షసుడైన మారీచుడే ఈ రూపంలో ఇక్కడికి వచ్చి ఉంటాడు. వేటమీద ఆసక్తితో ఈ వనంలో సంచరించిన రాజుల్ని కామరూపి అయిన ఆ రాక్షసుడు హతమార్చిన వాడు" అని హెచ్చరించాడు. కాని సీత కోరికను కాదనలేక లక్ష్మణుణ్ణి సీతకు రక్షగా ఉంచి లేడి వెంట పడ్డాడు.

ఆ మాయామృగం క్రమక్రమంగా ఆశ్రమానికి దూరంగా పరుగుపెట్టింది. రాముడు కోపంతో బ్రహ్మనిర్మితమైన అస్త్రాన్ని మృగంపై వదిలాడు. అది మారీచుని శరీరాన్ని చీల్చి వేసింది. ఇక ప్రాణాలు పోతుందనగా రావణుడి ఆదేశానుసారం కర్తవ్యాన్ని స్మరించి రాముడి కంఠస్వరాన్ని అనుకరిస్తూ 'హా సీతా! హా లక్ష్మణా! అని ఆర్తనాదం చేశాడు. రాముడు రాక్షసుని శరీరాన్ని చూసి లక్ష్మణుడి మాటలు గుర్తుకుతెచ్చుకొని, తీవ్రమైన భయానికిలోనై జనస్థానం వైపు వెళ్ళాడు.

సీత ఆ ఆర్తనాదం విని శ్రీరాముణ్ణి రక్షించమని లక్ష్మణుడితో చెప్పింది. లక్ష్మణుడు రాముడికి ఏమీ కాదని, ఏ ఆపదా రాదని, ఇది కేవలం రాక్షస మాయ అని చెప్పినా ఆమె పెడచెవిని పెట్టింది. పైగా లక్ష్మణుడి శీలాన్ని శంకించి మాట్లాడింది. ఇక గత్యంతరం లేక లక్ష్మణుడు ధనుర్బాణాలతో బయలుదేరాడు.

## రావణుడి వేషం - జటాయువు త్యాగం

లక్ష్మణుడు అటు వెళ్ళగానే రావణుడు సాధుపురుషుడి రూపంలో అక్కడికి చేరుకున్నాడు. చిన్నచిన్నగా సీత సౌందర్యాన్ని పొగుడుతూ ఇంత భయంకర అరణ్యంలో నివసించవలసిన కారణం ఏమిటని ప్రశ్నించాడు. సీతాదేవి సాధువేషంలో ఉన్న రావణుణ్ణి అనుమానించలేదు. రావణుడు తన మనసులోని ఆకాంక్షను తెలియజేస్తూ ప్రలోభపెట్టాడు. సీత తీవ్ర నిరసన తెలియజేసి తిరస్కరించడంతో రాక్షసరూపంలో సీతాదేవికురుల్ని ఎడమ చేతితో, ఆమె పాదాలను కుడిచేతితో పట్టుకొని రథంపై ఉంచి ఆకాశమార్గంలో వెళ్ళ సాగాడు. సీత ఆర్తనాదాలు విని జటాయువు అడ్డగించి, వీరోచితంగా పోరాడి, రావణుడి రథాన్ని ముక్కలు చేశాడు. రావణుడు ఖడ్గంతో జటాయువు రెక్కల్ని, పార్శ్వభాగాలను నరికాడు.

దారిలో సీతాదేవి రత్న ఖచితమైన ఎడమకాలి అందె జారిపడింది. సీత శోకంతో ప్రకృతి సైతం సానుభూతిగా స్పందించిన తీరును వాల్మీకి ఈ చోట అద్భుతంగా వర్ణించాడు. ఆకాశమార్గంలో వెళ్తుండగా అయిదుగురు వానరులు సీతకు కన్పించారు. సీత తన పట్టు ఉత్తరీయపు కొంగులో మంగళకరమైన ఆభరణాలు కొన్నిటిని మూటగట్టి వారి మధ్య పడేటట్లు వదిలింది.



## పంచవటి నివాసం - శూర్పణఖ ప్రవేశం

రాముడి అభ్యర్థన మేరకు, అగస్త్యుడు 'పంచవటి' ని వాళ్ళకు నివాసయోగ్యమైన ప్రదేశమని సూచించాడు. పంచవటిని సమీపిస్తున్న సమయంలో ఒక పెద్ద గ్రద్ద కన్పించింది. ప్రసంగవశాత్తు తన వంశం గురించి గ్రద్ద వివరించింది. 'వినతకు పుట్టిన అరుణుడు (అనూరుడు) గరుడుడు అనే ఇద్దరు కొడుకుల్లో అరుణిడికి సంపాతి, జటాయువులనే సంతానం కలిగింది. నేను రెండవవాడైన జటాయువును, నా తల్లి పేరు శ్యేని. దశరథుడికి నేను మంచి మిత్రుణ్ణి. నువ్వు అనుమతిస్తే నీ నివాస స్థలాన్ని రక్షించటానికి తోడ్పడతా' నని జటాయువు చెప్పాడు. జటాయువును పూజించి రాముడు కౌగిలించుకున్నాడు.

పంచవటి రమణీయమైన ప్రకృతి శోభతోబాటు వివిధ సర్పాలు, మృగాలతో నిండి ఉన్న ప్రదేశం. లక్ష్మణుడు మనోహరమైన పర్ణశాలను నిర్మించాడు. పంచవటిలో నివసిస్తు న్నప్పుడు శరదృతువు ముగిసి ప్రాణులన్నిటికీ ఇష్టమైన హేమంతఋతువు ప్రారంభ మయింది. పురాణకథా ప్రసంగాలతో కాలం గడుపుతున్న శ్రీరాముడివద్దకు రావణుడి చెల్లెలైన శూర్పణఖ వచ్చింది. మిక్కిలి వికృతమైన ఆకారం, విపరీత స్వరం కలిగిన శూర్పణఖ రాముడి సౌందర్యాన్ని చూసి మోహించి అతనితో తన కోరికను వెల్లడించింది.

శ్రీరాముడు సున్నితంగా తిరస్కరిస్తూ తనకు భార్య ఉందని, అందువల్ల శూర్పణఖకు సవతిపోరు ఉంటుందని, తన సోదరుడైన లక్ష్మణుణ్ణి ఆశ్రయించమన్నాడు. వెంటనే శూర్పణఖ లక్ష్మణుడి దగ్గరకు వెళ్ళి తన్ను పెండ్లి చేసుకొమ్మంది. లక్ష్మణుడు నేను మా అన్న ఆజ్ఞకు లోబడినవాణ్ణి. నాకు భార్యవయితే నువ్వూ దాసివవుతావు. కనుక మా అన్ననే ఆశ్రయించమన్నాడు.

## శూర్పణఖ పరాభవం–జనస్థాన రాక్షస సంహారం

ఇరువురూ చేసిన పరిహాసాన్ని అర్థం చేసుకోలేని శూర్పణఖ మళ్ళీ రాముడి వద్దకు వెళ్ళి "మానవకాంత అయిన సీతను నీ ముందే నమిలి మింగేస్తాను. సవతి పోరు లేకుండా నీతో జీవిస్తాను" అని సీతాదేవిపై దాడికి దిగింది. రాముడు కోపావేశుడై లక్ష్మణుడితో ఆ దుష్టరాక్షసిని శిక్షించమన్నాడు. లక్ష్మణుడు రాముని సమీపంలోని కత్తిని తీసుకొని శూర్పణఖ ముక్కు చెవులను ఖండించాడు.

శూర్పణఖ తనకు కలిగిన అవమానాన్ని తన సోదరుడైన ఖరుడితో మొరపెట్టుకుంది. ఖరుడు అతడితోబాటు అతని సోదరుడు దూషణుడు, వాళ్ళ సేనాపతి త్రిశిరుడు, పధ్నాలుగు వేలమంది రాక్షస సైన్యంతో రాముడిపైకి దండెత్తారు. ఈ సందర్భంలో సీతను తీసుకెళ్ళి దూరంగా ఉన్న గుహలోకి ఆమెను సురక్షితంగా ఉంచమని తానొక్కడే మొత్తం రాక్షసైన్యాన్ని మూడు గడియల్లో తుదముట్టించాడు శ్రీరాముడు.

## శూర్పణఖ ఆక్రోశం-సీతాపహరణం

దండకారణ్యప్రాంతంలో (జనస్థానంలో) సంచరిస్తున్న రావణుడి గూఢచారుల్లో ఒకడైన అకంపనుడు లంకకు వెళ్ళి రావణుడికి జనస్థానంలో జరిగిన అపార రాక్షస వధను గురించి చెప్పాడు. ఆ మాటలు విన్న రావణుడు క్రోధంతో 'రామలక్ష్మణుల్ని చంపడానికి ఇప్పుడే జనస్థానానికి వెళ్తా' నన్నాడు. అకంపనుడు అతణ్ణి వారించాడు.

"శ్రీరాముడు మానవాతీత బలపరాక్రమ సంపన్నుడు. అతడు కోపిస్తే దేవాసురు లందరూ ఏకమైనా నిగ్రహించలేరు. నదుల్ని సైతం బాణాలతో నిరోధించగలవాడు. ఆకాశాన్ని కూడా శిథిలం చెయ్యగలడు. సంకల్పించినంత మాత్రాన సకలలోకాలలోని సమస్త ప్రాణుల్ని లయం చెయ్యటానికి, సృష్టించటానికి సర్వసమర్థుడు. యుద్ధంలో అతణ్ణి జయించటం అసాధ్యం. ఉత్తమురాలు, లోకోత్తర సౌందర్యవతి, నిండు జవ్వని సీతాదేవి అతడి భార్య. ఆ సీత అంటే రాముడికి ప్రాణం. ఏదైనా ఉపాయంతో ఆమెను అపహరిస్తే భార్యావియోగంతో అతడు మరణిస్తాడు" అని అకంపనుడు రావణుడికి సలహా ఇచ్చాడు.

రావణుడికి అతడి మాటలు నచ్చాయి. రథాన్ని అధిరోహించి సారథితోబాటు మారీచాశ్రమానికి చేరుకున్నాడు. తాను వచ్చిన కార్యాన్ని తెలిపి తనకు సాయం చెయ్యమని రావణుడు మారీచుణ్ణి కోరాడు. మారీచుడు 'నీకు సీత గురించి చెప్పిన వాడెవ్వడు? ఇటువంటి సలహా ఇచ్చినవాడు నీకే కాక సమస్త రాక్షస జాతికి కీడు తలపెట్టినవాడు. శ్రీరాముడు మదపుటేనుగు, సింహం వంటివాడు. చొరలేని ఘోరపాతాళబిలం వంటివాడు. నువ్వు లంకకు తిరిగి వెళ్ళి నీ భార్యలతో కలిసి సుఖించు" అని హితవు పలికాడు. రావణుడూ ఊరట చెంది వెనుదిరిగాడు.

శూర్పణఖ రాముడు చేసిన రాక్షస సంహారం చూసి భయకంపితురాలయింది. లంకానగరానికి పరుగులు తీసింది. అప్పుడు రావణుడు 'పుష్పకం' అనే తన రాజభవనంలో నిండుకొలువు తీరి ఉన్నాడు. ఈ సందర్భంగా రావణుడి వైభవం, పరాక్రమం నిరుపమానం అని వాల్మీకి విపులంగా వర్ణించాడు.

శూర్పణఖ నిండు కొలువులో రావణుడితో రాజు లక్షణాలు వివరించింది. రావణుడి మూర్ఖత్వాన్ని నిరసిస్తుంది. రామలక్ష్మణుల సౌందర్యాన్ని, శౌర్యపరాక్రమాలను వర్ణించింది. 'దేవ గంధర్వ యక్ష కిన్నర స్త్రీలలో ఎవరూ సీతాదేవి సౌందర్యానికి సాటిరారు. అటువంటి సీత నీకు భార్యకావడం సమంజసం. ఆమెను భార్యగా పొందడం గొప్ప అదృష్టం. క్రూరులైన రామలక్ష్మణుల్ని చంపి రాక్షసుల ఆత్మకు శాంతి చేకూర్చు" అని రావణుణ్ణి శూర్పణఖ రెచ్చగొట్టింది.



## మారీచుని హెచ్చరిక - హితబోధ

శూర్పణఖ చెప్పిన మాటలతో సీతను అపహరించుకురావటానికి రావణుడు నిశ్చయించాడు. వెంటనే రథారోహణచేసి, మారీచుని ఆశ్రమానికి వెళ్ళాడు. రావణుణ్ణి సాదరంగా ఆహ్వానించి మళ్ళీ అతడు రావటానికి కారణం ఏమిటని మారీచుడు ప్రశ్నించాడు. రావణుడు రాముడి కారణంగా రాక్షసులకు ఏర్పడిన నష్టాన్ని తెలిపి, శూర్పణఖను కురూపిని  చేసినందుకు ప్రతీకారంగా సీతను బలవంతంగా జనస్థానం నుంచి తీసుకొని రాదలచినట్లు చెప్పి, మారీచుని సాయం కావాలన్నాడు. సాయపడవలసిన తీరును కూడా వివరించాడు. తెల్లని చుక్కలున్న చిత్రమైన బంగారు లేడిరూపం ధరించి రాముని ఆశ్రమప్రాంతాల్లో విహరించు. సీత వ్యామోహం చెంది బంగారు లేడిని కోరుతుంది. రామలక్ష్మణులు ఆ లేడికోసం వెంటపడతారు. ఒంటరిగా ఉన్న సీతను నిరాటంకంగా చంద్రకాంతుల్ని హరించే రాహువులా హరిస్తానన్నాడు.

రామ ప్రస్తావన రాగానే మారీచుడు కంపించాడు. రావణుడికి అనేక రకాలుగా హితోపదేశం చేశాడు. ఎన్ని నీతులు వల్లించినా రావణుడు మొండిగా తాను చెప్పినట్లే ప్రవర్తించాలని బలవంతం చేశాడు. విశ్వామిత్రుని యజ్ఞసమయంలోనే కాక మరొకసారి రాముడి ప్రతాపాన్ని తాను ప్రత్యక్షంగా అనుభవించిన సందర్భాన్ని మారీచుడు వర్ణించాడు.

"ఒకరోజు మృగాలరూపం ధరించిన ఇద్దరు రాక్షసులతో కలిసి నేనూ ఒక ఘోర మృగరూపం ధరించాను. అడవిలో తిరుగుతూ మునీశ్వరుల్ని హింసిస్తూ సంచరించేవాణ్ణి. అలా తిరుగుతూ మునివేషంలో ఉన్న రాముణ్ణి, సీతాలక్ష్మణుల్ని సమీపించాను. రాముడి ప్రతాపం గురించి తెలిసినా తపోవృత్తిలో ఉన్నాడు కనుక నాకు ఏ ఆపదా కలిగించడని భావించాను. గతంలో జరిగిన పరాభవం గుర్తుకు రాగా కోపంతో రాముణ్ణి చంపాలని ఆయన మీదికి దూకాను. అప్పుడు రాముడు మూడు బాణాలను సంధించి వదిలాడు. అవి మమ్మల్ని వెంటాడాయి. రామబాణాల తీవ్రతచూసిన వాణ్ణి కనుక అటు ఇటు తిరుగుతూ తప్పించుకున్నాను. కాని వాళ్ళిద్దరూ ప్రాణాలు కోల్పోయారు. అప్పటి నుంచి ఈ ఆశ్రమంలో గడుపుతున్నాను. తర్వాత పశ్చాత్తాపంతో మునుపటి దుర్మార్గాలను విడిచి పెట్టాను".

## మాయామృగం-మోహపర్యవసానం

ఈ విధంగా రాముని శౌర్యప్రతాపాలను పేర్కొన్నా రావణుడు తాను ఆజ్ఞాపించినట్లు ప్రవర్తించకపోతే ప్రాణాలు తీస్తానన్నాడు. రావణుడి చేతిలో చావడం కన్నా రామబాణంతో ప్రాణాలు పోగొట్టు కోవడం ఉత్తమం అని భావించి రావణుడి పన్నాగానికి మారీచుడు అంగీకరించాడు. బంగారు లేడిరూపంలో మారీచుడు సీత కళ్ళకు కనిపించాడు. సీత

స్నేహం నీకు ప్రయోజనం కలిగిస్తుంది. అతణ్ణి కలిసి అగ్నిసాక్షిగా మైత్రి నెరపినట్లయితే మీరు పరస్పరం ఒకరికొకరు సాయపడగలరు. పశ్చిమదిశగా ఈ మార్గంలో వెళ్తే మీకు శుభం కలుగుతుంది. దారిలో మతంగమహర్షి ఆశ్రమం ఉంది. అందులో 'శబరి' అనే సన్యాసిని మాత్రం ప్రస్తుతం ఉంది. నిన్ను దర్శించిన వెంటనే ఆమెకు స్వర్గప్రాప్తి కలుగు తుంది. మతంగమహర్షి నిర్మించడంవల్ల దానికి మతంగవనం అని పేరు. పంపా సరోవరానికి తూర్పున ఋష్యమూకం అనే పర్వతం కన్పిస్తుంది. అందులో నిద్రించిన వ్యక్తికి స్వప్నంలో లభ్యమయ్యే సంపద నిజ జీవితంలో సఫలమవుతుంది. అక్కడ 'శిలాపిధానం' (శిలలచే కప్పబడినందువల్ల ఆ పేరు) అనే గుహ కన్పిస్తుంది. దాని తూర్పు దిక్కులో ఒక మడుగుంది. సుగ్రీవుడు తన నలుగురు అనుచరులతో ఆ గుహలో నివసిస్తుంటాడు" అని మార్గనిర్దేశం చేసి రామలక్ష్మణుల అనుమతితో కబంధుడు స్వర్గం చేరాడు.

## శబరి భక్తి – తపస్సిద్ధి

రామలక్ష్మణులు శబరిని కలిశారు. యోగసిద్ధి పొందిన ఆమె రామలక్ష్మణుల్ని చూసి పాదాభివందనం చేసింది. అర్ఘ్యపాద్యాదులతో యథావిధిగా అతిథి మర్యాదలు చేసింది. రాముడు 'తపోవిధులు నిర్విఘ్నంగా కొనసాగుతున్నాయా' అని విచారించిన తర్వాత శబరి తన గురువైన మతంగ మహర్షి తపశ్శక్తిని, మహిమను కీర్తించింది. "సీతారామ లక్ష్మణులు చిత్రకూటంలో ఉన్నప్పుడు మతంగ మహర్షి దివ్యకాంతులతో విరాజిల్లే విమానంపై పరమపదం చేరాడని, ఆయన తనతో ఈ ఆశ్రమానికి రామచంద్ర ప్రభువు సౌమిత్రితో (సుమిత్ర పుత్రుడు లక్ష్మణుడు) వస్తాడని, అప్పుడు వాళ్ళకి అతిథి మర్యాదలు నిర్వహించమని, రామదర్శనభాగ్యం తర్వాత నీకు అక్షయ లోకాలు (కైవల్యం) సిద్ధిస్తాయని" మహర్షి చెప్పినట్లు శబరి పేర్కొంది.

'ఓ పురుషోత్తమా! పంపాతీరంలో లభించే ఫలమూలాదుల్ని నీ కోసం సిద్ధపరిచాను' అని శబరి చెప్పగా, రాముడు ఆనందించి, ఆమె ఇష్టానుసారం వెళ్ళమని చెప్పాడు.

శ్రీరాముని అనుమతి పొందిన పిదప శబరి తన శరీరాన్ని అగ్నికి ఆహుతి చేసి, అగ్ని తేజస్సుతో వెలుగుతూ పరంధామానికి చేరుకుంది. వివిధ వృక్షాలతో శోభిల్లుతున్న ఆ పంపాసరస్సు తీరాన్ని, వనాన్ని చూస్తూ రామలక్ష్మణులు వడివడిగా నడిచారు. దారిలో రాముడు కబంధుని మాటలన్నింటినీ గుర్తుకు తెచ్చుకున్నాడు. సీతను తలచుకొని వ్యథ చెందాడు. ఇలా శోక విషాదాలతో దిక్కుతోచని శ్రీరాముడు మనోహరమైన పంపా సరస్సును దర్శించాడు.



## లంకా పట్టణంలో సీత

సీతతోబాటు లంకాపట్టణం చేరి అనేక కక్ష్యలున్న అంతఃపురంలో రావణుడు ఉంచాడు. తన అనుమతి లేకుండా ఏ పురుషుడు కాని, స్త్రీ కాని సీతను చూడరాదని ఆజ్ఞాపించాడు. బలిష్ఠులైన ఎనిమిది మంది రాక్షసులను పిలిచి సాయుధులుగా వెంటనే జనస్థానం వెళ్ళి రాముడి కదలికలను, ప్రయత్నాలను గ్రహించి ఎప్పటికప్పుడు తనకు తెలియజేయమన్నాడు.

అనంతరం రావణుడు తన ప్రాసాదాన్ని సీతాదేవికి చూపుతూ, తన పరాక్రమాన్ని, వైభవాన్ని విపులంగా తెలియజేశాడు. సీత పదే పదే రాముడిచేతిలో రావణుడి చావు తప్పదన్న విషయాన్ని పేర్కొంటూ, పరిపరివిధాల అతడి దుశ్చర్యను నిందించింది. "నీకు పన్నెండు నెలలు గడువు ఇస్తున్నాను. అప్పటికీ నీవు నా పట్ల సుముఖత చూపకపోతే ఆ మరునాడే ప్రాతఃకాల భోజనానికి వంటవాళ్ళు నిన్ను ముక్కలు చేస్తారు" అని హెచ్చరించి వికృతాకారులైన రాక్షస స్త్రీలతో రావణుడు ఆమెను ఏదోవిధంగా దారికితెండని ఆజ్ఞాపించాడు.

'సీతను అశోకవనానికి తీసుకు వెళ్ళి వనమధ్యభాగంలోని రహస్యప్రదేశంలో ఉంచి కాపలా కాయండి. ఆమెతో రకరకాలుగా మాట్లాడి సీతబుద్ధిని మరల్చండి' అని రావణుడు ఆజ్ఞాపించాడు.

సీత లంకలో ప్రవేశించిన తర్వాత బ్రహ్మ దేవేంద్రుడితో ఇలా అన్నాడు – "పరమ పతివ్రత అయిన సీత ఆహారం స్వీకరించడం లేదు. ఇలాగే కొనసాగితే ఆమె ప్రాణాలు మిగలవు. ఆమె ప్రాణాలు కోల్పోతే మన కార్యం (రావణ సంహారం) నెరవేరదు. కనుక దేవేంద్రా! వెంటనే లంకకు వెళ్ళి దివ్యమైన పాయసాన్ని ఆమెకివ్వు".

దేవేంద్రుడు వెంటనే స్పందించి లంకకుచేరి నిద్రాదేవిని ఆహ్వానించి రాక్షసుల్ని నిద్రమత్తుకు లోను చెయ్యమని ఆజ్ఞాపించాడు. నిద్రాదేవి రాక్షసుల్ని నిద్రావశుల్ని చేసింది. దేవేంద్రుడు సీతాదేవి ముందు నిలిచి పాయసాన్ని ఇస్తూ ఆరగించమన్నాడు. అందువల్ల ఆకలిదప్పులు ఆమెను ఎప్పటికీ బాధించవన్నాడు. సీతాదేవి సందేహిస్తూ ఉండగా తన దివ్య చిహ్నాలను ప్రకటించాడు. కనురెప్పలు మూతపడకపోవడం, పాదాలు నేలను స్పృశించక పోవడం, ధూళిలేని వస్త్రాలు, వసివాడని పూలమాలలు చూసి సీత సందేహం తీరి పాయసాన్ని గ్రహించింది.

## శ్రీరాముని శోకం

మారీచుణ్ణి చంపి వెను తిరిగిన రాముడికి అనేక అపశకునాలు ఎదురయ్యాయి. అతడు ఆందోళన పడుతూ వస్తుండగా, లక్ష్మణుడు ఎదురు రావడంతో మరింత ఆత్రుత

చెందాడు. లక్ష్మణుడితో ఆశ్రమం చేరిన రాముడు సీత అక్కడ లేకపోవడంతో తాము నడయాడిన ప్రదేశాలన్నిటినీ వెతికాడు. భరించలేని దుఃఖభారంతో క్రుంగిపోయాడు. లక్ష్మణుడు ఆమెను ఒంటరిగా విడిచిరావడం తప్పన్నాడు. లక్ష్మణుడు తన నిస్సహాయతను వెలిబుచ్చాడు. అన్నను ఓదార్చాడు.

శ్రీరాముడు ప్రతి చెట్టును, పుట్టను, మృగాలను, పశుపక్ష్యాదుల్ని అన్నిటినీ పలకరించి సీతను గురించి విచారించడం మొదలు పెట్టాడు. సీతాదేవి రూపలావణ్యాలను, గుణగణాలను గుర్తుకు తెచ్చుకొని వ్యథ చెందాడు. సీతాదేవి పాదచిహ్నాలను, ధరించిన పూలను, ఆభరణాలను దారిలో చూశాడు. తీవ్రపరితాపంతో క్రోధావేశంతో దేవతలు సీతాదేవిని అప్పగించకపోతే ముల్లోకాలను భస్మం చేస్తానని బాణం సంధించడానికి పూనుకున్నాడు.

లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చి శాంతింపజేశాడు. దుష్టుడైన రాక్షసుణ్ని గుర్తించి, ఆ నీచుణ్ణి హతమార్చటం మన కర్తవ్యం. కనుక ఆగ్రహావేశాలను మానుకొమ్మన్నాడు. దారిలో దెబ్బతిని పడి ఉన్న జటాయువును చూసి పక్షిరూపంలో ఉన్న రాక్షసుడని రాముడు భావించాడు. క్షురమనే పేరుతో ఉన్న బాణాన్ని ఎక్కుపెడుతుండగా జటాయువు దైన్యంతో "సీతాదేవిని అపహరించినవాడు రావణుడనే రాక్షసుడు. నా ప్రాణాపాయానికి కారకుడతడే" అని జరిగిన వృత్తాంతాన్ని వివరించాడు.

సీతాపహరణ వార్తను విన్న రాముడు హతాశుడయ్యాడు. సీతను రక్షించడానికి తన ప్రాణాలను పణంగా పెట్టిన జటాయువును చూసి కన్నీరు కార్చాడు. అతణ్ణి కౌగిలించు కొని విలపించాడు. జటాయువు ప్రాణాలు విడిచిన తర్వాత తన తండ్రితో సముడైన జటాయువుకు చితిని పేర్చి అంత్యక్రియలు నిర్వహించాడు.

ఆ తర్వాత నైరుతి దిశవైపు రామలక్ష్మణులు పయనించారు. మూడు క్రోసుల దూరంలోని (దండకారణ్యం నుంచి) దట్టమైన క్రౌంచారణ్యానికి చేరుకున్నాడు. క్రౌంచారణ్యాన్ని దాటి మూడు క్రోసుల దూరం నడిచిన పిమ్మట అక్కడొక వనంలోని గుహను చూశారు. ఇది క్రౌంచారణ్యానికి, మతంగాశ్రమానికి మధ్యగల ప్రదేశం. రామ లక్ష్మణులు గుహ సమీపానికి వెళ్ళగా పెద్దశరీరం ఉన్న రాక్షసి కన్పించింది. ఆ రాక్షసి వాళ్ళని సమీపించి ముందు నడుస్తున్న లక్ష్మణుణ్ణి తన చేతుల్లోకి తీసుకొని 'రా క్రీడిద్దాం!' అని పలుకుతూ అతడి చేతుల్ని పట్టుకొంది.

'నా పేరు అయోముఖి. నీ అదృష్టంవల్ల నేను నీకు లభించాను. మనం ఇద్దరం కలిసి సుఖంగా జీవితాంతం వరకు రమిద్దాం!' అని రాక్షసి అన్న వెంటనే కోపోద్రిక్తుడైన లక్ష్మణుడు ఆమె ముక్కుచెవుల్ని స్తనాలను కోసివేశాడు. రాక్షసి పెడబొబ్బలు పెడుతూ పారిపోయింది.



## కబంధుని వృత్తాంతం

కొంతదూరం పయనించిన తర్వాత లక్ష్మణుడు తన ఎడమ భుజం అదురుతూంది, మనస్సు తత్తరపడుతూంది. ఇవి అశుభ సూచకాలన్నాడు. ఆ తర్వాత 'మిక్కిలి భయంకరమైన 'వంచులకం' అనే పక్షి పెద్దగా అరుస్తున్నది. ఇది మనకు యుద్ధంలో విజయాన్ని సూచిస్తున్నది' అని గూడా పేర్కొన్నాడు.

ఇంతలో మహాకాయుడు, వికృతాకారుడైన కబంధుడనే రాక్షసుణ్ణి చూశారు. శిరస్సులేని మొండెంతో పొట్టలో కన్ను కలిగిన అతడి ఆకారం చూడటానికి ఘోరంగా, చూడగానే గుండె ఆగిపోయే విధంగా ఉంది. రామలక్ష్మణులు కబంధుడి దీర్ఘహస్తాలను నరికివేశారు. అప్పుడా రాక్షసుడు 'మీరు ఎవరు?' అని అడిగాడు. లక్ష్మణుడు రాముణ్ణి పరిచయం చేసి రాక్షసుడి వృత్తాంతం గురించి అడిగాడు. కబంధుడికి అప్పుడు ఇంద్రుడి మాటలు గుర్తుకువచ్చాయి.

తాను పూర్వం సుందరరూపుడనని, దనువు కుమారుడినని (దానవుణ్ణి) కోరిన రూపం దాల్చగల వాణ్ణి కనుక ఘోరరూపందాల్చి మహర్షుల్ని భయపెట్టే వాణ్ణి అని, ఒకసారి స్థూలకర్ణుడనే పేరుగల మహర్షిని అలా భయపెట్టడంలో, ఈ రూపమే నీకు శాశ్వతంగా ఉండిపోవుగాక అని శపించాడని, తాను ప్రాధేయపడగా, రాముడిచే నీ భుజాలు ఖండింపబడి నిన్ను అగ్నికి ఆహుతి చేసినప్పుడు నీ సుందరరూపం లభిస్తుందని శాపవిముక్తి సూచించాడని ఆ రాక్షసుడు తన గురించి చెప్పాడు.

బ్రహ్మ దేవుడి గురించి తపస్సుచేసి దీర్ఘాయువు పొందటంవల్ల గర్వించి దేవేంద్రుడిపై యుద్ధం ప్రకటించాను. అప్పుడు అతడు నూరంచుల వజ్రాయుధాన్ని నాపై ప్రయోగించాడు. నా తొడలు, శిరస్సు శరీరంలో కలిసిపోయాయి. నన్ను చంపమని ప్రాధేయపడినా కరుణించ లేదు. రెండు యోజనాల పొడవున్న చేతుల్ని ప్రసాదించి ఆహారసముపార్జనకు ఉపకరించ గలవని అనుగ్రహించాడు. అప్పట్నుంచి ఈ రూపం వచ్చింది. 'ఇంద్రుడు కూడా రామ లక్ష్మణులు నీ చేతుల్ని ఖండించగానే నీవు స్వర్గాన్ని చేరగలవన్నాడు' అని కబంధుడు చెప్పాడు.

శ్రీరాముడు సీతను గురించి ప్రశ్నించాడు. తానేమి చెప్పలేనన్నాడు. సూర్యాస్తమయం ముందే తన్ను గోతిలో ఉంచి దగ్ధం చేసినట్లయితే పూర్వరూపం పొంది దివ్యధామం కూడా పొందగలుగుతాను. మీరు కరుణించండి అన్నాడు. రాముడు అతడు కోరినట్లే చేశాడు.

ఆ చితినుంచి మహాతేజస్విగా కబంధుడు అంతరిక్షానికి ఎగిరాడు. రాముణ్ణి ఉద్దేశించి, "ఋష్యమూకం అనే పర్వతంపై సుగ్రీవుడనే వానర రాజు ఉన్నాడు, అతడితో

భయంతో వివశురాలై బలవంతుణ్ణి నిరోధించలేని స్త్రీ పరపురుషుడు తాకడంవల్ల మలినం కావడం కల్ల. అందువల్ల ఆమె సౌశీల్యానికి వచ్చే భంగపాటు ఏమీ లేకపోయినా ఆ కల్పన అందరికీ ఆమోదయోగ్యమయింది.

## శబరి ఇచ్చిన ఎంగిలి పండ్లు

శబరి రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు చేస్తూ రాముడికి పండ్లు తానే తినిపించిందని, అలా తినిపిస్తూ ప్రతిపండును తొలుత తాను రుచిచూసి, అందులో మధురంగా ఉన్న వాటినే రాముడికి ఇచ్చిందని మరో కల్పన. శబరి అమాయక భక్తిని, రాముడిపై ఉన్న భక్తి పారవశ్యాన్ని ఈ కల్పన చక్కగా చిత్రీకరించింది. కాని ఇది కూడా వాల్మీకి రామాయణంలో లేదు. **అరణ్యకాండలో 75 సర్గలు, 2474 శ్లోకాలున్నాయి.**

## రామకథాసుధ కారకులు – మంథర, శూర్పణఖలు

వాల్మీకి మహాకవి, పురుషోత్తముడైన రాముడు, మహాసాధ్వి సీతాదేవి, భక్త శ్రేష్ఠుడు ఆంజనేయుడు – వీళ్ళందరూ ఈనాడు మనకు ఆదర్శమూర్తులైనారంటే అందుకు ప్రధాన కారకులు మంథర, శూర్పణఖలు. ఇది విపరీతమైన వ్యాఖ్యానం అని తోచవచ్చు.

మంథర, శూర్పణఖలు ఇద్దరూ శారీరక, మానసిక వక్రతలు ఉన్నవాళ్ళు. మంథర మంత్రాంగం శ్రీరామవనవాసానికి కారణమయింది. కాని శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడని, పితృవాక్య పరిపాలకుడని, మహావీరుడని లోకానికి చాటి చెప్పే అవకాశం కలిగింది. అందువల్లే సీత పాతివ్రత్యం ఆదర్శవంతమయింది. ఆ కారణంగానే, భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల భ్రాతృభక్తి ప్రకటితమయింది. మహర్షులకు అభయహస్తం లభించటానికి కారణం మంథర.

శూర్పణఖ కారణంగా పధ్నాలుగు వేలమంది రాక్షసుల సంహారం జరిగింది. దండకారణ్య ప్రాంతంలో ప్రశాంత స్థితి నెలకొంది. సీతాపహరణం జరిగింది. సుగ్రీవ, విభీషణ, ఆంజనేయాది గొప్పవ్యక్తుల పరిచయం కలిగింది. అన్నిటికీ మించి లోకకంటకుడైన రావణ సంహారం జరిగింది.

వాళ్ళిద్దరూ లేకపోతే రామాయణగాథ లేదు. వాల్మీకి మహాకవి లేదు. అందుకే మంథర, శూర్పణఖలు అభినందనీయులు.

*రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరం*
*కాకుత్థ్సం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్।*
*రాజేంద్రం సత్యసంధం దశరథతనయం శ్యామలం శాంతమూర్తిం*
*వందే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిమ్॥*

* * * * *



## విశేషాలు – విశ్లేషణ

శరభంగ మహర్షి దివంగతుడైన పిదప శ్రీరాముని సందర్శించిన మునుల వివరాలు వాల్మీకి పేర్కొన్నాడు (సర్గ–6 లో 2 నుండి 5 శ్లోకాలు) జన్మరీత్యా విలక్షణులు, సాధనరీత్యా శ్రేష్ఠులు, వివిధ పద్ధతుల్లో తీవ్ర తపస్సును ఆచరించేవాళ్ళు కన్పిస్తారు. వారి వివరాలు–

1. వైఖానసులు – బ్రహ్మయొక్క గోళ్ళనుంచి జన్మించిన వాళ్ళు
2. వాలఖిల్యులు – బ్రహ్మ రోమాలనుంచి జన్మించిన వాళ్ళు
3. సంప్రక్షాళురు – బ్రహ్మ పాదప్రక్షాళనం నుంచి జన్మించిన వాళ్ళు
4. మరీచిపులు – సూర్యచంద్రకిరణాలను ఆస్వాదించే వాళ్ళు
5. అశ్మకుట్టులు – ధాన్యాలను రాళ్ళతో నలగ్గొట్టి తినే వాళ్ళు
6. పత్రాహారులు – ఆకులు ఆహారంగా కలవాళ్ళు
7. దంతోలూఖలులు – దంతాలనే రోలుగా ఉపయోగించే వాళ్ళు
8. ఉన్మజ్జకులు – కంఠం వరకు నీళ్ళలో ఉంటూ తపస్సు చేసేవాళ్ళు
9. గాత్రశయ్యులు – చేతులనే తలగడలుగా చేసుకొని నిద్రించేవాళ్ళు
10. అశయులు – భూతలంపై శయనించేవాళ్ళు
11. అభ్రావకాశులు – ఎటువంటి ఆచ్ఛాదనలేనిచోట ఎండకు, వానకు ఓర్చి తపస్సు చేసే వాళ్ళు
12. సలిలాహారులు – నీళ్ళు మాత్రమే ఆహారంగా స్వీకరించే వాళ్ళు
13. వాయుభక్షులు – గాలి మాత్రమే ఆహారంగా స్వీకరించే వాళ్ళు
14. ఆకాశనిలయులు – చెట్లపై తపస్సు చేసేవాళ్ళు
15. స్థండిలశాయులు – భూమి మీద దర్భల్ని పరచుకొని నిద్రించేవాళ్ళు
16. వ్రతోపవాసులు – నిరంతరం ఉపవాస వ్రతదీక్షను పాటించేవాళ్ళు
17. దాంతులు – జితేంద్రియులు (ఇంద్రియాలను జయించినవాళ్ళు)
18. అర్ధ్రపటవాసులు – తడిబట్టలతో ధ్యాన సాధన చేసేవాళ్ళు
19. జపశీలురు – నిశ్చలంగా జపం చేసేవాళ్ళు
20. తపోనిత్యులు – నిత్యం తపోదీక్షలో ఉండేవాళ్ళు
21. పంచతపోన్వితులు – పంచాగ్నుల మధ్య తపస్సు చేసేవాళ్ళు (నాలుగు వైపుల అగ్నిని రగిల్చి, వేసవిలో సూర్యునికి ఎదురుగా ముఖం ఉంచి తపస్సు చేసేవాళ్ళు)

## అగస్త్యాశ్రమంలోని దేవతా మందిరాలు

అగస్త్యాశ్రమంలో సీతారామలక్ష్మణులు వెళ్ళినప్పుడు పలు దేవతా మందిరాలను వాళ్ళు చూశారు. వాల్మీకి చెప్పిన ఆ దేవతా మందిరాలు ఇప్పుడు కొన్ని ఎక్కడా కన్పించవు.

రామాయణం కాలంనాటి ఆరాధ్య దేవతలు ఎవరన్నది ఈ పట్టిక (12వ సర్గ 17-20 శ్లోకాలు) ద్వారా మనం గ్రహించవచ్చు.

బ్రహ్మదేవుడు, అగ్ని, విష్ణువు, మహేంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, భగుడు (శివుడు) కుబేరుడు, ధాత, విధాత, వాయువు, నాగేంద్రుడు, ఆదిశేషుడు, గాయత్రి, వసువులు, వరుణుడు, కార్తికేయుడు, యముడు మొదలైనవారి మందిరాలు వేర్వేరుగా నిర్మింపబడినట్లు వాల్మీకి రామాయణంలో ఉంది.

## ఋతువర్ణన

హేమంత ఋతువర్ణన 16వ సర్గలో విపులంగా ఉంది. రవి గాననిచో కవి గాంచును కదా! అనే సామెతకు చక్కటి నిదర్శనం వాల్మీకి ఋతువర్ణన. సామాన్య కర్షక జీవితం మొదలు సూర్యకిరణాల ప్రభావం వరకు హేమంత ఋతుకాలంలోని సూక్ష్మవిషయాలను సైతం విస్మరించకుండా వాల్మీకి వర్ణించాడు.

## రామరావణులు

రామాయణంలో ప్రతినాయకుడైన రావణ పాత్ర ప్రవేశం అరణ్యకాండ 31వ సర్గలో జరుగుతుంది. అకంపనుడనే గూఢచారి ఖరదూషణాది రాక్షసుల సంహారం గురించి రావణుడితో చెప్పడం ద్వారా రావణుడు కావ్యంలో ప్రత్యక్షం అయ్యాడు. కాని అతడి అనుచరుల ఆగడాలు, దౌష్ట్యం, సజ్జనుల తాపసులపట్ల వారి ప్రవర్తన కావ్యంలో అడుగడుగునా కన్పిస్తుంది.

రావణుడు సైతం తన పరాక్రమ ప్రదర్శన ద్వారా కాక రాముణ్ణి నిగ్రహించాలని సీతాపహరణానికి పూనుకోవటం అతడి నీచప్రవర్తనకు నిదర్శనం. వంచనతో పగ సాధించడం అతడి విపరీతబుద్ధికి తార్కాణం. స్త్రీపట్ల అతడికున్న కామభావన జుగుప్సాకరం. గర్హనీయం. రాముడు తన మధురభాషణంతో, వినయంతో, సజ్జన సాంగత్యంతో గ్రహించిన ధర్మ బోధలు రాముడి వ్యక్తిత్వాన్ని మరింత పదును పెట్టింది. రాముడి ప్రవర్తన మహనీయుల ఆశీస్సులకు, అస్త్ర శస్త్ర సంపాదనకు కారణమయింది. రావణుడి హేయప్రవర్తన పతనానికి దారి తీసింది.

## ధార్మిక విషయాలు

అరణ్యకాండలో మనుష్యులకు ఉపకరించే ధార్మిక విషయాలు సందర్భానుగుణంగా ప్రస్తావింపబడ్డాయి. రామాయణంలో ప్రతిపాత్ర ధర్మవిషయాలను ప్రస్తావిస్తుంది. శూర్పణఖ సైతం రావణుడితో రాజుయొక్క సల్లక్షణాలను గురించి చెబుతుంది. ఆమె చెప్పడంలో ఉద్దేశం రావణుణ్ణి రెచ్చగొట్టడమే అయినా ఆ మాటలు ప్రతిపాలకుడికీ ఆచరణీయం.



విషయసుఖాలలో మునిగి పాలనపట్ల, రక్షణ విషయంపట్ల జాగ్రత్త లేక ఇతరులపై ఆధారపడటంవల్ల రాజు తన పట్టును కోల్పోతాడు. సమర్థులైన గూఢచారుల ద్వారా దేశంలో జరిగే, జరుగబోయే పరిణామాలను తెలుసుకుంటూ ప్రవర్తించగలవాడే దూరదృష్టి కలిగిన పాలకుడవుతాడు. సకాలంలో కర్తవ్య నిర్వహణ చెయ్యని రాజు రాజ్య భ్రష్టుడవుతాడు. బంధుమిత్రుల మధ్య, మంత్రుల మధ్య చులకన అవుతాడు. అనుక్షణం ధర్మనిరతితో జాగ్రత్తవహిస్తూ, జితేంద్రియుడైన వాడే చిరకాలం ప్రభువుగా రాణించగలడు.

రావణుడు రెండవసారి మారీచుడి వద్దకు వచ్చి సీతాపహరణానికి అతడి సాయాన్ని కోరినప్పుడు మారీచుడు చేసిన హితోపదేశం మానవులందరికీ అనుసరణీయం. ఆ హితవచనాలలో ఒకటి –

*సులభాః పురుషా రాజన్ ! సతతం ప్రియవాదినః*
*అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభాః॥*

రాజా! (ఆపదలు పైబడినప్పుడు యజమాని) హితాహితాలను పట్టించుకోక ఆయన వద్ద ప్రాపకం సంపాదించడం ద్వారా తాము లబ్ధిపొందడానికి ఇచ్చకపు మాటలు పలికే వాళ్ళు సులభంగా (కోకొల్లలుగా) లభిస్తారు. తాత్కాలికంగా అప్రియం అన్పించినా మున్ముందు యజమానికి మేలు కలిగించే మాటలు పలికే వాళ్ళుండరు. పలికినా వినేవాళ్ళు అరుదుగా ఉంటారు.

## అవాల్మీకాలు

వాల్మీకి రామాయణంలో లేని కొన్ని కల్పిత గాథలు, తర్వాతి రామాయణాల్లో కన్పిస్తాయి. జానపదగీతాల్లోను మనోహరమైన కల్పనలు చోటుచేసుకున్నాయి. వాల్మీకి చెప్పినా చెప్పకపోయినా రామాయణ గాథతో పరిచయం ఉన్న వాళ్ళందరూ వాటినే విశ్వసిస్తారు. సమంజసంగా భావిస్తున్నారు.

### లక్ష్మణ రేఖ

మారీచుడు 'హా రామా! హా సీతా!' అంటూ రాముడి కంఠస్వరాన్ని అనుకరిస్తూ ప్రాణాలు విడిచాడు. సీత నిందించి లక్ష్మణుణ్ణి రాముడి రక్షణార్థం వెళ్ళమంది. లక్ష్మణుడు ఒక గీత గీచి ఎట్టి పరిస్థితుల్లోనూ గీత దాటవద్దంటాడు. భిక్షుక సన్యాసి వేషంలో వచ్చిన రావణుడికి భిక్షపెట్టటానికి ఆమె లక్ష్మణరేఖ దాటిందని, రావణుడు భూమితో పాటు పెకలించి సీతను తీసుకు వెళ్ళాడన్నది ఒక కల్పన. గీత దాటినందువల్లే సీతకు అన్ని కష్టాలు దాపురించాయన్నది ఒక ఆహ్లాదకరమైన కల్పన. రావణుడు సీతను తాకలేదని జరిగిన కల్పనలో పరమార్థం, ఆమె పాతివ్రత్యానికి కళంకం ఆపాదించినట్లవుతుందమో నన్న భావన కావచ్చు.

ఆ గుహనుండి నురుగుతో కూడిన ఎర్రని రక్తం బయటకి రావడం చూసి సుగ్రీవుడు దుఃఖించాడు. ఇంతలో రాక్షసుల గర్జన ధ్వనులు, యుద్ధరంగంలో దెబ్బతిన్న వాలి ఆక్రందన ధ్వని వినడంతో మాయావి చేతిలో వాలి హతుడయ్యాడని భావించి, కొండంత బండతో ఆ గుహ ద్వారాన్ని మూసి, శోకంతో అన్నకు తిలతర్పణాలు విడిచి కిష్కింధకు చేరాడు. మంత్రులు పలువిధాలుగా ప్రశ్నించిన తర్వాత జరిగిన వృత్తాంతాన్ని వివరించాడు.

మంత్రులందరూ కలిసి రాజులేని రాజ్యం అల్లకల్లోలమవుతుందని, సుగ్రీవుడు వారించినా, బలవంతంగా అతణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశారు. ఇంతలో వాలి మాయావిని చంపి కిష్కింధకు వచ్చి పట్టాభిషిక్తుడైన సుగ్రీవుణ్ణి చూసి మండిపడ్డాడు. సుగ్రీవుడి మంత్రుల్ని చెరలో ఉంచాడు. సుగ్రీవుడు ఎంత ప్రాధేయపడినా, తాను నిర్దోషినని చెప్పినా వినక కుట్రతోనే సుగ్రీవుడు ఈ పనులన్నీ చేశాడని మంత్రుల, పౌరుల సమక్షంలో నిందించి కట్టుబట్టలతో బయటికి గెంటివేశాడు. అతడి భార్యను అపహరించాడు. తుదకు సుగ్రీవుడు ఋష్యమూక పర్వతాన్ని ఆశ్రయించాడు.

### వాలి పరాక్రమం – వరం – శాపం

వాలి మిక్కిలి బలపరాక్రమాలు, ధైర్యస్థైర్యాలున్నవాడు. బ్రహ్మీముహూర్తంలోనే లేచి భూమండలంలోని నాలుగు దిక్కుల్లో ఉన్న సముద్రాలలో సంధ్యావందనాలు చేసి, సూర్యోదయానికి పూర్వమే తిరిగి రాగలడు. పర్వతాల పైభాగాలకు చేరి వాటి శిఖరాలను బంతుల్లా పైకి ఎగురవేసి పట్టుకోగలడు. క్షణంలో మహావృక్షాల్ని కూల్చగలడు.

ఒకప్పుడు మహిషాకారంలో ఉన్న దుందుభి (మాయావి తమ్ముడు) అనే పర్వత సమానుడైన రాక్షసుడు, బలగర్వంతో సముద్రుణ్ణి యుద్ధానికి ఆహ్వానించాడు. సముద్రుడు తాను అసమర్థుడినని, హిమవంతుడు నీకు దీటైనవాడని చెప్పగానే అతడు హిమవంతుడి దగ్గరికి వెళ్ళాడు. అతడు తనకు యుద్ధం చెయ్యడంలో నైపుణ్యం లేదని, అతడితో యుద్ధం చెయ్యగలవాడు వాలి అనే వానర ప్రముఖుడని, అతడి వద్దకు వెళ్ళమన్నాడు. దుందుభి వాలిని ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు.

వాలి తన తండ్రి అయిన దేవేంద్రుడు ఇచ్చిన బంగారుహారాన్ని మెడలో వేసుకొని (ఇంద్రుడు వాలికి ఆ మాలను ఇచ్చి, ఆ హారం ధరించి ఎవరితో యుద్ధం చేసినా, అతడి బలమంతా వాలిని చేరుతుంది అని వరం ఇచ్చాడు). ద్వంద్వయుద్ధంలో దుందుభిని వాలి అతి భీకరంగా చంపాడు. అతడి కళేబరాన్ని వాలి తన చేతులతో పైకెత్తి ఒక్క ఊపుతో యోజన దూరంలో పడవేశాడు. ఆ రాక్షసుడి నోటిలోంచి స్రవించిన రక్తబిందువులు గాలివాటంతో మతంగముని ఆశ్రమంపై పడింది.

మతంగముని తన తపశ్శక్తితో ఈ చర్యకు కారణం వాలి అని గ్రహించి, వాలి ఋష్యమూకంలోకి ప్రవేశించరాదని, అలా ప్రవేశిస్తే మరణం తప్పదని శపించాడు.



# కిష్కింధా కాండం

*శ్రీరామరామ రఘునందన రామరామ*
*శ్రీరామరామ భరతాగ్రజ రామరామ*
*శ్రీరామరామ రణకర్కశ రామరామ*
*శ్రీరామరామ శరణం భవ రామరామ.*

## రామ సుగ్రీవుల మైత్రి

### సుగ్రీవుని భీతి

పంపాసరోవరంలోని తామరపూలు సీతముఖాన్ని, కలువలు ఆమె నేత్రాలను, చేపలు ఆమె చూపుల కదలికల్ని గుర్తుచేస్తుండగా రాముడు కలత చెందాడు. లక్ష్మణుడితో తన మనసులోని ఆవేదనను వెలిబుచ్చాడు.

“సీత అపహరణకు గురయింది. భరతుడు అయోధ్యను విడిచి ఉపవాసాది వ్రతాలతో నందిగ్రామంలో మిక్కిలి దుఃఖానికిలోనై ఉన్నాడు. ఈ బాధలతోబాటు వసంతుడు (వసంత ఋతువు) నన్ను పీడిస్తున్నాడు. మనస్సు వ్యాకులంగా ఉన్నప్పుడు ఏదీ రంజింపజెయ్యలేదు. ఎందులోనూ ఆసక్తి ఉండదు. కాని ఈ పంపాసరస్సు మాత్రం నన్ను ఆకర్షిస్తూ ఉంది.”

రాముడినోట వాల్మీకి అద్భుతంగా వసంత ఋతువర్ణన గావించాడు. ఋశ్యమూక పర్వత సమీపంలో మసలుతున్న సుగ్రీవుడు అద్భుతరూప లావణ్యాలు కలిగిన రామ లక్ష్మణుల్ని చూసి ఆశ్చర్యపోయాడు. చాలాసేపు ఆ చోటే తిరుగాడుతున్న రామలక్ష్మణుల్ని గమనించి భయంతో కంపించిపోతూ, చింతాక్రాంతుడయ్యాడు.

రామలక్ష్మణుల్ని చూసి భయపడిన సుగ్రీవుడు, వాళ్ళు వాలి పంపగా వచ్చిన గూఢచారులని భావించాడు. హనుమంతుడు వానరులందరినీ ఉద్దేశించి వాలివల్ల ఎటువంటి ఆపదా ఉండదని, అతడు ఈ పర్వతం పైకి రాలేడని ధైర్యం కలిగించాడు. సుగ్రీవుడు రామలక్ష్మణుల వృత్తాంతాన్ని తెలుసుకొమ్మని హనుమంతుణ్ని ఆదేశించాడు.

### రామాంజనేయుల తొలిపరిచయం

ఆంజనేయుడు ఒక్కగంతులో ఋష్యమూకపర్వతం నుంచి రామలక్ష్మణులున్న ప్రాంతానికి చేరుకున్నాడు. వాయుపుత్రుడైన మారుతి వినయంగా వాళ్ళని సమీపించాడు. వాళ్ళ మనసుల్ని రంజింపజేసే విధంగా, మధురంగా మాట్లాడాడు. భక్తి ప్రపత్తుల్ని

ప్రదర్శించాడు. సుదీర్ఘంగా రామలక్ష్మణుల రూపురేఖల్ని వర్ణించి సుగ్రీవుణ్ణి గురించి ప్రస్తావించాడు.

"సుగ్రీవుడు ధర్మాత్ముడు, మహావీరుడు. అతడి సోదరుడైన వాలి చేత వంచింప బడ్డాడు. నేను హనుమంతుడనే పేరుగల వానరుణ్ణి. సుగ్రీవుని మంత్రిని. ఆయన మీతో స్నేహాన్ని కోరుతున్నాడు."

శ్రీరాముడు హనుమంతుని సంభాషణా చాతుర్యాన్ని మెచ్చుకున్నాడు. 'మూడు వేదాలలో సుశిక్షితుడైన వాడు మాత్రమే ఇంత చక్కగా మాట్లాడగలడు. పలు విషయాల్ని గురించి మాట్లాడినా ఆ మాటల్లో ఎక్కడా అపశబ్దం లేదు. సమస్త వ్యాకరణాలను కూలంకషంగా నేర్చిన వాడనటంలో సందేహం లేదు. మాట్లాడే సమయంలో అతడి అవయవాల్లో ఎక్కడా ఎటువంటి వికారమూ కన్పించలేదు.'

లక్ష్మణుడు తమ గురించి హనుమంతుడికి తెలియజేశాడు. సీతాపహరణం గురించి ప్రస్తావించి శోకతప్తుడయ్యాడు. హనుమంతుడు 'మా ప్రభువైన సుగ్రీవుడు తన అన్నతో ఏర్పడిన శత్రుత్వం కారణంగా రాజ్యభ్రష్టుడయ్యాడు. అతడి భార్య అయిన రుమను వాలి తన వశంలో ఉంచుకున్నాడు. సూర్యపుత్రుడైన సుగ్రీవుడు మాతో కలిసి సీతాదేవిని అన్వేషించడంలో తోడ్పడగలడు. సుగ్రీవుని వద్దకు వెళ్దా'మని చెప్పాడు. వానర రూపం ధరించిన హనుమంతుడు వాళ్ళిద్దరినీ తన భుజాలపైకి ఎక్కించుకొని ముందుకు నడిచాడు.

## అగ్నిసాక్షిగా మైత్రి

సుగ్రీవుని వద్దకు వెళ్ళిన హనుమంతుడు రామలక్ష్మణుల వృత్తాంతాన్ని తెలియ జేశాడు. సుగ్రీవుడు పరమానందంతో రాముడితో చెలిమి మహద్భాగ్యంగా పేర్కొన్నాడు. మనస్ఫూర్తిగా మైత్రిని కోరినట్లయితే తన చేతిలో రాముడిచేతిని కలపమని సుగ్రీవుడు కోరాడు. రాముడు సంతోషంగా చేతిని కలిపాడు. ఇంతలో హనుమంతుడు చేవగల రెండు జమ్మి కర్రల్ని మథించి అగ్నిని సిద్ధం చేశాడు. ప్రజ్వరిల్లే అగ్నిని పూలతో అర్చించి వాళ్ళిదరి మధ్య ఉంచాడు. రామ సుగ్రీవులు పరస్పరం చేతులు పట్టుకొని, అగ్నికి ప్రదక్షిణలు చేసి, అగ్నిసాక్షిగా మిత్రులయ్యారు.

శ్రీరామ సుగ్రీవుల మైత్రీ సంభాషణలు కొనసాగుతుండగా పద్మాలవంటి సీతాదేవి ఎడమకన్ను, బంగారు వన్నెగల వాలి ఎడమకన్ను, అగ్నిజ్వాలల్లాంటి రావణుడి ఎడమకన్ను ఒక్కసారిగా అదిరాయి. (ఎడమకన్ను అదరడం స్త్రీలకు శుభమని, పురుషులకు అశుభమని నమ్మకం.)



## సీతాదేవి నగలు

సీతాదేవి గురించి రాముడు ప్రస్తావిస్తున్నప్పుడు సుగ్రీవుడు 'ఓ మహాబాహూ! ఒకనాడు క్రూరుడైన రాక్షసుడు ఒకడు ఒక స్త్రీని తీసుకొని వెళ్తుండగా నేను చూశాను. ఆమె రామా! రామా! లక్ష్మణా! లక్ష్మణా! అంటూ బిగ్గరగా ఏడుస్తూ రాక్షసుడి అంకస్థలంలో విలవిలలాడుతూ కన్పించింది. నేను నలుగుగు మంత్రులతో కలిసి ఈ పర్వతంపై ఉన్నాను. ఆమె మమ్మల్ని చూసి ఉత్తరీయంలో నగల్ని కట్టి ఇక్కడ పడవేసింది. వీటిని జాగ్రత్తగా ఉంచాను. నీవు వాటిని గుర్తించగలవు' అని చెప్పి, నగల మూటని తీసుకు వచ్చాడు.

రాముడు కన్నీటిధారతో లక్ష్మణుణ్ణి చూసి 'ఇవి సీత ఉత్తరీయం, ఆభరణాలే. పచ్చిక బయలుపై పడటంవల్ల నగలు చెక్కు చెదరలేదు. వీటిని పరిశీలించ'మని చెప్పాడు. లక్ష్మణుడు తానెప్పుడూ సీతాదేవి పాదాలవైపే చూసేవాణ్ణి కనుక ఆమె కాలి అందెల్ని మాత్రమే గుర్తుపట్టగలనన్నాడు.

రాముడి దుఃఖాన్ని ఉపశమింపజేస్తూ సుగ్రీవుడు సీతజాడను తెలుసుకునేందుకు తనతోబాటు, తనపరివారం అంతా శక్తివంచన లేకుండా కృషి చేస్తుందని ప్రమాణం చేశాడు.

## వాలి సుగ్రీవుల వైర కారణం

రాముడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా సుగ్రీవుడు తమ అన్నదమ్ముల మధ్య శత్రుత్వానికి కారణం చెప్పసాగాడు.

వాలి సుగ్రీవులు ఋక్షరజుడనే వానరరాజు కుమారులు. ఋక్షరజునికి అరుణికి జన్మించినవారు. దేవేంద్రాంశతో వాలి, సూర్యాంశతో సుగ్రీవుడు జన్మించారు. తండ్రి మరణానంతరం పెద్ద కుమారుడైన వాలి కిష్కింధకు రాజయ్యాడు. వాలి సుగ్రీవులు పరస్పరం ప్రేమాభిమానాలతో మెలిగే వాళ్ళు.

మయుని కుమారుల్లో మాయావి పెద్దవాడు. అతడి తమ్ముడు దుందుభి. ఒక స్త్రీ కారణంగా వాలితో అతడికి వైరం ఏర్పడింది. ఒకసారి అర్ధరాత్రివేళ కిష్కింధానగర ద్వారంలో నిలిచి ఆ మాయావి భీకరంగా అరుస్తూ వాలిని యుద్ధానికి పిలిచాడు. అందరూ ఎంత వారిస్తున్నా వినక వాలి అతణ్ణి పరిమార్చటానికి కోపంతో వెలుపలికి వచ్చాడు. సుగ్రీవుడూ వాలితోబాటు వచ్చాడు. ఆ ఇద్దరినీ చూసిన మాయావి పారిపోసాగాడు. ఇద్దరూ వెంటపడ్డారు. అతడు గడ్డిచేత కప్పబడిన దుర్గమమైన భూగృహం (బిలం) లోకి చొరబడ్డాడు. వాలి సుగ్రీవుణ్ణి గుహ బయటే తాను వచ్చేవరకు కాపలాగా ఉండమని చెప్పి బిలంలోకి ప్రవేశించాడు. ఒక్క సంవత్సరం గడిచింది. అంతకాలం వెలుపలికి రానందువల్ల సుగ్రీవుడి మనస్సు కీడును శంకించింది.

ఇద్దరు వానర ప్రముఖుల్ని వెంటబెట్టుకొని సుగ్రీవుని వద్దకు వెళ్ళాడు. లక్ష్మణుని రాకను తెలియజేశాడు. లక్ష్మణుణ్ణి ప్రసన్నుడిగా చేసుకొమ్మన్నాడు. సుగ్రీవుడు భయాందోళనలకు గురయ్యాడు. హనుమంతుడు రఘురాముడికి ప్రత్యుపకారం చెయ్యమని హితం పలికాడు.

## తార సమయోచిత ప్రజ్ఞ – సుగ్రీవాజ్ఞ

లక్ష్మణుడు కిష్కింధానగర వైభవాన్ని, అంగదుడు మొదలైనవారి భవనాలను చూస్తూ సుగ్రీవుని ప్రాసాదం చేరాడు. లక్ష్మణుణ్ణి చూడటానికి భయపడి, సుగ్రీవుడు అతణ్ణి శాంత పరచటానికి తారను పంపాడు. తార యుక్తియుక్తంగా మాట్లాడి సౌమిత్రిని శాంతపరచి, అంతఃపురంలోకి ఆహ్వానించింది. సుగ్రీవుడి నిర్లక్ష్యాన్ని లక్ష్మణుడు నిందించాడు.

చాలాకాలం దుఃఖితుడైన కారణంగా సుగ్రీవుడు కామానుభవాలతో మునిగి పోయాడని తార సమర్థిస్తూ, సీతాన్వేషణకు తగిన ఏర్పాట్లు చేశాడని, అతడు కృతఘ్నుడు కాడని వివరించింది. శాంతించమని వినయంగా కోరింది. తార మాటతీరుకు, సహేతుక మైన సమర్థింపుకు లక్ష్మణుడు శాంతించాడు. వివిధ ప్రాంతాలలో ఉన్న కపివరుల్ని తీసుకు రావడానికి వానర ప్రముఖుల్ని పంపమని హనుమంతుణ్ణి సుగ్రీవుడు ఆదేశించాడు. అలా వెళ్ళిన వాళ్ళు కోట్లాదిమంది వానరుల్ని తీసుకువచ్చారు.

సుగ్రీవుడు లక్ష్మణుడితోబాటు ప్రస్రవణగిరికి వెళ్ళి శ్రీరాముణ్ణి దర్శించాడు. శ్రీరాముడు సీతాన్వేషణకై పూనుకొమ్మని సుగ్రీవుణ్ణి కోరాడు. అందుకు సమాధానంగా సుగ్రీవుడు ఆ కార్యం కోసమే వానర వీరులు ఇక్కడికి వస్తున్నట్లు చెప్పాడు. శ్రీరాముడు కృతజ్ఞతలు తెలియజేశాడు.

శతవలి, కేసరి, పనసుడు, గవయుడు, దరీముఖుడు, అశ్వినీ దేవతల కుమారుడైన మైందుడు, ద్వివిదుడు, గజుడు – ఇలా ప్రముఖులైన వానరులు తమ తమ సైన్యాలతో వచ్చారు. ధూమ్రుడు, జాంబవంతుడు – అనే భల్లూక ప్రభువులు భల్లూక యోధులతో వచ్చారు.

సీతాదేవి జాడను తెలుసుకోవటం, రావణుడి నివాసాన్ని పసిగట్టడం – అనేవి ముఖ్య కర్తవ్యాలని శ్రీరాముడు సుగ్రీవుడితో అన్నాడు. సుగ్రీవుడు వానరవీరుల్ని విభజించి నాలుగు దిక్కులకు సీతాన్వేషణకై పంపించాడు.

తూర్పు దిక్కున అన్వేషించటానికి 'వినతు' డనే వానరశ్రేష్ఠుని నాయకత్వంలో వానరుల్ని పంపుతూ, ఆ దిశలోని విశేషాలను, ప్రాంతాలను సుగ్రీవుడు వివరించాడు.

అంగదుని నాయకత్వంలో అగ్నిసుతుడైన నీలుడు, వాయుపుత్రుడైన హనుమంతుడు, బ్రహ్మాంశ సంభవుడైన జాంబవంతుడు, సుహోత్రుడు, శరారుడు, గజ, గవాక్ష, గవయ,



అందువల్ల సుగ్రీవుడు ఆ పర్వతం సురక్షితమని ఆశ్రయించాడు. సుగ్రీవుడు పర్వత శిఖరం లోని దుందుభి అస్థిపంజరాన్ని రాముడికి చూపించాడు. అక్కడున్న ఏడు మద్ది చెట్టుల్ని చూపి వాలి ఒక్క దెబ్బతో బలంగా ఊపి ఆ చెట్లలోని ఆకులన్నిటినీ రాల్చగలడని సుగ్రీవుడు చెప్పాడు. అటువంటి బలవంతుణ్ణి రాముడెలా చంపగలడని ప్రశ్నించాడు.

## రామబాణం – పరాక్రమం

లక్ష్మణుడు 'రాముడు వాలిని చంపగలడనే నమ్మకం కలిగించడానికి ఏం చెయ్యా'లని సుగ్రీవుణ్ణి అడిగాడు. సుగ్రీవుడు మద్ది చెట్లల్లో ఒక దాన్ని ఒకే బాణంతో ఛేదిస్తే వాలిని ఇతడు చంపగలడు లేదా దుందుభి అస్థిపంజరాన్ని ఒక పాదంతో లేవనెత్తి రెండు వందల ధనుస్సుల దూరంలో (సుమారు నాలుగు వందల గజాలు) పడేటట్లు వెయ్యగలిగితే నమ్ముతాను' అన్నాడు.

రాముడు కాలి బ్రొటన వ్రేలితో దుందుభి అస్థిపంజరాన్ని పదియోజనాల దూరం మేరకు పడవేశాడు. సుగ్రీవుడు అది చూసి 'వాలి యుద్ధంచేసి అలసిపోయినప్పుడు రక్తమాంసాలతో ఉన్న దుందుభి శరీరాన్ని అవలీలగా యోజన దూరం పడవేశాడు. ఇప్పుడు దుందుభి శరీరం ఎండిపోయి తేలికగా ఉంది. కనుక మీ ఇద్దరిలో (వాలి,రాముడు) బలవంతులెవరో నిర్ణయించలేను. మద్ది చెట్టును బాణంతో ఛేదించి నా నమ్మకాన్ని నిజం చెయ్యవలసింది' అన్నాడు.

రాముడు తన కోదండాన్ని గ్రహించి వాడియైన ఒక బంగారు బాణాన్ని ఒక మద్దిచెట్టుకు గురిచూసి ప్రయోగించాడు. ఆ బాణం ఏడు మద్దిచెట్లను చీలుస్తూ కొండ చరియ ద్వారా పాతాళంలో ప్రవేశించి, మహావేగంతో అధోలోకాలకు వెళ్ళి, క్షణకాలంలో తిరిగివచ్చి రాముని తూణీరంలోకి చేరింది. ఈ మహాద్భుతాన్ని చూసి, సుగ్రీవుడు రాముని పాదాలపై సాగిలబడి మ్రొక్కాడు.

## వాలివధ

ద్వంద్వయుద్ధానికి వాలిని ఆహ్వానించమని సుగ్రీవుడుతో రాముడు చెప్పాడు. సుగ్రీవుడు చెప్పినట్లే చేశాడు.వాలి కోపావేశంతో వచ్చాడు. ఇద్దరి మధ్య భీకరమైన ద్వంద్వ యుద్ధం జరిగింగి. వాళ్ళిద్దరూ ఒకే పోలికలతో ఉండటంవల్ల శ్రీరాముడు వాలి సుగ్రీవుల్ని విడివిడిగా గుర్తించలేక పోయాడు. అందువల్ల ప్రాణాంతకమైన తన బాణాన్ని ప్రయోగించ లేదు. సుగ్రీవుడు వాలి దెబ్బలు భరించలేక ఋష్యమూక పర్వతం వైపు పరుగులు పెట్టాడు.

సుగ్రీవుడు తన పరాభవాన్ని రాముడికి నివేదించి బాధపడ్డాడు. శత్రువు చేతిలో చావు దెబ్బతిన్నందుకు రాముణ్ణి నిలదీశాడు. రాముడు కారణం చెప్పి మరోసారి వాలిని ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించమన్నాడు. ఈ పర్యాయం తప్పక వాలిని వధిస్తానన్నాడు.

లక్ష్మణుడివైపు తిరిగి వికసించిన నాగ కేసరపు లతను పెకలించి మాలగా సుగ్రీవుడి మెడలో వెయ్యమన్నాడు. లక్ష్మణుడు అలాగే చేశాడు. దీని ద్వారా తాను వాలి సుగ్రీవుల్ని గుర్తించగలనని రాముడన్నాడు.

సుగ్రీవుడు మళ్ళీ వాలిని యుద్ధానికి ఆహ్వానించినప్పుడు వాలి భార్య తార అతణ్ణి వారిస్తుంది. గూఢచారులు అంగదునితో చెప్పిన మాటల్ని తెలియజేసింది. రామలక్ష్మణుల గురించి గూఢచారులు చెప్పిన వృత్తాంతాన్ని వివరించింది. 'సుగ్రీవుడు నీకు సోదరుడే కదా! అతణ్ణి చేరదీసి యువరాజుగా అభిషిక్తుణ్ణి చెయ్యి. నీకు సేవకుడిలా ఊడిగం చేస్తాడు' అని హితం పలికింది. కాని వాలి ఆ మాటలన్నిటిని పెడచెవిని పెట్టి యుద్ధానికి వెళ్ళాడు. వాలి సుగ్రీవుల ద్వంద్వయుద్ధం జరుగుతుండగా శ్రీరాముడు తన తీవ్రమైన బాణంతో కొట్టగా వాలి కుప్పగూలాడు.

కుప్పగూలిన వాలి వద్దకు రాముడు వచ్చాడు. "నీవు ధర్మపరుడివనీ, సత్యవ్రతుడివని భావించాను. నీ కెన్నడూ నేను అపకారం తలపెట్టలేదు. దొంగచాటుగా నన్నెందుకు దెబ్బ తీశావు?" అని ప్రశ్నించి అనేక ధర్మార్థసహితాలైన వాక్యాలను వాలి వల్లించాడు.

అందుకు రాముడు "భరతుడి ధర్మపాలనలో ఉన్న భూమి ఇది. అతడి ఆజ్ఞానుసారం ధర్మాన్ని కాపాడవలసిన బాధ్యత నాకుంది. అన్న, తండ్రి, గురువు, ఈ ముగ్గురూ ధర్మమార్గంలో ప్రవర్తించే వాళ్ళకి గురువులు. అలాగే తమ్ముడు, విద్యలు నేర్చిన గుణవంతుడైన శిష్యుడు, తనకు పుట్టినవాడు ఈ ముగ్గురినీ పుత్రులుగా భావించాలి. కూతురు, సోదరి, తమ్ముడి భార్య – వీళ్ళవద్ద కామాతురుడై ప్రవర్తించిన వాణ్ణి వధించడమే తగిన శిక్ష అని ధర్మశాస్త్రం చెబుతున్నది. నువ్వు అన్ని ధర్మాలనూ అతిక్రమించావు. చాపల్యాన్ని ప్రదర్శించావు. సుగ్రీవుడితో మైత్రిని ఏర్పరచుకున్న సందర్భంలో వానరుల సమక్షంలో అతడికి అతడి భార్యను, రాజ్యాన్ని లభించేటట్లు చేస్తానని మాట ఇచ్చాను. ఈ అన్ని కారణాలవల్ల నీకు విధించిన శిక్ష ధర్మబద్ధమే" అని సమాధానం ఇచ్చాడు. వాలి కూడా తాను చేసిన తప్పిదానికి పశ్చాత్తాపం చెంది, తన కుమారుడైన అంగదుణ్ణి అనుగ్రహించాలని కోరాడు.

తార, అంగదులు తీవ్ర దుఃఖానికై లోనై కన్నీళ్ళు కార్చారు. హనుమంతుడు తారను ఓదార్చాడు. సుగ్రీవుడు కూడా అన్న చావుకు తాను కారణమైనందుకు బాధపడి, పశ్చాత్తాపం చెందాడు. విలపించాడు. కొన ఊపిరితో ఉన్న వాలి సుగ్రీవుడికి, అంగదుడికి హితోక్తులు పలికాడు. సుషేణుడి కూతురైన తార గురించి ఆమె సూక్ష్మబుద్ధి గురించి, కీర్తించి, ఆమె ఇచ్చిన ఏ సలహానైనా సందేహం లేకుండా పాటించవచ్చని సుగ్రీవుడికి చెప్పాడు.



## సుగ్రీవుని నిర్లక్ష్యం – లక్ష్మణుని ఆగ్రహం

వాలికి దహనసంస్కారాదుల్ని సుగ్రీవుడు, అంగదుడు చేశారు. కిష్కింధకు వచ్చి సుగ్రీవ పట్టాభిషేకం నిర్వహించమని హనుమంతుడు రాముణ్ణి ప్రార్థించాడు. పధ్నాలుగు సంవత్సరాలు వనవాస సమయంలో తాను గ్రామంలోకాని, నగరంలోకాని, నివసించ రాదన్నది తండ్రి ఆజ్ఞ. కనుక తాను రాలేనన్నాడు రాముడు. సుగ్రీవుడు సత్ప్రవర్తనగల వ్యవహార దక్షుడని, అంగదుడు అతడికి అన్న కుమారుడే కాక పరాక్రమంలో తండ్రితో సమానుడని, కనుక వాళ్ళిద్దరూ రాజుగా, యువరాజుగా అభిషిక్తులు కావడం సమంజస మని రాముడు పేర్కొన్నాడు.

"వర్షాకాలం ఈ శ్రావణ మాసంతో మొదలై నాలుగు నెలలపాటు ఉంటుంది. ఈ కాలం సీతాన్వేషణకు యోగ్యం కాదు. సుగ్రీవా! నీవు సుఖంగా కిష్కింధకు వెళ్ళు. నేను లక్ష్మణుడితోబాటు ఈ ప్రస్రవణగిరిలోనే నివసిస్తాను" అని రాముడు సుగ్రీవుణ్ణి సాగనంపాడు.

రామలక్ష్మణులు ప్రస్రవణగిరి శిఖరం మీద మిక్కిలి విశాలమైన పెద్దగుహను తమకు నివాసంగా ఏర్పరచుకున్నారు. శరత్కాలంలో సీతాన్వేషణకై ప్రయత్నం మొదలు పెట్టాలని ఈ వరకే నిర్ణయమయింది. శ్రీరాముడి నోటిద్వారా ప్రస్రవణగిరి అంద చందాలను, వర్షఋతు సోయగాన్ని వాల్మీకి పలికించాడు.

వర్షాకాలం ముగిసింది. ఆకాశం నిర్మలంగా ఉంది. పిండి ఆరబోసినట్లు వెన్నెల వ్యాపించి ఉండటంతో మనోహరంగా కన్పిస్తూంది. హనుమంతుడు వర్షాకాలం ముగిసి శరదృతువు ప్రారంభమయిందని గ్రహించాడు. వెంటనే సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు. సుగ్రీవుడు సుఖభోగాలతో మునిగి తేలుతూ భోగలాలసుడై ఉన్నాడు. హనుమంతుడు అతనికి కర్తవ్యాన్ని గుర్తుచేశాడు. సుగ్రీవుడు నీలుడనే సేనాపతిని పిలిచి అన్ని దిక్కులనుంచి సమస్త సైన్యాలను సమీకరించమని ఆదేశించాడు.

శరత్కాలంలోని ప్రకృతి శోభను చూసి శ్రీరాముడు విరహవేదనకు లోనయ్యాడు. శరత్కాలం వచ్చినా సుగ్రీవుడు సీతాన్వేషణకు పూనుకోలేదని శ్రీరాముడు అతనిపై ఆగ్రహం వెలిబుచ్చాడు. తమ్ముడితో కిష్కింధకు వెళ్ళి సుగ్రీవుడికి కర్తవ్యాన్ని గుర్తుచెయ్యమన్నాడు. లక్ష్మణుడు ఆగ్రహంతో సుగ్రీవుణ్ణి వధించి అంగదుడి సాయంతో సీతాన్వేషణ మొదలు పెడతానన్నాడు. రాముడు అతణ్ణి శాంతపరచి సౌమ్యంగా ప్రవర్తించమని బోధించాడు. లక్ష్మణుడు అన్న ఆదేశానుసారం కిష్కింధకు బయలుదేరాడు.

లక్ష్మణుడు కోపంతో రావడం చూసి వానవీరులు భయకంపితులయ్యారు. అంగదుడు విషాదానికి లోనయ్యాడు. అంగదుడు తనతోబాటు ప్లక్షుడు, ప్రభావుడనే

సంపాతి తనను సముద్రతీరానికి తీసుకెళ్ళమని చెప్పి, అక్కడ తమ్ముడికి జల తర్పణాలు వదలిన తర్వాత మళ్ళీ యథాస్థానానికి చేర్చమన్నాడు. జాంబవంతుడు 'సీతాదేవిని రావణుడు తీసుకుపోవడాన్ని చూసిన వాళ్ళెవరు? అని ప్రశ్నించాడు.

"నా కుమారుడు సుపార్శ్వుడు చూశాడు. వాళ్ళిద్దరినీ ఆహారంగా స్వీకరించాలను కున్నాడు. ఎదురుగా వచ్చిన అతణ్ణి రావణుడు వినయంగా దారి ఇమ్మని కోరాడు. వినయంగా, మృదువుగా సమీపించిన వాణ్ణి హింసించడం మంచిదికాదని సుపార్శ్వుడు అడ్డుతొలిగాడు. రావణుడు వేగంగా వెళ్ళిపోయాడు. ఆకాశంలో సంచరించే సిద్ధులు, చారణులు సుపార్శ్వుని సమీపించి అతడు రావణుడని, సీతాదేవిని అపహరించి తీసుకువెళ్తున్నాడని తెలిపి, అదృష్టవంతుడివి కనుక నీవు బ్రతికావని, సీతను తీసుకువెళ్ళడంలో నిమగ్నమైన అతడు నిన్ను పట్టించుకోలేదని చెప్పారట".

పై విషయాలను చెప్పిన సంపాతి సముద్ర లంఘనం చేసి సీతజాడ తెలుసుకోవడం కర్తవ్యమని తెలిపాడు. మళ్ళీ తన ఆత్మకథను సంపాతి వానరులకు విన్పించాడు.

"దండకారణ్యంలో నేను పడిపోయిన ప్రాంతంలో 'నిశాకరుడు' అనే ముని ఆశ్రమం ఉండేది. ఆయన 8000 సంవత్సరాలకు పూర్వం స్వర్గస్థుడయ్యాడు. నిశాకర మహర్షితో నా కథను వివరించాను. ఆ ముని క్షణకాలం ధ్యానమగ్నుడై 'సంపాతీ! బాధపడకు. ఇక్ష్వాకువంశంలో జన్మించబోయే శ్రీరాముడు సీతాలక్ష్మణులో ఈ అరణ్యానికి వస్తాడు. రావణుడు సీతను అపహరిస్తాడు. శ్రీరామదూతలైన వానరులు సీతాదేవిని వెతుకుతూ వస్తారు. అప్పుడు నీవు ఆమె వివరాలు చెప్పవలసి ఉంటుంది. ఈ స్థితిలో నీవు ఎక్కడికీ వెళ్ళలేవు. నీ వల్ల లోకానికి గొప్ప మేలు జరుగుతుంది. అప్పుడు నీ రెక్కలు యథాప్రకారం వస్తాయి. రామలక్ష్మణులు వచ్చే వరకు నేను శరీరంతో ఉండను' అని చెప్పాడు. సంపాతి ఈ వృత్తాంతాన్ని చెబుతుండగానే ఆ గద్దల రాజుకు మునుపటిలా రెక్కలొచ్చాయి.

'నిశాకర మహర్షి ప్రభావంతో నాకు రెక్కలు వచ్చాయి. మీకు తప్పకుండా సీతాదేవి జాడ తెలుస్తుంది. ప్రయత్నించండి' అని సంపాతి వానరులతో పల్కి తన రెక్కలు బలిమిని పరీక్షించడానికి ఆకాశానికి ఎగిరాడు.

## హనుమంతుని గుప్త శక్తి

సంపాతి మాటలతో వానరుల్లో ఉత్సాహం పెల్లుబికింది. అభిజిత్ ముహూర్తం కోసం నిరీక్షించారు. అపారమైన సముద్రాన్ని దాటడం ఎలా? అని వివరించారు. వానర వీరులు సముద్రాన్ని లంఘించడంలో తమ తమ శక్తిసామర్థ్యాలను పేర్కొన్నారు. గజుడు పదియోజనాలు, గవాక్షుడు ఇరవై యోజనాలు, గంధమాదనుడు యాభైయోజనాలు, సుషేణుడు ఎనభై యోజనాల దూరం వరకు లంఘించగలమని చెప్పారు.



సుషేణ (తార తండ్రి కాక మరొక వానర ప్రముఖుడు) వృషభుల్ని, మైంద, ద్వివిద, విజయ, గంధమాదనుల్ని, అగ్నిపుత్రులైన ఉల్కాముఖ, అసంగుల్ని దక్షిణదిశకు పంపించాడు.

మరీచి మహర్షి కుమారుడు మారీచుడు, మరీచి మహర్షి అంశలతో పుట్టిన వాళ్ళు మరికొందరిని రెండు లక్షల మంది వానరవీరులతో పడమటి దిక్కులో అన్వేషించడానికి పంపించాడు. 'శతవలి' నాయకత్వంలో వైవస్వతుని అంశలతో జన్మించిన సహచర మంత్రులతో, సైన్యంతో ఉత్తర దిశవైపు అన్వేషణ సాగించమని ఆజ్ఞాపించాడు.

అన్ని దిక్కులకూ వానరుల్ని పంపినా, సీతాన్వేషణ కార్యసాధకుడు హనుమంతుడు కాగలడనే విశ్వాసంతో సుగ్రీవుడు అతణ్ణి ప్రశంసించాడు. శ్రీరాముడు కూడా ఆంజనేయుని శక్తిసామర్థ్యాలను మెచ్చుకుంటూ హనుమంతుడిపై సీతాదేవికి నమ్మకం కల్గించటానికి తన ఉంగరాన్ని అతడికిచ్చాడు.

సుగ్రీవుడు భూమిలోని సమస్త దిక్కులలోని అన్ని విశేషాలను చెప్పడం చూసి, ఇన్ని విషయాలు నీకెలా తెలుసని రాముడు అడిగాడు. దేశ బహిష్కరణ అయిన తాను అన్ని దిక్కుల్లోను తిరిగి, తిరిగి తుదకు ఋష్యమూక పర్వతాన్ని చేరుకున్న తీరును వివరించాడు సుగ్రీవుడు. సుగ్రీవుడు వానరులందరికీ ఒక్క నెల గడువిచ్చాడు. దక్షిణ దిశవైపు వెళ్ళిన వాళ్ళు తప్ప తక్కిన వానరులందరూ నిరాశతో వెనుదిరిగారు.

## వానరుల నైరాశ్యం – చిగురించిన ఆశ

అంగదుని నాయకత్వంలోని వానరులు వింధ్యకు దక్షిణ దిక్కున ఉన్న ప్రదేశా లన్నిటినీ అన్వేషిస్తూ భీకరారణ్య ప్రదేశం చేరారు. నిర్జీవమైన ఆ అటవీ ప్రాంతం భయాందోళనల్ని కలిగించింది. కండుడనే మహర్షి ఒకప్పుడు అక్కడ ఉండేవాడు. ఆయన సత్యవాది. మహా తపస్సంపన్నుడు. కాని కోపిష్టి. పదహారు సంవత్సరాల వయస్సున్న ఆయన కుమారుడు ఆ వనంలోనే మరణించిన కారణంగా కండుడు శపించి వననాశనానికి కారకుడయ్యాడు. ఆ అరణ్య ప్రదేశంలోని గుహల్ని, కొండల్ని వెతికినా ప్రయోజనం కలుగలేదు.

ఇంతలో క్రూరమైన ఆకారంతో పర్వతాకారుడైన రాక్షసుడు తమపైకి వస్తుండగా అతడే రావణుడని అంగదుడు తన అరచేతితో చరిచాడు. ఆ దెబ్బకు నేలకూలి రాక్షసుడు ప్రాణాలు వదిలాడు.

ఎంత వెతికినా జానకి జాడ తెలియని వానరులు సుగ్రీవుని కోపాన్ని, అతడు వేసే తీవ్రమైన శిక్షల్ని గురించి అంగదుడు ప్రస్తావించి క్షుణ్ణంగా వెతకాలన్నాడు. గంధ మాదనుడు అనే వానరుడు అంగదుణ్ణి సమర్థించాడు.

ఇలా వెతుకుతూ ఆకలిదప్పులకులోనై ఋక్షబిలం అనే పేరుతో దానవుడి అధీనంలో ఉన్న గుహను చూశారు. ఆ గుహలోంచి పక్షులు, హంసలు వెలుపలికి రావడం చూసి, అవి నీటిలో తడిసి ఉండటం గమనించి, ప్రవేశించడానికి కష్టసాధ్యం అనిపించిన ఆ గుహలో బావికాని, మడుగుకాని తప్పక ఉంటుందని హనుమంతుడు చెప్పగా వానరులు ఆ గుహలోకి ప్రవేశించారు.

లోపలికి వెళ్ళిన తర్వాత కొంతదూరంలో వెలుతురు కన్పించింది. అత్యంత మనోజ్ఞమైన సరస్సులు, శోభాయమానమైన భవనాలు కన్పించాయి. ఒకచోట జింక చర్మాన్ని పై వస్త్రంగా ధరించిన తేజోవంతురాలైన దివ్యస్త్రీని చూశారు. తాము గుహలోకి వచ్చిన కారణాన్ని తెలియజేసి ఆకలిదప్పులు తీరే విధం అడిగి ఆమె ఎవరని ప్రశ్నించారు.

అది మాయావి, శక్తిమంతుడు అయిన మయుడు నిర్మించిన కాంచనవనం. అతడు దానవ ప్రముఖులకు విశ్వకర్మ (శిల్పి). వెయ్యి సంవత్సరాలు తపం ఆచరించి బ్రహ్మదేవుడి వల్ల వరం పొందిన మయుడు వరప్రభావంతో శుక్రాచార్యుడివద్ద శిల్పశాస్త్రజ్ఞానం పొందాడు. మయుడు 'హేమ' అనే అప్సరస స్త్రీపై ఆసక్తి కలిగి ఉండటం చూసి దేవేంద్రుడు వజ్రాయుధంతో అతణ్ణి సంహరించాడు. ఈ వనాన్ని, బంగారు గృహాన్ని బ్రహ్మ హేమకు బహూకరించాడు. ఆ అప్సరస వీటిని పొంది చాలాకాలం సుఖభోగాలు అనుభవించింది. మేరు సావర్ణికూతురైన స్వయంప్రభ ఈ వివరాలు తెలియజేసి తాను హేమ ప్రియసఖినని, ఈ సంపదను రక్షిస్తూ ఇక్కడే నివసిస్తున్నాని పేర్కొంది.

స్వయంప్రభ వాళ్ళు వచ్చిన వృత్తాంతాన్ని తెలుసుకుంది. సుగ్రీవుడు శిక్షిస్తాడన్న భయాన్ని వెలిబుచ్చి తమ్ము రక్షించమని ఆమెను ప్రార్థించారు. 'ఈ గృహం నుంచి బయట పడటం అసాధ్యం. అందరూ కళ్ళు మూసుకుంటే మిమ్మల్ని బయటికి తీసుకెళ్తాను' అని స్వయం ప్రభ చెప్పింది. వానరులు కళ్ళు మూసుకున్న మరుక్షణం బిలం బయటికి వచ్చారు.

"ఇది వింధ్య పర్వతం. ఇక్కడ చాలా సెలయేళ్ళు ప్రవహిస్తున్నాయి. ఇటువైపున్న సముద్రం మహోదధి. మీకు శుభం కలుగుతుంది" అని చెప్పి స్వయంప్రభ గుహలోకి ప్రవేశించింది. గిరి దుర్గంలో వెతికి గుహనుంచి బయట పడటంతోనే సుగ్రీవుడు విధించిన వ్యవధి పూర్తయింది.

వానరులు వరుణుడి నిలయమైన మహోదధిని చూశారు. అంగదాదులు సుగ్రీవుడి మరణ దండన కంటె ప్రాయోపవేశం చెయ్యడం మేలని భావించారు. 'తారుడు' అనే వానరుడు మళ్ళీ దుర్గమమైన గుహకు వెళ్ళి అక్కడే నివసిద్దాం అన్నాడు. హనుమంతుడు ఈ రెండు ప్రతిపాదనల్ని నిరాకరించి, వచ్చిన కార్యాన్ని సఫలం చేసుకొని వెళ్ళటమే ఉత్తమం అన్నాడు.



అంగదుడు సుగ్రీవుని తీవ్రస్వభావాన్ని నిందించాడు. 'సుగ్రీవుడు దయాహీనుడు. రాజ్యాధికారం నిలుపుకోవటానికి నన్ను రహస్యంగా దండిస్తాడు. శాశ్వతంగా బంధించ గలడు. కిష్కింధకు వెళ్ళి బంధింపబడి దుఃఖాల పాలవటం కంటె ఇక్కడే ప్రాయోపవేశం చెయ్యటం నాకు శ్రేయస్కరం. మీరందరూ గృహోన్ముఖులు కావచ్చు. వానర పెద్దలందరికీ నా వందనాలు' అని పలికి అంగదుడు దర్భలను పరచి, దీనంగా ఏడుస్తూ వాటిపై కూర్చున్నాడు. వానరులందరూ అక్కడే తూర్పుదిక్కువైపు తిరిగి కూర్చున్నారు.

## సంపాతి వృత్తాంతం

ప్రాయోపవేశానికి సిద్ధమై వానరులు కూర్చున్న ప్రదేశానికి సమీపంలో జటాయువు అన్న అయిన సంపాతి వచ్చాడు. వానరుల వ్యవహారం గమనించి 'ఇక్కడ మరణించిన వాళ్ళను వరుసగా భక్షిస్తాను' అని పైకి అన్నాడు. ఆ పక్షిరాజు మాటలు విని అంగదుడు ఉద్విగ్నతతో సీతాపహరణం మొదలు, జటాయువు మరణం సుగ్రీవుని స్నేహం, వాలివధ మొదలైన సంఘటనల్ని పేర్కొంటూ ఇవన్నీ మన వానరజాతి వినాశనానికి ఏర్పడ్డాయని, రాముడి బాణాలకు రాక్షసులందరూ ఆహుతి అవుతారని పదే పదే హనుమంతుడితో పలికాడు.

జటాయువు గురించి విన్న సంపాతి వానరులతో 'మహాత్ములారా! నా తమ్ముడి ప్రస్తావన తీసుకొచ్చారు. సూర్యకిరణాల తాకిడికి నా రెక్కలు మాడిపోయాయి. కనుక దయతో నన్ను క్రిందకు దించండి' అని కోరాడు. వానరులు సంపాతిని క్రిందికి తీసుకు వచ్చారు.

సంపాతికి అంగదుడు ఆ వరకు జరిగిన వాటినన్నిటినీ తెలియజేశాడు. జటాయువు మరణానికి దుఃఖించిన సంపాతి తన వృత్తాంతాన్ని తెలియ జేశాడు. "పూర్వం వృత్రాసురవధ జరిగినప్పుడు నేనూ, జటాయువు ఆకాశంలో ఎగిరే విషయంలో పరస్పరం పోటీపడి, సూర్యమండలాన్ని సమీపించాం. సూర్యకిరణాల వేడికి తట్టుకోలేక జటాయువు శక్తి క్షీణించింది. ఆ తాపాన్ని భరించలేక విలవిలలాడుతున్న నా తమ్ముడి మీద ప్రేమతో అతడిపై నా రెక్కల్ని కప్పాను. నా రెక్కలు మాడిపోగా, వింధ్య పర్వతంపై పడ్డాను. అప్పటినుంచి ఇక్కడే నివసిస్తున్నాను. నా తమ్ముడి జాడ ఇంతవరకు నాకు తెలియదు. మీ వల్ల నా తమ్ముడు సీత రక్షణార్థం ప్రాణాలు విడిచాడని తెలిసింది.

రావణుడు సీతను అపహరించుకు పోవడం నేను చూశాను. రావణుడు లంకాధిపతి. సీత రావణుడి అంతఃపురంలో బంధింపబడి ఉంది. రాక్షసస్త్రీలు కాపలా కాస్తున్నారు. వైనతేయ వంశానికి చెందినవాణ్ణి కనుక రావణుణ్ణి, జానకిని స్పష్టంగా చూడగలుగు తున్నాను. వందయోజనాలకు మించి ఉన్న దూరంలోని వాటినీ స్పష్టంగా చూడగలను.

హనుమంతుడికి బ్రహ్మ, దేవేంద్రులతోబాటు సూర్యుడు 'నా తేజస్సులోని నూరవ భాగాన్ని ఇతడికి ఇస్తున్నాను. సకల శాస్త్రాల జ్ఞానాన్ని బోధిస్తాను. అందువల్ల ఇతడు గొప్ప వక్త అవుతాడు' అని వరం ఇచ్చాడు. రాముడి ప్రశంసలు మొదటి కలయికలోనే హనుమంతుడు అందుకోవడానికి కారణం ఇది.

వరుణుడు పాశాలవల్లకాని, నీటివల్లకాని హనుమంతుడికి ఎటువంటి మృత్యు భయం ఉండదని వరం ఇచ్చాడు. కుబేరుడు యుద్ధంలో తన గదవల్ల ప్రాణభయం ఉండదన్నాడు. శంకరుడు నావల్ల కాని, శూలపాశుపతాస్త్రాది దివ్యశస్త్రాలు ఏవీ ఇతణ్ణి వధించవన్నాడు.

దేవతల వరాల ప్రభావంతో బాల్యచేష్టలద్వారా యజ్ఞవాటికల్ని భగ్నం చెయ్యడం, మునుల వస్త్రాలను, అజినాలను చించడం వంటి ఆకతాయి పనులు హనుమంతుడు చేస్తుండటంతో మునులు ఆంజనేయుణ్ణి (అంజనాదేవి పుత్రుడు) శపించారు.

వరప్రభావాది బలాలతో మమ్మల్ని బాధిస్తున్నావు. నీవు ఆ బలపరాక్రమాలను దీర్ఘకాలం వరకు మరిచిపోతావు. ఇది మా శాపం. నీ బలపరాక్రమాలను, శక్తిసామర్థ్యాలను ఎవరైనా నీ ముందు ప్రస్తావిస్తే అప్పుడు నీకు గుర్తుకువస్తాయి' – ఇది మునుల శాపం.

అప్పట్నుంచి మారుతి (వాయుపుత్రుడు కనుక) బుద్ధిగా ప్రవర్తించసాగాడు. ఈ కారణంగానే హనుమంతుడు తన అసలు శక్తిసామర్థ్యాలను అంతకు ముందెప్పుడూ ప్రదర్శించలేకపోయాడు. ఈ వృత్తాంతం తెలిసిన జాంబవంతుడు కీర్తించగానే అతడు తన స్వస్వరూపాన్ని గుర్తించాడు.

## వాలిగాథ

రాముడు సుగ్రీవుడితో బదులు వాలితో స్నేహం చేసి ఉంటే సీతాన్వేషణ కార్యక్రమం త్వరగా అయ్యేది. ఏ శ్రమా లేకుండా సీత దక్కేది. రావణాసురుణ్ణి సునాయాసంగా తన చంకలో ఇరికించుకొని భూమండలాన్ని తిరిగి వచ్చిన వాలికి ఇది సాధారణమైన కార్యం. పైగా వాలి రావణుల స్నేహ ధర్మాన్ని పురస్కరించుకొని రావణాసురుడే సవినయంగా సీతను అప్పగించి ఉండవచ్చు – ఈ విషయాన్నే కొన ఊపిరితో ఉన్న వాలి రాముణ్ణి అడిగాడు.

వాలి ద్వారా తన కార్యం సఫలమయితే తన పరాక్రమానికి అది మాయని మచ్చ అవుతుంది. రావణవధ, రాక్షస సంహారం సాధ్యం కాదు. మూడవది రావణుడితోబాటు మరొక దుర్మార్గుడైన వాలి అరాచకాలు విజృంభించే అవకాశాలున్నాయి. అందుకే అత్యంత శ్రమ సాధ్యమైనా రాముడు ధార్మికుడైన సుగ్రీవుడి మైత్రినే కోరుకున్నాడు.



జాంబవంతుడు తాను వృద్ధుణ్ణయ్యానని, యవ్వనంలో తన గమనశక్తి అపారంగా ఉండేదని, బలి యజ్ఞం నిర్వహిస్తున్నప్పుడు శ్రీ మహావిష్ణువు వామనావతారం ఎత్తి మూడు అడుగుల్లో ఈ విశ్వాన్ని కొలిచాడు. సమస్త విశ్వాన్ని ఆక్రమించిన ఆ విరాట్పురుషుణ్ణి తాను కొంతకాలంలోనే ప్రదక్షిణం చేశాడని పేర్కొన్నాడు. ఇది విన్న అంగదుడు తాను వందయోజనాల వరకు లంఘించగలనని, కాని తిరిగి వచ్చే శక్తి ఉంటుందో లేదో చెప్పలేనన్నాడు.

జాంబవంతుడు హనుమంతుని శక్తిసామర్థ్యాలను గుర్తు చేశాడు. అలా చెబుతూ అతడి పుట్టుక, పెరుగుదల గురించి కూడా బాంబవంతుడు ప్రస్తావించాడు.

"కశ్యపమహర్షి వినతలకు జన్మించిన గరుత్మంతుడితో సమానమైన బలం నీది. నీ బలం, తేజస్సు ప్రజ్ఞ, ధైర్యసాహసాలు సకల ప్రాణులకంటె శ్రేష్ఠతమం. నీవు సముద్ర లంఘనానికి ప్రయత్నించవెందుకు?"

అప్సరసలలో శ్రేష్ఠురాలైన 'పుంజికస్థల' అంజన అనే పేరుతో ప్రసిద్ధిగాంచింది. శాపవశాత్తు ఆమె కుంజరుడనే వానర ప్రభువుకు కామరూపిణి (కోరిన రూపం పొందగల) అయిన వానర స్త్రీగా జన్మించింది. కేసరి భార్య అయింది. కామరూపిణి కనుక ఒకానొక సమయంలో మానవస్త్రీరూపం ధరించి పర్వతంపై సంచరించింది. వాయుదేవుడు ఆమె వస్త్రాలను హరించాడు. అప్పుడామె సౌందర్యం చూసి కామపరవశుడయి కౌగిలించు కున్నాడు.

అంజన విభ్రాంతురాలై 'మచ్చలేని నా సౌశీల్యాన్ని భంగపరచడానికి పూనుకొన్న వాడెవ్వడు?' అని ప్రశ్నించగానే వాయుదేవుడు 'నిన్నేమీ బాధించను. నేను కౌగిలించుకున్నా నిన్ను మానసికంగానే పొందాను. నీకు ఎటువంటి కళంకమూ అంటదు. భయపడకు. గొప్ప పరాక్రమరాలి, బుద్ధిసంపన్నుడు అయిన కుమారుడు నీకు కలుగుతా'దని ఆమెను ఓదార్చాడు. కుదుటపడిన మనస్సుతో అంజన సంతుష్టురాలై, పిదప నిన్ను ప్రసవించింది.

నువ్వు బాల్యదశలో ఉన్నప్పుడు ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూసి పండు అని భావించి, దాన్ని తినటానికి పైకి ఎగిరావు. సూర్యకిరణాల తాకిడి నీపై ఎంతగా పడినా నీవు ఏ మాత్రం క్లేశానికి గురికాలేదు.

అంతరిక్షంపై దూసుకువస్తున్న నీపై దేవేంద్రుడు కోపించి వజ్రాయుధం ప్రయోగించాడు. అప్పుడు నువ్వు పర్వతం మీదపడ్డావు. నీ కోమలమైన దవడలు దెబ్బతిన్నాయి. అప్పటి నుంచి నీవు హనుమంతుడు అనే పేరుతో ప్రసిద్ధుడివయ్యావు. వాయుదేవుడు నీవు గాయపడటం చూసి కోపంతో ముల్లోకాలలో గాలిని స్తంభింపజేశాడు. ఆ కారణంగా ముల్లోకాలు తల్లడిల్లాయి. దేవతలు వాయుదేవుణ్ణి ప్రసన్నం చేసుకున్నారు. అనేక వరాలు నీకు ఇచ్చారు.

బ్రహ్మ యుద్ధంలో ఎటువంటి ఆయుధం చేతా నీకు మరణం సంభవించదని వరం ఇచ్చాడు. ఇంద్రుడు వజ్రాయుధం దెబ్బకు కూడా క్షేమంగా ఉన్న నిన్ను చూసి స్వచ్ఛందమరణాన్ని అనుగ్రహించాడు. వేగంలోను, బలంలోను వాయుదేవుడితో సమానమైన వాడివి. వామనావతార సందర్భంలో ముల్లోకాలను ఆక్రమించిన మహావిష్ణువులా నీవు మహావేగంతో విజృంభించు" అని హనుమంతుణ్ణి జాంబవంతుడు ప్రేరేపించాడు.

## ఆంజనేయుని ఉత్సాహం

నూరు యోజనాలమేర విస్తరించిన సముద్రాన్ని దాటటానికి హనుమంతుడు నిశ్చయించుకున్నాడు. తన అద్భుత రూపాన్ని పెంచి, తాను కాలుమోపి లంఘించడానికి పూనుకున్నప్పుడు తన బలానికి భూమి తట్టుకోలేదని, మహేంద్రగిరిపై నుండి లంఘించడానికి దాన్ని అధిరోహించాడు.

హనుమంతుని పాదాల ఒత్తిడికి ఆ గిరి కంపించింది. అందులోని మృగాలు, ఏనుగులు భయపడ్డాయి. నాగులు, గంధర్వులు, విద్యాధరులు, పక్షులతోపాటు అంతరిక్షానికి ఎగిరారు. పుట్టల్లోంచి మహాసర్పాలు వెలుపలికి వచ్చాయి. ఆ సర్పాలు మహేంద్రగిరి పతాకాలతో విలసిల్లే విధంగా కన్పించింది.

శత్రువుల్ని మట్టుపెట్టడంలో దక్షుడు, వానరశ్రేష్ఠుడు, మనోనిగ్రహం కలవాడు. వేగంగా పయనించగలవాడైన మారుతి ఏకాగ్రచిత్తంతో లంకను గురించి ఆలోచిస్తూ సముద్రాన్ని దాటడానికి పూనుకున్నాడు.

## విశేషాలు – విశ్లేషణ

## లక్ష్మణుని సంస్కారం

**కిష్కింధాకాండలో 67 సర్గలు, 2468 శ్లోకాలున్నాయి.**

సుగ్రీవుడు తీసుకువచ్చిన సీత ఆభరణాలను పరిశీలించమని రాముడు అన్నప్పుడు లక్ష్మణుని సమాధానం.

***శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే।***
***నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥*** *(కిష్కి. 6-22)*

ఈ కేయూరాలు, కుండలాలు నాకు తెలియవు. కాని నిత్యం పాదాభివందనం చెయ్యటంవల్ల ఈ కాలి అందెల్ని మాత్రం ఆమెవేనని అనిపిస్తుంది.

అన్న భార్యను మాతృసమానంగా భావించి గౌరవించడం అనే ఉన్నత భారతీయ సంస్కారానికి ఇది ఉదాహరణ. తన తల్లి సుమిత్ర బోధించిన తీరుగానే సౌమిత్రి సీతారాముల్ని తల్లిదండ్రులుగా భావించి పూజించాడు.



## తార జన్మ వృత్తాంతం

స్కాందపురాణంలో తారజన్మ గురించి, వాలికి భార్యకావడం గురించి ఇలా ఉంది. పాలసముద్రాన్ని మథించినప్పుడు తార అందులోంచి జన్మించింది. అప్పుడు ఆమె కుడి చేతిని వాలి ఎడమ చేతిని సుషేణుడు పట్టుకున్నారు. వాళ్ళిద్దరూ ఆమె కోసం వివాదానికి పూనుకున్నారు. దేవతల తీర్పులో తార సుషేణుడి కూతురయింది. వాలికి అర్ధాంగి అయింది.

## ఆంధ్రదేశ ప్రస్తావన

సుగ్రీవుడు అంగదుని నాయకత్వంలో సీతాన్వేషణకై దక్షిణదిశకు పంపిన వానరులకు ఆ మార్గ విశేషాలను చెబుతూ ఆంధ్రదేశ ప్రస్తావన తీసుకొచ్చి, సీతను వెతకవలసిన చోట్లలో చేర్చాడు.

**తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ ......** (కిష్కి. 41-12).

## అభిజిత్ ముహూర్తం

సూర్యోదయానంతరం(ఉదయ లగ్నం మొదలు) నాల్గవలగ్నం అభిజిత్ ముహూర్తం. ఇది అన్ని దోషాలను పోగొడుతుందని, శుభకార్యాలకు మంచిదని పండితుల అభిప్రాయం. వానరులు సముద్ర లంఘనానికి ఈ ముహూర్తం కోసం ఎదురుచూశారు.

## హనుమంతుని వృత్తాంతం

కిష్కింధాకాండలో జాంబవంతుడు హనుమంతుని వృత్తాంతం విపులంగా చెప్పాడు. ఉత్తరకాండలో రాముడు అగస్త్యుణ్ణి సందేహ నివృత్తికోసం ఒక ప్రశ్న అడిగాడు. హనుమంతుడు ఇంతటి మహాబలసంపన్నుడైనా (సీతాన్వేషణ, లంకాదహనం, సంజీవినీ పర్వతాన్ని తీసుకురావడం, అశేష రాక్షస సంహారం – మొత్తం మీద రామ విజయానికి ప్రధాన కారకుడు.) తన ఆత్మీయుడైన సుగ్రీవుడి కోసం వాలిని ఎందుకు మట్టుపెట్టలేక పోయాడు. ఇది రాముని సందేహం.

అగస్త్యుడు అందుకు సమాధానంగా హనుమంతుడి వృత్తాంతం చెప్పాడు. జాంబవంతుడు చెప్పిన వాటికంటె అదనంగా ఉన్న సమాచారం.

హనుమంతుడు సూర్యబింబాన్ని పండు అని భావించి ఎగిరిన సమయంలోనే రాహువు కూడా సూర్యుణ్ణి పట్టుకోవాలని భావించాడు. మారుతి స్పర్శ తగిలి భయపడి దేవేంద్రుడి వద్దకు వెళ్ళి తన ఆకలి తీర్చడానికి అప్పగించిన సూర్యుణ్ణి మరొకరికి ఎందుకు అప్పగించారని ప్రశ్నించాడు. ఆ కారణంగానే దేవేంద్రుడు వజ్రాయుధంతో హనుమంతుని కొట్టాడు.

సురస నూరుయోజనాల వరకు నోటిని పెంచింది. హనుమంతుడు సమయస్ఫూర్తితో అంగుష్ఠమాత్రంగా తన శరీరాన్ని తగ్గించి, వేగంగా ఆమె నోటిలోకి ప్రవేశించి, వెంటనే బయటికి వచ్చాడు. సురసాదేవి తన నిజస్వరూపంతో హనుమంతుణ్ణి ఆశీర్వదించింది.

### సింహిక మరణం

ఆకాశంలో హనుమంతుడు రెక్కలున్న మహాపర్వతంలా సాగిపోతున్నాడు. కామ రూపిణి అయిన సింహిక, ఇంత కాలానికి తనకొక మహాజంతువు ఆహారంగా లభించ బోతుందని భావించింది. హనుమంతుడి ఛాయను ఒడిసి పట్టింది. తన నీడ లాగబడు తుండగా హనుమంతుడు సముద్రంలో ఎదురుగాలికి పయనించే పెద్ద నావలా నా పరాక్రమం కుంటుపడుతూంది. నేను బలవంతంగా లాగబడుతున్నాను అని తలపోశాడు. హనుమంతుడు అన్ని వైపులకూ చూశాడు.

అపుడు సముద్రం నుంచి బయటపడిన రాక్షసిని చూసి సీతాన్వేషణకై తమను ఆదేశించినపుడు మార్గంలోని విశేషాలు తెలియజేస్తూ, సుగ్రీవుడు చెప్పిన శక్తిమంతమైన ఛాయాగ్రాహిణి సింహిక ఈమేనని హనుమంతుడు గుర్తించాడు. వెంటనే తన శరీరాన్ని పెంచాడు. అందుకు తగినట్లు పెంచిన ఆమె నోటిలో వెంటనే సూక్ష్మరూపంలో వేగంగా దూకి, వాడి గోళ్ళతో సింహిక ఆయువుపట్టువుల్ని చీల్చిచెండాడి, త్వరగా ఆకాశానికి ఎగిరాడు. ఆమె గుండెలు చీల్చగా సింహిక ఆర్తనాదం చేస్తూ సముద్రంలో పడిపోయింది.

### లంకిణిపై విజయం – లంకా ప్రవేశం

నూరుయోజనాల సముద్రాన్ని దాటిన పిదప రకరకాల చెట్లతో కళకళలాడే ద్వీపాన్ని, లంకకు దక్షిణంలో ఉన్న మలయ పర్వతంలోని వనాలను చూశాడు. హనుమంతుడు తన సహజరూపం ధరించి లంబ పర్వత శిఖరంపై దిగాడు. అమరావతిలా త్రికూట పర్వతంపై ఉన్న లంకా నగరాన్ని చూశాడు. మహాద్భుత సౌందర్యంతో, సకల సంపదలతో అలరారుతున్న ఆ పట్టణం ఆకాశంలో తేలి ఆడుతున్నట్లుగా కన్పించింది. లంకాపురి ఉత్తర ద్వారం చేరుకొని సీతాదేవిని దర్శించడం ఎలా? అని ఆలోచించసాగాడు. సూక్ష్మరూపం ధరించి రాత్రి సమయంలో వెతకడం సమంజసమని భావించాడు.

సూర్యాస్తమయం తర్వాత పిల్లి ప్రమాణంతో తన రూపాన్ని కుదించాడు. బంగారు గోపురాలతో, వైఢూర్యాది మణులతో మెరిసిపోతున్న లంకా వైభవాన్ని తిలకించాడు. చంద్రోదయమయింది. త్రికూట పర్వతంపై నిర్మితమైన లంకలో మారుతి ప్రవేశిస్తుండగా లంకాధిదేవత లంకిణి హనుమంతుణ్ణి అడ్డగించి తన్ను జయించక నగరంలోకి ప్రవేశించడం సాధ్యం కాదంది. తన అరచేతితో అతణ్ణి బలంగా కొట్టింది. హనుమంతుడు స్త్రీ అనే భావంతో తన ఎడమ చేతి వ్రేళ్ళను ముడిచి దెబ్బవేశాడు. ఆ మాత్రానికే ఆమె భూమిపై పడింది.



వాలి మరణానంతరం సుగ్రీవుడు తన భార్య రుమ, అన్న భార్య తారలతో కలిసి జీవించాడు. అన్న భార్యను తల్లిగా భావించిన అయోధ్యావాసుల దృక్పథంలో అది హేయమైన చర్య. రామలక్ష్మణులు దీన్ని ఖండించినట్లు లేదు. బహుశా వానరుల ధర్మం ప్రకారం సోదరుడి భార్యను అతడి మరణానంతరం స్వీకరించడం సమంజసమై ఉంటుంది. భర్త బ్రతికి ఉన్నప్పుడు సోదరుడి భార్యను బలవంతంగా చెరపట్టడం అధర్మమైనందున వాలి మరణశిక్షకు పాత్రుడైనాడు.

కిష్కింధాకాండ ప్రారంభంలో హనుమంతుడు తొలిసారి మనకు పరిచయం అవుతాడు. హనుమంతుడు రాముణ్ణి చూసిన తొలిక్షణంలోనే ఒక మహానుభూతికి లోనయ్యాడు. అలాగే రాముడు హనుమంతుణ్ణి మహోన్నత మూర్తిగా గుర్తించాడు. బాలకాండలో విశ్వామిత్రుడి ద్వారా అస్త్ర శస్త్ర సంపాదన, అరణ్యకాండలో మునుల ద్వారా పొందిన ఆశీస్సులు, అగస్త్యుడు ఇచ్చిన శస్త్రాలు భావి రావణ సంహారాన్ని బలపరిచాయి. హనుమంతుడి సాహచర్యం రామ విజయానికి తిరుగులేదనే భావన దృఢపడుతుంది. రాక్షస సంహారానికి సుగ్రీవమైత్రి మరింత బలం చేకూర్చింది. కిష్కింధాకాండ రామకథా గమనంలో ప్రధానమైన భాగం అని భావించవచ్చు.

**అంజనావరపుత్రాయ రామేష్టాయ హనూమతే।**
**సర్వలోకైకవీరాయ భవిష్యద్బ్రహ్మణే నమః॥**

* * * * *

# సుందర కాండం

*సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా*
*సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్।*
*సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః*
*సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరమ్॥*

శ్రీరామచంద్రుడు పురుషమోహనాకారుడు. సకల సద్గుణ శోభితుడు. అతడు సుందరుడు. శ్రీ సీతారాముల దివ్యగాథ సుందరం. అన్ని విషయాలలో సర్వలోకైక సౌందర్యరాశి సీతామాత. అశోకవనం అత్యంత సుందరం. బంగారు వన్నె కలిగిన హనుమంతుడు గొప్ప సౌందర్యవంతుడు. శ్రీ సీతా రామ హనుమదాదుల మంత్రాలన్నీ సుందరమైనవే. సుందరకాండలో సౌందర్యంకానిదంటూ ఏదీ లేదు. ఇది ప్రాజ్ఞుల వచనం.

## ఆంజనేయుని సముద్ర లంఘనం

హనుమంతుడు సూర్య,మహేంద్ర,బ్రహ్మదేవులకు,ఇతర దేవతలకు నమస్కరించాడు. తూర్పు దిక్కునకు తిరిగి తన తండ్రి అయిన వాయుదేవుడికి నమస్సులు సమర్పించాడు. దక్షిణ దిశగా వెళ్ళడానికి తన శరీరాన్ని పెంచాడు. పైకి ఎగిరి సముద్రాన్ని దాటుతూ వెళ్తున్న ఆంజనేయుడి బాహుమూలాల ద్వారా ప్రసరించే వాయువు మేఘగర్జనలా ధ్వనించ సాగింది. పొడవైన తోకతో ఉత్తర దిశనుంచి దక్షిణ దిశవైపు రాలిపోయే తోకచుక్కలా కన్పించాడు. (ఉల్కాపాతం లోకానికి అశుభసూచకం. ఆంజనేయుడి దక్షిణ దిశ పయనం లంకకు అరిష్టమనే సూచన.)

అలసట ఏ మాత్రం లేకుండా పయనిస్తున్న హనుమంతుణ్ణి చూసి నాగులు, యక్షులు, మహర్షులు, గంధర్వులు, దిక్పాలురు, దేవతలు ప్రస్తుతించారు. ఇక్ష్వాకువంశ కీర్తిప్రతిష్ఠల్ని కోరే సాగరుడు అతడికి సాయపడాలని సముద్రంలో దాగి ఉన్న బంగారు శిఖరాలుగల మైనాకుడితో (మైనాక పర్వతం) ఇలా అన్నాడు. "రామ కార్యనిమిత్తం హనుమంతుడు నీకు పైభాగంలో ఆకాశంలో పయనిస్తున్నాడు. అతడికి విశ్రాంతి కల్పించాలి. నీవు బయటికి వస్తే అతడు నీపై కొంత సమయం విశ్రాంతి తీసుకోగలడు" అన్నాడు.



## మైనాకుని వృత్తాంతం

మైనాకుడు లతలతో కూడిన మహావృక్షాలతోసహా వేగంగా నీటినుంచి బయటకి వచ్చాడు. లవణ సముద్రం మధ్యభాగంలోంచి హఠాత్తుగా వచ్చి ఎదురుగా నిలిచిన మైనాక పర్వతాన్ని ఆటంకంగా హనుమంతుడు భావించి, తన వక్షఃస్థలంతో దాన్ని అవలీలగా పడదోశాడు. మైనాకుడు మానవరూపం ధరించి, తన శిఖరంపై నిలిచి హనుమంతుడితో సంభాషించాడు. "పూర్వం పర్వతాలకు రెక్కలుండేవి. అవి వాయు, గరుడ సమమైన వేగంతో అన్ని దిక్కులకు సంచరించేవి. వాటి సంచారం వల్ల దేవతలు, ఋషులు, భయపడే వారు. సకల ప్రాణులు కంపించేవి. దేవేంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కల్ని పూర్తిగా ఖండించి వేశాడు. దేవేంద్రుడు వజ్రాయుధంతో నా పైకి వచ్చినప్పుడు మహాత్ముడైన వాయుదేవుడు నేర్పుగా నన్ను సముద్రంలో పడవేశాడు. (మైనాకుడు మేనకా హిమవంతుల పుత్రుడు. పార్వతీదేవి తోబుట్టువు). నీ తండ్రి వాయుదేవుడు నాకు పూజనీయుడు. అతిథిని సత్కరించడం బుద్ధిమంతుడి లక్షణం. నీ వంటి మహాత్ముని విషయంలో ప్రత్యేకంగా చెప్పవలసింది ఏముంది? వేగంలో వాయుదేవుడితో సమానుడివి."

హనుమంతుడు మైనాకుడి మాటలకు సంతృప్తి చెంది, "నీ ఆతిథ్యాన్ని స్వీకరించినట్లే భావించు. సమయం మించిపోతున్నది. మార్గమధ్యంలో ఆగటానికి వీల్లేదు" అని తన చేతితో తాకి అతడి ఆతిథ్యాన్ని స్వీకరించినట్లు ప్రకటించి ప్రసన్న ముఖంతో ఆకాశంలో కొంత పైకి ఎగిరి వేగంగా ముందుకు సాగాడు. మైనాకుడి ప్రవర్తనకు సంతోషించిన దేవేంద్రుడు అతడికి అభయం ఇచ్చాడు.

## నాగమాత సురస

దేవ, గంధర్వ, సిద్ధ, మహర్షులు నాగమాత అయిన సురసతో "హనుమంతుడి బలపరాక్రమాలు పరీక్షించాలి. నువ్వు భయంకరమైన కోరలతో, పచ్చటి కళ్ళతో, ఆకాశ మంతటి వెడల్పయిన నోటితో క్షణకాలం అతడికి విఘ్నం కలిగించు" అన్నారు. ఆమె అదే విధంగా హనుమంతుణ్ణి అడ్డగించి "నిన్ను దేవతలు నాకు ఆహారంగా సమర్పించారు. నా నోటిలో ప్రవేశించు" అంది.

హనుమంతుడు తన కర్తవ్యాన్ని తెలియజేసి వినయంగా నమస్కరించాడు. తన్ను కాదని ఎవరూ ముందుకు వెళ్ళలేరని, తనకు బ్రహ్మదేవుడు ఇచ్చిన వరం కనుక తన నోటిలో నుంచే ముందుకు సాగాలంది. హనుమంతుడు నోరు తెరవమన్నాడు.

హనుమంతుడు తన శరీరాన్ని పెంచుతుండగా సురస తన నోటిని పెంచింది. ఇలా క్రమంగా పెంచుకుంటూ తొంభై యోజనాల మేర హనుమంతుడు శరీరాన్ని పెంచాడు.

విధం ఎలాగని, ఆలోచించసాగాడు. చెట్టుపై నుంచే రామకథను చెప్పడం మొదలు పెట్టాడు. సీత ఆశ్చర్యంతో, పరమానందంతో అన్నివైపులా చూస్తూ, కొమ్మలలో కలిసిపోయి మెఱుపు తీగలరాశిలా పచ్చటి శరీరవర్ణంతో తెల్లటి వస్త్రాలు ధరించి ఉన్న మారుతిని చూసింది. ఈ రూపం ఆశ్చర్యం, భయంకరం, దరిచేరడానికి సాధ్యం కానిది, చూడశక్యం కానిది అని ఆలోచిస్తూ స్పృహ కోల్పోయింది. మెల్లగా తెప్పరిల్లి రామలక్ష్మణుల్ని స్మరిస్తూ ఇది కల ఏమో అనుకుంది.

శింశుపావృక్షం నుంచి క్రిందికి దిగిన హనుమంతుణ్ణి రావణమాయగా భావించింది. మారుతి సమయోచితంగా రాముని గుణగణాలను కీర్తించాడు. కలలో వానరం కన్పిస్తే శుభం కాదు. కాని శుభం కలుగుతూంది కనుక ఇది స్వప్నం కాదు అని సీత నిర్ణయించింది. ఆంజనేయుడు సీతకు ఇంపు కలిగే రీతిలో రాముని పరాక్రమాన్ని, రావణ వినాశనాన్ని వర్ణించాడు.

సీతాదేవి కోరిన మీదట రాముని శరీర చిహ్నాలను, గుణాలను వివరించి వానరకుల మైత్రిని తెలిపి ఆమెకు నమ్మకం కలిగించాడు. తర్వాత శ్రీరామనామాంకితమైన ఉంగరాన్ని సీతాదేవికి చూపించాడు. సీత విచారాన్ని విడిచిపెట్టి, హనుమంతుణ్ణి ప్రశంసించి, శ్రీరాముణ్ణి త్వరగా తీసుకువచ్చి తనకు విముక్తి కలిగించమని కోరింది. రావణుడిచ్చిన గడువు రెండు నెలలు మాత్రమే ఉంది. కనుక త్వరపడమని శ్రీరాముడికి చెప్పమంది.

అనల అనే పేరుగల విభీషణుడి పెద్ద కూతురు ఒకసారి నా వద్దకు ఆమె తల్లి పంపించగా వచ్చింది. అవంద్యుడనే విద్వాంసుడైన వృద్ధ రాక్షసుడు రావణుడితో రాముని కారణంగా రాక్షస వినాశనం తథ్యం అని చెప్పాడని పేర్కొంది. ఈ విధంగా సీత చెబుతుండ గానే సీతాదేవి తనతోబాటు వస్తే తన వీపుమీద ఆమెను తీసుకువెళ్ళగలనని హనుమంతుడు అన్నాడు.

సీతాదేవి అతడి రూపాన్ని సందేహంగా చూసింది. ఆంజనేయుడు తన శరీరాన్ని విపరీతంగా పెంచి, తాను మొత్తం లంకానగరాన్ని సైతం తీసుకెళ్ళగలనని, అందువల్ల సందేహం అక్కర్లేదని సీతతో అన్నాడు.

సీత హనుమంతుడితో – "నీతో రావడం యుక్తం కాదు. నీతో వచ్చినప్పుడు ఆకాశంలోనుంచి నేను జారిపడవచ్చు. రాక్షసులు నీతో యుద్ధానికి తలపడినప్పుడు నన్ను రక్షించే ప్రయత్నంలో నీకూ ముప్పు కలగవచ్చు. నాకూ ప్రమాదం ఏర్పడవచ్చు. నిరాయుధుడివై ఒంటరిగా ఉన్న నిన్ను రాక్షసులు ఏదోవిధంగా జయించే అవకాశం ఉంది. ఏది జరిగినా నీ కృషి వృథా అవుతుంది. ఒకవేళ రాక్షసులందరినీ నువ్వే చంపి నన్ను రక్షిస్తే శ్రీరాముడి కీర్తికి భంగం వాటిల్లుతుంది. దశకంఠుణ్ణి సపరివారంగా హతమార్చి నన్ను తీసుకుపోవడమే మహావీరుడైన శ్రీరాముడికి కీర్తిదాయకం" అని పేర్కొంది.



దిగులుపడిన లంకిణి అతణ్ణి ప్రార్థించింది. పూర్వం బ్రహ్మదేవుడు తనకొక వరం ఇచ్చాడని, ఎప్పుడైతే ఒక వానరుడు తనపై (లంకిణిపై) విజయం సాధిస్తాడో అప్పుడు రాక్షస కులానికి కీడు సంభవిస్తుందని పేర్కొన్నాడని, ఆ సమయం ఆసన్నమయిందని హనుమంతుడు నిరభ్యంతరంగా లంకలోకి ప్రవేశించవచ్చని చెప్పింది.

హనుమంతుడు ముఖద్వారం నుంచి కాక (అద్వారంలో) ప్రాకారంపై నుంచి దూకి లంకానగరంలోకి అడుగు పెట్టాడు. శత్రువుయొక్క గ్రామాన్ని కాని, నగరాన్ని కాని, పట్టణాన్ని కాని విశేష సమయంలో ముఖద్వారం గుండా ప్రవేశించ కూడదని నీతి శాస్త్రం చెబుతూంది. తన ఎడమ పాదాన్ని ముందుంచి శత్రు నగరంలోకి రాత్రివేళ ప్రవేశించాడు. ప్రయాణ, గృహప్రవేశ, వివాహ సమయాలలో కుడికాలును, శత్రునగర ప్రవేశంలో ఎడమ కాలును ముందుంచాలని నీతిశాస్త్రం.

## సీతాన్వేషణ

సీతాదేవిని వెతుకుతూ లంకాపురిలోని గొప్పగృహాలను, పరిశీలిస్తూ, వివిధ వికృతాకారాలతో ఉన్న స్త్రీ పురుషుల్ని, సౌందర్యరాశుల్ని చూస్తూ వెళ్ళాడు. సీతను కనుక్కోలేక వెతచెందాడు. రావణ భవనం, పుష్పక విమానాన్ని చూసి వాటి అద్భుత సోయగానికి, వర్ణించటానికి వీలుకాని వాటి వైభవానికి ముగ్ధుడయ్యాడు. పుష్పక విమానాన్ని విశ్వకర్మ స్వయంగా నిర్మించి బ్రహ్మదేవుడికి ఇచ్చాడు. కుబేరుడు తీవ్రమైన తపస్సుతో బ్రహ్మను మెప్పించి దాన్ని కానుకగా పొందాడు. రావణుడు తన పరాక్రమంతో కుబేరుణ్ణి జయించి తన వశం చేసుకున్నాడు.

రావణుడి అంతఃపురంలో అన్నిచోట్లనుంచి దివ్యపరిమళం గుబాళిస్తూంది. వసిష్ఠుని కామధేనువులా అన్ని కోరికల్ని ఈడేర్చే భవనంలా కన్పించింది. రావణ మందిరంలో అతణ్ణి వరించి, మోహించి వచ్చిన వాళ్ళు, అపహరింపబడిన స్త్రీలు ఉన్నారు. అతడి భార్యలందరూ సౌందర్యరాశులే. రావణుడి పట్టమహిషి మండోదరిని చూసి హనుమంతుడు సీతాదేవిగా భ్రమించాడు. వెంటనే రాముడి ఎడబాటుతో ఉన్న సీత ఇలా సుఖనిద్రలో, అలంకారాలతో ఉంటుందా? అని తర్కించి ఆమె సీత కాదనుకున్నాడు.

సీతను కనుగొనలేక ఆమె మరణించిందేమోనని కొంతసేపు దుఃఖించాడు. వివిధ రకాలుగా ఆలోచించి చింతాక్రాంతుడై తుదకు అశోకవనంలో వెతకాలని నిశ్చయించి, రావణుడి భవనం నుంచి, అశోకవనం ప్రాకారం మీదికి దూకాడు. రకరకాల చెట్లతో, పూలతో నిండుగా ఉన్న అశోకవనమంతా కలయజూశాడు. అశోకవృక్షంపై నుంచి రాక్షస స్త్రీలచేత చుట్టబడి, కటిక నేలపై, మలిన వస్త్రాలు ధరించిన స్త్రీమూర్తిని చూశాడు. ఉపవాసాలతో కృశించి, శుక్లపక్ష ప్రారంభంలోని నెలవంకలా స్వచ్ఛంగా ఆమె కన్పించింది.

## రావణుడి రాక – సీతాదేవి శోకం

హనుమంతుడు ఆమెను సీతగా గుర్తించాడు.సీతాదేవి శీలసౌందర్యాలను ఉన్నతంగా భావించి, రాముని ఔదార్య పరాక్రమాలను తలపోస్తూ మనసులో ఆనందించాడు. సీతాదేవి అప్పటి దీనస్థితికి దుఃఖించాడు. వివిధ భయంకర, వికారరూపాలతో ఆమె చుట్టూ రాక్షస స్త్రీలు ఉన్నారు. ఆ సమయంలో రావణుడు సీతవద్దకు రావడం హనుమంతుడు చూశాడు.

రావణుడు సీతవద్దకు వచ్చిన వెంటనే తన శౌర్యప్రతాపాలను, వైభవాన్ని అనేక విధాలుగా ప్రస్తుతించుకుంటూ తనను పరిగ్రహించమని ఆమెకు అనేక విధాలుగా ఆశలు చూపాడు. సీత ఛీత్కారాన్ని చూసి కొంతసేపు బెదిరించాడు. సీతాదేవి దుఃఖిస్తూ, "నేను ఉత్తమవంశంలో జన్మించి, పవిత్రమైన రఘువంశానికి కోడలైన దాన్ని, ఏకపత్నీ వ్రతుడైన శ్రీరామచంద్రునికి భార్యను, పతివ్రతను" అని చెప్పి, రావణుడు సపరివారంగా శ్రీరాముడి చేత నశించడం తథ్యమని హెచ్చరించింది. శ్రీరామబాణం దాడినుంచి అతడు తప్పించుకో లేడని, బ్రహ్మాదులు సైతం అతణ్ణి కాపాడలేరని తీవ్రస్వరంతో పేర్కొంది.

రావణుడు "ఇచ్చిన పన్నెండు నెలల గడువులో పదినెలలు గడిచాయి. ఇక రెండు నెలలే మిగిలాయి. రెండు నెలలు గడిచిన మరుసటి రోజు నా ప్రాతఃకాల భోజనానికి వంటశాలలో నిన్ను ముక్కలుముక్కలుగా వంటవాళ్ళు ఖండిస్తారు" అని భయపెట్టి, కాపలా ఉన్న స్త్రీలతో సామదానభేదదండోపాయాల ద్వారా ఎలాగైనా సీతను తనకు వశం అయ్యేటట్లు చెయ్యండని ఆజ్ఞాపించి రావణుడు తిరుగుముఖం పట్టాడు.

రావణుడు వెళ్ళిన తర్వాత ఏకజట, హరిజట, ప్రఘస, వికట, దుర్ముఖి, చండోదరి, అజాముఖి, శూర్పణఖ (రావణుడి చెల్లెలు కాదు) మొదలైన రాక్షస స్త్రీలు రావణుడి పరాక్రమాన్ని, క్రౌర్యాన్ని కూడా వర్ణిస్తూ, సీతతో రావణుణ్ణి పరిణయం చేసుకొని విలాసవంతమైన జీవితం అనుభవించమని సలహా ఇవ్వసాగారు. సీతదైన్యంతో ప్రాణత్యాగం చెయ్యాలని భావించింది. ఆమె ప్రాణత్యాగాన్ని గురించి చెప్పిన మాటను విని, రాక్షస స్త్రీలు కొందరు రావణుడికి ఆ వివరాలను తెలియజేయడానికి వెళ్ళారు. ఇతరులు రావణుడికి అనుకూలంగా అనర్థదాయకమైన మాటల్ని పరుషంగా చెప్పడం మొదలుపెట్టారు.

అప్పటి వరకు నిద్రలో ఉన్న విభీషణుడి కూతురు, జ్ఞానవృద్ధురాలు త్రిజట మేల్కొని రాక్షస స్త్రీలను మందలించింది. తనకొక కల వచ్చిందని, అది రాక్షస వినాశనాన్ని, రాముని జయాన్ని సూచించేదని పేర్కొంది. ఆ కల ఏమిటని రాక్షస స్త్రీలు అడిగారు.

## త్రిజట స్వప్న వృత్తాంతం

త్రిజట తన స్వప్న వృత్తాంతాన్ని ఇలా వివరించింది–



"ఏనుగు దంతాలతో నిర్మించబడి వెయ్యి హంసలు పూన్చిన భవ్యమైన పల్లకిలో లక్ష్మణుడితో కలిసి రాముడు శ్వేతమాల్యాంబరధారుడై, ఇటు రావడం చూశాను. సీతాదేవి సముద్రం మధ్య తెల్లటి పర్వతం మీద తెల్లటి వస్త్రాలు ధరించి కన్పించింది. పర్వత సమానమైన నాలుగు దంతాలతో ఉన్న పెద్ద ఏనుగుపై లక్ష్మణుడితో కలిసి శ్రీరాముడు రావటం సాక్షాత్కారమయింది.

ఆకాశంలో శ్రీరాముడు తాను అధిష్టించిన ఏనుగును స్థిరంగా ఉంచాడు. పర్వతాగ్రం మీద ఉన్న సీత ఆ ఏనుగు మూపు మీద ఎక్కి శ్రీరాముని ఒడిలోకి చేరింది. రాముని ఒడినుంచి లేచి సూర్యచంద్రుల్ని తాకింది తర్వాత ఆ మదపుటేనుగు లంక పైభాగంలో నిలిచింది. తెల్లటి ఎనిమిది వృషభాలు పూన్చిన రథంపైకి వెళ్ళిన రాముడు తెల్లటి మాలలు, వస్త్రాలు ధరించి సీతాలక్ష్మణులతో ఇక్కడికి వచ్చాడు. ఆ పిదప దివ్యమైన పుష్పక విమానం అధిరోహించి ఉత్తరదిశగా వెళ్ళాడు."

**సూర్యచంద్రమండలాలను తమ చేతులతో తాకినట్లు కలగంటే మహారాజ్యప్రాప్తి కలుగుతుంది. గజారోహణం, శైలాగ్రానికి చేరటం వంటివి సాక్షాత్కరిస్తే సంపదలు లభిస్తాయి.**

త్రిజట రావణుడి పరంగా కలలో కన్పించిన దృశ్యాలను కూడా చెప్పింది. "రావణుడు నూనె దట్టించిన శరీరంతో నేలపైపడి ఉన్నాడు. ఎర్రటి వస్త్రాలు ధరించాడు. పుష్పక విమానం నుంచి క్రింద పడ్డాడు. శిరోముండనం చేసుకొని నల్లటి వస్త్రాలు ధరించి, ఒక స్త్రీచేత లాగబడ్డాడు. ఎర్రటి మాలలు ధరించి గాడిదలు కట్టిన రథంపై ఉన్నాడు. పిచ్చివాడిలా నూనె తాగుతూ, నవ్వుతూ, నృత్యం చేస్తూ, గాడిద రథంపై దక్షిణ దిక్కున త్వరత్వరగా వెళ్ళాడు. ఇటువంటి నాశ కారకాలైన దృశ్యాలు కన్పించాయి".

ఇంకా సీతాదేవి పరంగా శుభశకునాలను త్రిజట పేర్కొంది. "సీతాదేవి ఎడమ కన్ను అదురుతూంది. ఎడమ తొడ అదరటం, శ్రీరాముడు ఈమె ఎదుట నిలిచి ఉన్నట్లేనని గ్రహించవచ్చు. ఒక పక్షి చెట్టుగూటిలోంచి మాటిమాటికి మధురంగా కూస్తూంది. ఆ శకునం సీతాదేవికి అభయం ప్రకటించి శ్రీరాముడికి స్వాగతం పలకడం. కనుక సీతాదేవిని బాధపెట్టక ప్రసన్నం చేసుకోవడానికి ప్రయత్నించండి" అని హితం పలికింది.

ఈ వృత్తాంతమంతా విన్న సీతాదేవి, త్రిజట చెప్పింది వాస్తవమైతే మీ అందరికీ అభయం కల్పిస్తానని రాక్షస స్త్రీలతో చెప్పింది.

## మారుతితో – సీతాదేవి సంభాషణ

వీటినన్నిటినీ చూస్తున్న హనుమంతుడు లక్షలాది వానరవీరులు వెతుకుతున్న సీత దర్శనభాగ్యం తనకు లభించడం గొప్ప అదృష్టంగా భావించి, ఆమెతో సంభాషించే

రాజైన అంగదుడికి నమస్కరించాడు. మారుతి 'కనుగొంటిని సీతమ్మను' (దృష్టాసీతా) అని సంక్షిప్తంగా చెప్పాడు.

వానరుల కోరిక మేరకు హనుమంతుడు సీతాన్వేషణ వృత్తాంతాన్ని విపులంగా చెప్పాడు. ఇక సీతాదేవి దురవస్థను తొలగించడానికి లంకపై దండెత్తాలని వానరుల్ని పురిగొల్పాడు. ఆంజనేయుడు "సీతాదేవి సహజంగానే తన్వంగి (సన్నటి శరీరం కలది) శ్రీరాముని ఎడబాటువల్ల ఆమె పాఠ్యమినాడు వేదాధ్యయనం చేసేవాడి విద్యలా సన్నగిల్లి ఉంది" అని వర్ణించాడు.

యువరాజైన అంగదుడు తామే లంకపై దండెత్తి సీతాదేవిని రక్షిద్దామని చెప్పినప్పుడు జాంబవంతుడు "రామ సుగ్రీవులు దక్షిణ దిశలో సీతాదేవిని వెతకమని మనల్ని ఆదేశించారే తప్ప, తీసుకురమ్మని ఆజ్ఞాపించలేదు. అలా తీసుకువెళ్ళడం రాముడికి ఇష్టంలేక పోవచ్చు. శత్రువును జయించి సీతను తీసుకువస్తానని రాముడు చేసిన ప్రతిజ్ఞ భంగం కాకూడదు" అని చెప్పిన మీదట అది సమంజసంగా ఉందని భావించాడు.

సీతాన్వేషణ సఫలీకృతమైన ఆనందంతో ఆకాశంలో ఎగురుతూ సుగ్రీవుని రక్షణలో ఉన్న సమృద్ధికరమైన మధువనాన్ని చూసి ఆ వనంలోకి ప్రవేశించారు. సుగ్రీవుని మేనమామ దధిముఖుడనే వానరుడు ఆ వన సంరక్షకుడు. మధుపానం చేస్తూ, పళ్ళను తింటూ,కేరింతలు కొడుతూ,చెట్లను ధ్వంసం చేస్తున్న ఆ వానరుల్ని అతడు మందలించాడు. కాని వాళ్ళు అతణ్ణి భయపెట్టారు. అతడు రకరకాలుగా ప్రాధేయపడినా కైపులో అతణ్ణి పరాభవించారు. కాపలా కాస్తున్న ఇతర వానరుల్ని కొట్టారు. ఇక లాభం లేదని భావించిన దధిముఖుడు సుగ్రీవుడి వద్దకు వేగంగా వెళ్ళి ఫిర్యాదు చేశాడు.

సుగ్రీవుడు ఆ వార్తవిని వానరులు అంత ఆనందంతో,నిర్భయంగా ప్రవర్తిస్తున్నారంటే తప్పకుండా సీతాన్వేషణ కార్యం సఫలం అయ్యుండాలని భావించాడు. వెంటనే ఆ వానరు లందరినీ తన వద్దకు రమ్మని ఆజ్ఞాపించినట్లు దధిముఖుడితో చెప్పి పంపాడు. దధిముఖుడు తిరిగి వచ్చినపుడు వానరుల మత్తు కొంతమేరకు తగ్గింది. దధిముఖుడు సుగ్రీవాజ్ఞను వాళ్ళకు వినిపించాడు.

హనుమంతుడు ఈ కార్యాన్ని సాధించగలడని సుగ్రీవుడు నమ్మినట్లే జరిగింది. హనుమంతుడు అందరి సమక్షంలో తన లంకానగర ప్రయాణం గురించి వివరించి, సీతాదేవి తనకిచ్చిన చూడామణిని శ్రీరాముడికి సమర్పించి, కాకాసుర వృత్తాంతాన్ని చెప్పాడు. తుదకు సీతాదేవి సందేశాన్ని వినిపించి, ఒక్క నెలలో తనను రక్షించాలని వేడుకొందని హనుమంతుడు విన్నవించాడు.



## సీత ఇచ్చిన ఆనవాలు – చెప్పిన కాకాసుర వృత్తాంతం

హనుమంతుడు ఏదైనా ఒక ఆనవాలును తనకిమ్మని సీతను కోరాడు. సీత కంటతడి పెడుతూ తమ మధ్య జరిగిన, ఇతరులకు తెలియని ఒక సంఘటనను హనుమంతుడికి చెప్పింది –

"చిత్రకూట పర్వతానికి ఈశాన్యభాగంలో ఒక ఉపపర్వతం పుష్కలమైన ఫలాలతో, నీళ్ళతో కళకళలాడుతుండేది. ఆ ప్రాంతంలోని మందాకినీ నదీ సమీపంలోని సిద్ధాశ్రమంలో ఉన్నప్పుడు జరిగిన సంఘటన ఇది. నేను శ్రీరాముని ఒడిపై కూర్చున్న సమయంలో ఒక కాకి మాంసానికి ఆశించి, పదే పదే తన ముక్కుతో నా రొమ్ము ప్రదేశంలో పొడిచింది. మట్టి పెడ్డలతో తరిమినా అది వదిలిపెట్టలేదు.

శ్రీరాముడు కోపంతో తన ఆసనం నుంచి దర్భను తీసి దాన్ని బ్రహ్మాస్త్రంగా అభిమంత్రించాడు. తర్వాత జ్వలిస్తున్న ఆ దర్భను కాకిపై ప్రయోగించాడు.

ఆ కాకి దేవేంద్రుడి కుమారుడు. తన్ను రక్షించుకోవడానికి వాయువేగంతో తన తండ్రియైన దేవేంద్రుడిని, ఇతర దేవతలనందరినీ ఆశ్రయించింది. కాని అందరూ తమ అశక్తతను తెలియజేయడంతో తుదకు రాముణ్ణే శరణు కోరింది. శ్రీరాముడు కరుణించి నేను ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వృథాకాదు. కనుక ఏదో ఒకటి బలికాక తప్పదని రాము డన్నాడు. కాకి తన కుడి కన్నును రూపుమాపమని చెప్పింది. ఆ విధంగా తన ప్రాణాల్ని నిలుపుకొంది. (అప్పట్నుంచి కాకులకు ఒక కన్ను మాత్రమే ఉందని ప్రసిద్ధి) నాకోసం కాకిపై బ్రహ్మాస్త్రం ప్రయోగించిన శ్రీరాముడు నన్ను అపహరించినా రావణుణ్ణి హతమార్చక ఉంటాడా?" అని సీత హనుమంతుడితో పలికి, తన తలపై ఉన్న అమూల్యమైన 'చూడామణి' ని కూడా అతడికి ఇచ్చింది.

సీతాదేవి హనుమంతుడితో అంతమంది వానరవీరులు సముద్ర లంఘనం చేసి లంకానగరాన్ని చేరుకోగలరా? అని ప్రశ్నించింది. హనుమంతుడు తమ సైన్యంలోని మహావీరుల్ని గురించి పేర్కొని, తనకన్నా బలవంతులైన వాళ్ళు లక్షల్లో ఉన్నారని సీతకు చెప్పి సంతోషం కలిగించాడు.

## అశోకవన విధ్వంసం – దనుజ సంహారం

సీతాదేవి వద్ద సెలవు తీసుకున్న ఆంజనేయుడు లంకానగరం విడిచి వెళ్ళేముందు ఏదో ఒక పని చెయ్యాలని సంకల్పించాడు. చతుర్విధ ఉపాయాలతో సామోపాయం రాక్షసుల వద్ద పని చెయ్యదు. దానం ధనమదాంధుల వద్ద నిష్ప్రయోజనం. బలగర్వితులపట్ల భేదోపాయం వ్యర్థం. కనుక నాల్గవది అయిన దండోపాయం ప్రకటించాలి అని నిర్ణయించి అశోకవనాన్ని ధ్వంసం చెయ్యడం మొదలు పెట్టాడు.

వికృతాకారం గల రాక్షస స్త్రీలు ఈ విధ్వంసకర దృశ్యాన్ని చూసి రావణుడివద్దకు వెళ్ళి ఫిర్యాదు చేశారు. వానరుడు ఒకడు సీతతో సంభాషించడం, ఆ తర్వాత ఆమె ఉన్న చోటు తప్ప తక్కిన వనాన్ని ధ్వంసం చెయ్యడం గురించి చెప్పారు. రావణుడు ఎనభైవేల మంది రాక్షసుల్ని పంపాడు. హనుమంతుడు వాళ్ళను చూసి, "శ్రీరామలక్ష్మణులకు జయం, శ్రీరామవిధేయుడైన సుగ్రీవుడికి జయం" అని, "నేను శ్రీరామదాసుణ్ణి, వాయుపుత్రుణ్ణి వెయ్యిమంది రావణులైన నన్నేమీ చెయ్యలేరు" అంటూ తనపై దాడి చేసిన రాక్షసులందరినీ హతమార్చాడు.

ప్రమదావనం(అశోకవనం) విధ్వంసం తర్వాత, రాక్షసవధానంతరం హనుమంతుడు అక్కడున్న చైత్యప్రాసాదాన్ని, దాని రక్షకులైన రాక్షస వీరుల్ని అంతం చేశాడు. ఈ వినాశనాన్ని విన్న రావణుడు కోపంతో వరుసగా రాక్షస వీరుల్ని పంపాడు. ప్రహస్తుని కుమారుడైన జంబుమాలిని, ఏడుగురు మంత్రి పుత్రుల్ని, విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అయిదుగురు సేనాపతుల్ని రావణుడి కుమారుడైన అక్షయ కుమారుణ్ణి హనుమంతుడు తుదముట్టించాడు. రావణుడు లోలోపల కుతకుతలాడుతూ తన కుమారుడైన ఇంద్రజిత్తును యుద్ధానికి వెళ్ళమని ఆదేశించాడు.

ఇంద్రజిత్తు హనుమంతుడి పరాక్రమాన్ని చూసి ఆశ్చర్యానికిలోనై తుదకు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. హనుమంతుడు అందుకు కట్టుబడ్డాడు. కాని బ్రహ్మదేవుడు ఈ వరకు ఇచ్చిన వరం కారణంగా వెంటనే ఆ అస్త్ర ప్రభావం తొలగిపోయింది. కాని ఆంజనేయుడు ఈ బ్రహ్మాస్త్రానికి కట్టుబడి గౌరవించడం మంచిదని భావించి నిశ్చేష్టుడిగా ఉండిపోయాడు. వెంటనే రాక్షసులు అందరూ జనుపనార తాళ్ళతో, వస్త్రాలతో ఆంజనేయుణ్ణి బంధించారు. బ్రహ్మాస్త్రంతో బంధింపబడిన వాణ్ణి, మరే సాధనం చేతనైనా బంధిస్తే బ్రహ్మాస్త్రం అతణ్ణి తన బంధం నుంచి విడిపిస్తుంది. బ్రహ్మాస్త్రమంత్ర పద్ధతి తెలియక రాక్షసులు తెలివి తక్కువ పనిచేశారు. రాక్షసుల ప్రవర్తనకు ఇంద్రజిత్తు విచారించాడు.

హనుమంతుణ్ణి రావణుడి ముందు నిలబెట్టారు. రావణుడి ఆకారం చూసి హనుమంతుడు విస్తుపోయాడు. రావణుడు ప్రశ్నించిన మీదట హనుమంతుడు తాను రామదూతనని చెప్పాడు. ఆ తర్వాత రామలక్ష్మణుల పరాక్రమాన్ని గురించి, సుగ్రీవాది వానరవీరుల ప్రశస్తి గురించి చెప్పి, సుదీర్ఘమైన హితోపదేశం చేశాడు. రాముడివల్ల నీవూ, నీ అనుచర గణం సమూలంగా నాశనం కావడం తథ్యం అన్నాడు. రావణుడు ఆగ్రహంతో హనుమంతుణ్ణి సంహరించమని రాక్షసుల్ని ఆదేశించాడు.

విభీషణుడు అడ్డుపడి "ఇతడు మనకు ప్రబల శత్రువే, చెప్పలేనంత అపకారం



చేశాడు. కాని దూతను చంపరాదని పెద్దలు చెప్పారు. దూతను దండించే పద్ధతులు మరెన్నో ఉన్నాయి. అంగవికారం కలిగించటం, కొరడాతో కొట్టటం, శిరోముండనం చెయ్యటం, శరీరంపై వాతలు పెట్టడం – మొదలైనవి చెయ్యవచ్చు" అన్నాడు. రావణుడు అందుకు అంగీకరించి "వానరులకు తోక అలంకారం, తోకకు నిప్పంటించి ఈ కోతిని కూడళ్ళలోను, పురం అంతటా త్రిప్పండి" అని రాక్షసుల్ని ఆజ్ఞాపించాడు.

## లంకాదహనం

రావణుడి ఆదేశానుసారం హనుమంతుని తోకకు చిరిగిన నూలువస్త్రాలు, తక్కిన గుడ్డల్ని చుట్టారు. తోకను నూనెతో తడిపి, నిప్పంటించారు. ఊరంతా త్రిప్పారు. రాక్షస స్త్రీలు ఈ వృత్తాంతాన్ని సీతాదేవికి చెప్పారు. ఆమె "నేను పతి సేవాపరాయణనైతే, తపం ఆచరించి ఉంటే, నిష్కలంక పతివ్రతనైతే అగ్నిదేవా! హనుమంతుణ్ణి చల్లగా చూడ"మని ప్రార్థించింది.

అగ్నిదేవుడు చల్లగా ఉంటూ తన శరీరాన్ని కాల్చక పోవటం సీతారాముల ప్రభావమే నని భావించి తనకు తాను బంధవిముక్తి చేసికొని, శరీరాన్ని పర్వతసమంగా పెంచుకొని తోరణ ద్వారంపై ఉన్న ఇనుప గుదియతో ద్వార రక్షకుల్ని సంహరించాడు. తర్వాత లంకా పట్టణమంతా తిరిగి భవనాలన్నిటికీ నిప్పంటించాడు. నిప్పంటించిన తర్వాత సీతాదేవి భద్రత విషయంగా చింతించాడు. తాను తెలివి తక్కువగా చేసిన పనివల్ల సీతాదేవికి కూడా ఆపద సంభవిస్తుందేమోనని దుఃఖించాడు. సముద్రంలోముంచి తోకలోని అగ్నిని చల్లార్చాడు.

ఆ సమయంలో ఆకాశంలో సంచరిస్తున్న చారణులు లంకానగరం అంతా తగుల బడుతున్నా, సీతాదేవి తన పాతివ్రత్య మాహాత్మ్యంచేత ఆపద పొందలేదని ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ మాట్లాడటం విన్న హనుమంతుడి మనస్సు కుదుటపడింది.

## తిరుగు ప్రయాణం

ఆ తర్వాత హనుమంతుడు సీతను దర్శించి, ఆమెను ఓదార్చి **'అరిష్టం'** అనే మహాగిరిపైకి అధిరోహించాడు. సముద్రంయొక్క దక్షిణతీరం నుంచి ఉత్తర తీరానికి లంఘించడానికి తన పాదాలను ఒత్తాడు. ఆ ప్రభావంతో పదియోజనాల విస్తీర్ణం, ముప్పై యోజనాల ఎత్తున్న ఆ పర్వతం క్రుంగిపోయి నేలతో సమమయింది.

దారిలో మైనాక పర్వతాన్ని స్పృశించి, మహేంద్ర పర్వతాన్ని సమీపిస్తుండగా గొప్ప ధ్వని చేశాడు. దీనవదనాలతో ఉన్న వానరులు ఉత్సాహ భరితులయ్యారు. హనుమంతుణ్ణి చూసి సంతోషించారు. హనుమంతుడు గురువులకు, ప్రముఖులకు, యువ

# యుద్ధ కాండం

*సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం*
*సమరవిజయరత్నం సచ్చిదానందరత్నమ్।*
*దశముఖహరరత్నం దానవారాతి రత్నం*
*రఘుకులరూపరత్నం పాతు మాం రామరత్నమ్॥*

## రామదండు పయనం

ఊహాతీతమైన, అనన్య సామాన్యమైన కార్యం నిర్వహించివచ్చిన హనుమంతుణ్ణి తన ఆలింగనంతో సత్కరించాడు శ్రీరాముడు. అపారమైన జలరాశిని అశేషమైన సైన్యంతో దాటడం ఎలా? లంకను చేరడానికి మార్గం ఏది? అని చింతాక్రాంతుడైన రాముణ్ణి సుగ్రీవుడు ఉత్సాహపరిచాడు. శ్రీరాముడు అడిగిన పిమ్మట హనుమంతుడు లంకానగర రక్షణ వ్యవస్థను, వైభవాన్ని వివరించాడు.

"శత్రు దుర్భేద్యమైన లంకానగరం సుఖసంతోషాలతో నిండిన రాక్షసులకు నిలయం. మదపుటేనుగులు, అసంఖ్యాక రథాలు, గుర్రాలు, రాక్షస సేనలతో లంకానగరం రక్షింప బడుతూంది. నలువైపుల విశాలమైన, ఎత్తైన ద్వారాలు, అగడ్తలు, ద్వారాలపై బాణాలను శిలలను వెదజల్లే గొప్పయంత్రాలు, వందలాది లోహనిర్మితమైన శతఘ్నులు ఉన్నాయి.

నగరం చుట్టూ ఉన్న ప్రాకారం బంగారంతో నిర్మించబడి మణులు, వజ్రవైఢూర్యాలు, ముత్యాలు పొదగబడ్డాయి. ఎత్తైనవి కనుక శత్రువులు అధిరోహించలేరు. ఈ విధంగా లంకలో తాను చూచిన సమస్త వివరాలు చెప్పి తాను లంకానగరాన్ని, సైన్యంలో నాల్గవ భాగాన్ని నాశనం చేసినట్లు చెప్పాడు. సమస్త బలాన్ని కూడ గట్టుకొని లంకానగరంపై దండయాత్రకు శుభముహూర్తంలో బయలుదేరటం మంచిదని హనుమంతుడు పేర్కొన్నాడు.

క్రమంగా అందరూ సముద్రతీరాన్ని చేరుకున్నారు. సైన్యం యొక్క కోలాహల ధ్వనులు ఉవ్వెత్తుగా లేస్తున్న కడలి తరంగాల ఘోషకంటె మించి ఉంది. సుగ్రీవుడి అధీనంలో ఉన్న వానరసేన శ్రీరామకార్యసాధనలో నిమగ్నమై వానరులు, కొండముచ్చులు, భల్లూకాలనే మూడు విధాలుగా ఏర్పడ్డాయి. సముద్ర లంఘనం గురించి, సీత ఎడబాటు గురించి శ్రీరాముడు చింతించాడు. శ్రీరాముడు ఇలా పరితపిస్తుండగా సంధ్యాకాలం కావటంతో చల్లబడిన కిరణాలలో సూర్యుడు పడమటి కొండను చేరుకున్నాడు. లక్ష్మణుడివల్ల ఊరట పొంది రాముడు సంధ్యోపాసన చేశాడు.



చూడామణిని చూసి రాముడు మళ్ళీ ఉద్విగ్నుడయ్యాడు. హనుమంతుడు తాను సీతాదేవిని ఓదార్చిన పద్ధతిని వివరించాడు. "వానర భల్లూకాల సైన్యానికి ప్రభువైన సుగ్రీవుడు సీతాదేవిని రామునివద్దకు చేర్చడానికి దృఢ సంకల్పుడై ఉన్నాడని, ఆకాశం, భూమి, పాతాళలోకాలలో ఎక్కడైనా సమర్థవంతంగా పోరాడగల నాకంటే బలశాలురైన వానరులు ఎంతో మంది ఉన్నారని, ఆ అనుచరణంతో శ్రీరాముడు నిన్ను విడిపించి వనవాసానంతరం నీతో కలిసి అయోధ్యలో పట్టాభిషిక్తుడు అవటం నిశ్చయమని" తాను ఆమెకు ధైర్య వచనాలు చెప్పినట్లు హనుమంతుడు పేర్కొన్నాడు.

## విశేషాలు - విశ్లేషణ

## హనుమంతుని సముద్ర లంఘనం

హనుమంతుడు సముద్రాన్ని దాటడానికి తన శరీరాన్ని విశేషంగా పెంచి, అమిత వేగంగా పైకి ఎగిరాడని వాల్మీకి వర్ణన. ఆకాశగమనం సునాయాసంగా సాగాలంటే భూమ్యాకర్షణ పరిధి నుంచి బయటపడాలి. ఎగిరినప్పుడు హనుమంతుడి పాదాల ఒత్తిడికి మహేంద్రగిరి కంపించింది. అమిత వేగానికి క్రింద ఒత్తిడి తీవ్రత వేగం ఎక్కువగా ఉండటం సహజం. నేటి రాకెట్లకు ఈ ప్రాథమిక సూత్రం వర్తింపజేయడం జరుగుతుంది.

## సింహికా వృత్తాంతం

అగ్ని, విష్ణుపురాణాల్లో సింహిక వృత్తాంతం ప్రస్తావించబడింది. ప్రజాపతి కాశ్యప మహర్షికి దితికి జన్మించిన కూతురు సింహిక. హిరణ్యకశిప, హిరణ్యాక్షులు ఈమెకు అన్నలు. విప్రచిత్తిని వివాహమాడింది. రాహుకేతువులు వీరి సంతానం.

రామాయణంలో హనుమంతుడి ఛాయను ఆకర్షించి హనుమంతుడి గమనాన్ని నిరోధించినట్లు ఉంది. అట్లాంటిక్ మహాసముద్రంలో అమెరికా సమీపంలోని పశ్చిమ ఇండియా దీవుల దగ్గర ఉన్న బెర్ముడా ట్రైయాంగిల్ (త్రిభుజ) స్థలంవద్ద సముద్రయానం గాని, ఆకాశయానం గాని చేస్తున్న ఓడలు, విమానాలు ఆకర్షింపబడి అదృశ్యమవుతున్నాయి. ఈ రహస్యం శాస్త్రజ్ఞులకు ఇప్పటికీ ఛేదించలేని సమస్య. సింహిక వృత్తాంతం ఇటువంటిదే కావచ్చు.

రామాయణంలో కన్పించే అనేక సంఘటనల్ని ప్రతీకాత్మకంగా గ్రహించి విశ్లేషిస్తే నాటి శాస్త్ర పరిజ్ఞానం అవగతం అయ్యే అవకాశం ఉంది. వాల్మీకి భౌగోళిక పరిశీలన, ఆయనకున్న స్వప్న, శకున, వాస్తు, సంఖ్యాశాస్త్రాల పరిజ్ఞానం అనన్య సామాన్యం. ఋతువర్ణనల్లో ఆయన నిశిత పరిశీలన మనకు అవగతమవుతుంది.

## పాడ్యమినాడు వేదాధ్యయనం

సీతాదేవి పాడ్యమినాడు వేద్యాధ్యయనం చేసేవాడి విద్యలా కృశించి ఉందని హనుమంతుడు వానరులతో చెప్పాడు.

అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, పాడ్యమి రోజుల్లో వేదాధ్యయనం చేయరాదని, అలా సంప్రదాయాన్ని విస్మరించి అధ్యయనం చేస్తే ముందుకు సాగదని, క్రమంగా విఘ్నాలకు లోనవుతుందని నమ్మకం.

## పరస్త్రీ వ్యామోహం

రావణుడు సీతను తనకు అనుకూలంగా ఒప్పించడానికి తన పరివారంతో, వందమంది భార్యలతో వచ్చాడు. ఇది అతడి అహంకారానికి, రాక్షస ప్రవృత్తికి, సిగ్గులేని తనానికి నిదర్శనం. హనుమంతుడు రావణుణ్ణి చూసి పరస్త్రీ వ్యామోహం లేనట్లయితే ఇతడు ముల్లోకాలను ఏలగలడని అనుకున్నాడు. శక్తిసామర్థ్యాలున్నా పరస్త్రీ వ్యామోహం, ఆ కారణంగా అనేక దుర్మార్గ చేష్టలు రావణుడి పతనానికి కారణాలు.

## చూసిరమ్మంటే కాల్చివచ్చాడు

ఈ సామెత సుప్రసిద్ధం. 'చూసిరమ్మంటే కాల్చివచ్చేరకం' అని సమర్థుడైన కార్య సాధకుణ్ణి గురించి అనుకునే మాట. హనుమంతుడు చేసిన పని అదే. హనుమంతుడు చేసిన లంకాదహనం కారణంగా ఈ సామెత రూపొంది, ప్రచారంలోకి వచ్చింది. రామ సుగ్రీవుల ఆదేశం కేవలం సీత ఆచూకి తెలుసుకోవడమే.

కాని హనుమంతుడు శత్రుబలాన్ని అంచనా వెయ్యడానికి చతురంగ ఉపాయాలలో చివరి (దండ) ఉపాయాన్ని ఎన్నుకున్నాడు. అతడు కేవలం అశోకవన విధ్వంసం ద్వారానే రాక్షసుల బలాబలాలను అంచనా వెయ్యాలనుకున్నాడు. కాని అదృష్టవశాత్తు వేలాది రాక్షస వీరులతోబాటు మంత్రి కుమారుల్ని, సేనాపతుల్ని, అక్షకుమారుల్ని సైతం వధించగలిగాడు. రావణుడి అనాలోచిత కార్యవల్ల (తోకకు నిప్పంటించడం ద్వారా) మొత్తం లంకా దహనాన్ని చెయ్యగలిగాడు. హనుమంతుడు విభీషణ భవనాన్ని మాత్రం వదిలి పెట్టాడు. కారణం విభీషణుడి ధర్మయుక్తమైన మాటలు.

రావణుడి సభలో హనుమంతుడు తన తోకనే ఎత్తైన ఆసనంగా మలచుకొని, రావణుడి సింహాసనం కంటె ఎత్తుగా కూర్చున్నాడన్న ప్రసిద్ధ గాథ వాల్మీకి రామాయణంలో లేదు.

రామాయణంలోని తక్కిన అయిదుకాండల పేర్లు ఆయా ఇతివృత్తాలకు అనుగుణంగా ఉన్నాయి. కాని సుందరకాండం అనే పేరు మాత్రం విలక్షణం అయింది.



ఈ కాండం ప్రారంభంలోనే పెద్దల వివరణ చెప్పబడింది. విమర్శకులు పలువురు పలు కారణాలను చెప్పారు.

ప్రత్యక్షంగా రామలక్ష్మణులు కన్పించని కాండ సుందరకాండ. రామాయణ కథలో కీలకమైన ఘట్టం ఈ కాండలో ఉంది. సుందరకాండ పూర్తిగా హనుమంతుడి ప్రాధాన్యతతో నడిచింది. హనుమంతుడికి సుందరుడని ఒక పేరున్నట్లు ఆ కారణంగా సుందరకాండ అని పేరుపెట్టడం జరిగిందని కొందరి అభిప్రాయం.

రాముని సౌందర్యవర్ణన, సీతాదేవి సౌందర్యవర్ణన, లంకలోని అశోకవనం, రావణ సదనం, పుష్పక విమానం, ఇతర భవనాల సౌందర్య వర్ణన చోటు చేసుకున్నకాండ కనుక ఈ పేరు సముచితమని కొందరు.

రామాయణమంతటినీ పారాయణం చేసే సంప్రదాయం ఉంది. సుందరకాండను మాత్రమే పారాయణం చెయ్యడం రామాయణాన్నంతటినీ పారాయణం చెయ్యడంతో సమానమని పెద్దల అభిప్రాయం.

**అతులితబలధామం, స్వర్ణశైలాభదేహం**
**దనుజవనకృశానుం, జ్ఞానినామగ్రగణ్యమ్।**
**సకలగుణనిధానం వానరాణామధీశం**
**రఘుపతివరదూతం వాతజాతం నమామి॥**

* * * * *

కలవాళ్ళుగా వర్ధిల్లటానికి అనుగ్రహించాడు. వాళ్ళు వరగర్వంతో యక్ష, కిన్నర, దేవత, చారణ, మహర్షుల్ని బాధించసాగాడు. ఆ ముగ్గురు విశ్వకర్మను ప్రార్థించటంవల్ల విశ్వకర్మ లంకానగరాన్ని నిర్మించాడు.

నర్మద అనే గంధర్వ స్త్రీ కుమార్తెలైన సుందరి, కేతుమతి, వసుధ అనే కన్యల్ని క్రమంగా మాల్యవంత, సుమాలి, మాలి సోదరులు వివాహమాడారు. సుందరీ మాల్యవంతు లకు వజ్రముష్టి, విరూపాక్షుడు, దుర్ముఖుడు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మత్తుడు, ఉన్మత్తుడు అనే ఏడుగురు పుత్రులు, అనల అనే పుత్రిక కలిగారు.

కేతుమతి సుమాలి దంపతులకు ప్రహస్తుడు, అకంపనుడు, వికటుడు, కాలకార్ముకుడు, ధూమ్రాక్షుడు, దండుడు, సుపార్శ్వుడు, మహాబలుడు, సంహాద్రి, ప్రఘసుడు, భాసకర్ణుడు అనే పదకొండుమంది కుమారులు; రాక, పుష్పోత్కట, కైకసి, కుంభీనస అనే నలుగురు కుమార్తెలు జన్మించారు.

వసుధా మాలి దంపతులకు అనిలుడు, అనలుడు, హరుడు, సంపాతి అనే నలుగురు కుమారులు జన్మించారు. వీళ్ళే విభీషణుడి మంత్రులయ్యారు. వీళ్ళందరూ బలగర్వంతో ముల్లోకాలలోని సమస్త ప్రాణుల్ని బాధపెట్టసాగారు.

మాల్యవంతాది రాక్షసుల్ని చంపడానికి పరమేశ్వరుడి ప్రేరణతో దేవతలు శ్రీ మహా విష్ణువును శరణు పొందారు. వాళ్ళకి అభయం ఇచ్చిన విష్ణువు రాక్షసులు దేవతలపై దండెత్తినప్పుడు 'మాలి' ని చక్రంతో సంహరించాడు. మాల్యవంత, సుమాలి సోదరులు తమ బలాలతో పాతాళంచేరి తలదాచుకున్నారు. శూన్యమైన ఆ లంకనే వైశ్రావణుడు (కుబేరుడు) తన ఆవాసంగా మార్చుకున్నాడు.

కొంతకాలానికి 'సుమాలి' మానవ లోకానికి వచ్చి సంచరింపసాగాడు. అప్పుడతని కుమార్తె అతడితో ఉంది. ఆ సమయంలో ఆకాశమార్గంలో అత్యంత వైభవంగా వెళ్తున్న కుబేరుణ్ణి సుమాలి చూశాడు. కుబేరుడు తన తండ్రిని దర్శించటానికి వెళ్తున్నాడు. సుమాలి పాతాళలోకం వెళ్ళి కుబేరుడిలా రాక్షసులు అభివృద్ధి సాధించే మార్గం గురించి ఆలోచించాడు.

తన మూడవ కుమార్తె అయిన కైకసి'ని చూసి బ్రహ్మవంశస్థుడు, పులస్త్యనందనుడైన విశ్రవసుడు (కుబేరుని తండ్రి) నీకు తగిన వరుడు. అతడిని పతిగా కోరి సేవించు. నీకు కుబేరుని వంటి పుత్రులు జన్మిస్తారని అన్నాడు. కైకసి తండ్రిమీది గౌరవంతో వెంటనే అంగీకరించి, మరుక్షణమే తపస్వి దగ్గరకు చేరింది. సాయంకాలపు అగ్ని కార్యాలు నిర్వహిస్తున్న అతడి సమీపంలో నిలిచి, తలవంచి, పాదాంగుష్ఠంతో పదే పదే నేలపై రాయసాగింది.



## రావణుని మంత్రాలోచన

రాముడు సముద్రం ఉత్తర తీరంలో ససైన్యంగా ఉన్నప్పుడే రావణుడు నిండు సభలో కొలువుతీరాడు. తన మంత్రుల్ని ఉద్దేశించి ఇలా పలికాడు –

"పరులు ప్రవేశించలేని లంకానగరాన్ని ఒక వానరుడు ప్రవేశించి ధ్వంసం చేశాడు. సీతను గుర్తించాడు. ప్రముఖ రాక్షస యోధుల్ని సంహరించాడు. లంకానగరాన్ని దహనం గావించాడు. రాముడు వానర సైన్యంతో లంకానగరంపై దాడికి సిద్ధమయ్యాడు. మంత్రులారా! మీరంతా ప్రజ్ఞావంతులు. చక్కగా ఆలోచించి ఒక నిర్ణయం తెలపండి. మిత్రులు శాస్త్రీయదృష్టితో ఏకాభిప్రాయానికి వచ్చి చేసిన మంత్రం (ఆలోచన) ఉత్తమ శ్రేణికి చెందుతుంది".

ఈ మాటలు విన్న రాక్షసులు, రావణ ఇంద్రజిత్తుల పరాక్రమాన్ని ప్రశంసిస్తూ వాళ్ళని జయించ గల వాళ్ళు ముల్లోకాలలో ఎవరూ లేరని, రాముణ్ణి తప్పక హతమార్చగల మన్నారు. ప్రహస్త, దుర్ముఖ, వజ్రదంష్ట్ర, కుంభకర్ణుడి పుత్రుడైన నికుంభుడు – ఇంకా పలువురు రాక్షస యోధులు తాము ఒక్కొక్కరే రామలక్ష్మణుల్ని పరిమార్చగలమని ప్రగల్భాలు పలికారు.

అప్పుడు విభీషణుడు లేచి 'ఎంతటి క్లిష్టకార్యమైనా సామదానభేదోపాయంతో మాత్రమే సాధించుకోవాలి. అలా సాధ్యం కానప్పుడే చతురుపాయాలలో నాల్గవదైన దండోపాయానికి పూనుకోవాలి. శ్రీరాముడు సర్వవిధాలా యుద్ధానికి సన్నద్ధుడై ఉన్నాడు. భయంకరమైన సముద్రాన్ని దాటి హనుమంతుడు దుస్సాధ్యమైన కార్యం సాధించాడు. గతంలో జరిగిన సంఘటనలన్నిటిలో రాముడివైపు ధర్మం ఉంది. సీతను రాముడికి అప్పగించడం శ్రేయస్కరం అన్నాడు. రావణుడు విభీషణుని మాటలు విని, సభను విడిచి తన భవనంలోకి వెళ్ళాడు.

మరుసటి రోజు ఉదయం కూడా విభీషణుడు రావణ మందిరానికి వెళ్ళి హితబోధ చేశాడు. రావణుడు అతణ్ణి అక్కణ్ణుంచి వెళ్ళమన్నాడు. రావణుడు మళ్ళీ తన ఆలోచనా మందిరానికి వచ్చాడు. అతడి ఆహ్వానం మేరకు రాక్షసులు వచ్చారు. విభీషణుడూ వచ్చాడు. ఆరునెలల తర్వాత నిద్రవీడి వచ్చిన కుంభకర్ణుడు తొలుత హితం పలికాడు. రావణుడి ఆలోచనను పసిగట్టి తానొక్కడే రామలక్ష్మణుల్ని మట్టుపెడతానని పలికాడు. సీతాదేవిని బలవంతంగా అనుభవించమని సలహా ఇచ్చిన మహాపార్శ్వుడితో రావణుడు తనకున్న శాపాలు గురించి ప్రస్తావించాడు. విభీషణుడు మళ్ళీ చెప్పిన మంచిమాటల్ని కించపరుస్తూ ఇంద్రజిత్తు నిందించాడు. విభీషణుడు రాముడి పరాక్రమం గురించి కీర్తిస్తూ ఉండగా రావణుడు అతణ్ణి తీవ్రంగా మందలించాడు. విభీషణుడు అన్నను హెచ్చరిస్తూ సభను విడిచి వెళ్ళాడు.

## రావణ వంశానుక్రమం

రామాయణంలో రావణ ప్రస్తావన శ్రీరామ జననం ముందు నుంచే కన్పిస్తుంది. ప్రత్యక్ష ప్రవేశం అరణ్యకాండలో జరిగింది. అతడు పొందిన వరాలు, శాపాల గురించి కొద్ది కొద్దిగా రామాయణం అంతటా ప్రస్తావింపబడింది. వీటిని సమన్వయం చేసుకోవడం కొంత క్లిష్టతరమైన వ్యవహారం.

శ్రీరామ పట్టాభిషేకానంతరం (ఉత్తరకాండ) రాముణ్ణి దర్శించడానికి వచ్చిన అగస్త్యాది మహామునులతో రాముడు ప్రసంగవశాత్తు రావణాదులకంటె ఇంద్రజిత్తు ఆధిక్యం ఎటువంటిది? అని ప్రశ్నించాడు. అగస్త్యుడు రావణవంశ క్రమం గురించి సమగ్రంగా వివరించాడు.

పూర్వం పులస్త్యుడనే బ్రహ్మర్షి ఉండేవాడు. అతడు బ్రహ్మమానస పుత్రుడు. మేరు పర్వత సమీపంలోని తృణబిందు మహర్షి ఆశ్రమంలో నివసిస్తూ అతడు తపస్సు కొనసాగించేవాడు. దేవ, నాగ, రాజర్షి కుమార్తెలు, అప్సరసలు ఆ ఆహ్లాద వాతావరణంలో క్రీడించే వాళ్ళు. వాళ్ళ కారణంగా తపశ్చర్యకు విఘ్నాలు కలుగుతుండడంతో కోపించి– 'నా దృష్టి సోకిన కన్య గర్భవతి అవుతుంది' అని శపించాడు. శాపభయంతో కన్యలందరూ అక్కడికి రావడం మానేశారు. తృణబిందువు కుమార్తెకు ఈ శాపం గురించి తెలియదు. తపస్సులోని భాగంగా వేదాధ్యయనం చేస్తున్న మునివద్దకు వెళ్ళి ఆయన్ని దర్శించింది. వెంటనే ఆమె శరీరంలో గర్భలక్షణాలు ఏర్పడ్డాయి.

తృణబిందువు కారణం గ్రహించి పులస్త్యుడికి సేవచేస్తుండమని,ఆయన అనుమతితో కుమార్తెను విధ్యుక్తంగా అప్పగించాడు. ఆమె సత్ప్రవర్తనకు సంతోషించి మహర్షి తనతో దీటైన పుత్రుడు జన్మిస్తాడని ఆశీర్వదించాడు. తాను వేదం పఠిస్తుండగా గర్భంలోనే అతడు వేదమంత్రాలు గ్రహించ గలుగుతాడు కనుక అతడికి విశ్రవసుడు అనే పేరు కలుగుతుందని అన్నాడు.

విశ్రవసుడు భరద్వాజమహర్షి కుమార్తె దేవవర్ణినిని వివాహమాడాడు. వాళ్ళకి కొడుకు పుట్టాడు. అతడు ధనాధ్యక్షుడు అవుతాడని ఆశీర్వదించి 'వైశ్రవణుడు' అని పులస్త్యుడు నామకరణం చేశాడు.

వైశ్రవణుడు తపస్సుతో బ్రహ్మను మెప్పించి లోకపాలుడిగా, అశేషనిధులకు అధిపతిగా వరాలు పొందాడు. యమ, ఇంద్ర, వరుణులతో బాటు నాల్గవ లోకపాలుడిగా ఆశీర్వదించి 'పుష్పకం' అనే విమానాన్ని కూడా బ్రహ్మ అనుగ్రహించాడు. తర్వాత తండ్రి అయిన విశ్రవోమహర్షి (విశ్రవసుడు) వద్దకు వెళ్ళి తనకు ప్రశాంతమైన ప్రదేశాన్ని నివాసానికి అనుగ్రహించమని ప్రార్థించాడు.



దక్షిణ తీరంలోని త్రికూట పర్వతంపై విశ్వకర్మ రాక్షసులు నివసించటానికి లంకా నగరాన్ని నిర్మించాడు. అక్కడ నివసించిన రాక్షసులు విష్ణువుకు భయపడి పాతాళానికి వెళ్ళి నివసిస్తున్నారు. విశ్రవసుడు అది యోగ్యమైన ప్రదేశం అని చెప్పగానే వైశ్రవణుడు అక్కడ సుఖంగా నివసించసాగాడు.

## రాక్షస జననం

అగస్త్యుడు చెబుతున్న వృత్తాంతాన్ని విని శ్రీరాముడు "లంకలోకి రాక్షసులు ఎలా వచ్చారు? మహావిష్ణువు వాళ్ళని ఎందుకు తరిమివేశాడు? రాక్షసులు పులస్త్యవంశానికి చెందిన వాళ్ళని విన్నాను. ఆ మహర్షివంశంలో వైశ్రవణుడు (కుబేరుడు) పుట్టాడని మీరు చెబుతున్నారు. ఆ విషయాలను గురించి విపులంగా చెప్ప" మని అభ్యర్థించాడు.

అపుడు అగస్త్యుడు ఈ విధంగా వివరించాడు –

పద్మసంభవుడైన బ్రహ్మదేవుడు తొలుత నీటిని రక్షించడానికి ప్రాణుల్ని సృష్టించాడు. ప్రాణులు ఆకలి దప్పులతో ఉంటూ తమ కర్తవ్యం ఏమిటని అడిగారు. బ్రహ్మదేవుడు "పట్టుదలతో ఈ జలాలను రక్షించండి" అని అన్నాడు. అప్పుడు ఎక్కువగా ఆకలితో ఉన్నవాళ్ళు 'మేము ఈ నీటిని రక్షిస్తాం (వయం రక్షామహే) అని, ఇతరులు మేము వీటిని పూజిస్తాం (వయం జక్షామహే) అని పలికారు. రక్షిస్తాం అని చెప్పినవాళ్ళు రాక్షసులు అవుతారని, పూజిస్తామని పలికినవాళ్ళు యక్షులవుతారని బ్రహ్మ ఆ ప్రాణులతో చెప్పాడు.

రాక్షసుల్లో హేతి, ప్రహేతి అనే సోదరులు ప్రముఖులు. హేతి యముడి సోదరి అయిన 'భయ' ను వివాహం చేసుకొని 'విద్యుత్కేశు'డనే పుత్రుణ్ణి పొందాడు. విద్యుత్కేశుడికి సంధ్యాపుత్రిక అయిన 'సాలకటంకట' తో వివాహం జరిగింది. మందరగిరిలో సాలకటంకట పుత్రుణ్ణి కని భర్తతో క్రీడించటానికి అతణ్ణి అక్కడే వదిలేసింది. శిశురోదన ఆకాశమార్గంలో వెళ్తున్న పార్వతీ పరమేశ్వరులు విన్నారు. పార్వతి ప్రోత్సాహంతో శివుడు శిశువును యువకుడిగా చేశాడు. అతడికి అమరత్వాన్ని, ఆకాశంలో చరించే విమానాన్ని అనుగ్రహిస్తాడు. ఉమాదేవి కూడా రాక్షస స్త్రీలకు సద్యోగర్భం ప్రాప్తించి వెంటనే శిశువు కలిగి, ఆ శిశువు మరుక్షణమే తల్లి అంతటి వయస్సుగలవాడుగా (యువకుడిగా) అయ్యేట్లు వరాలు ప్రసాదించింది.

విద్యుత్కేశుని కుమారుడు సుకేశుడు. గ్రామణి అనే గంధర్వుడు తన రెండవ కుమార్తె దేవవతిని అతడికిచ్చి వివాహం చేశాడు. ఆ దంపతులకు మాల్యవంత, సుమాలి, మాలి అనే కుమారులు జన్మించారు. వాళ్ళు తపశ్చర్యకు పూనుకున్నారు. బ్రహ్మ ప్రత్యక్షమై వాళ్ళ కోరిక మేరకు చిరకాలం జీవించేవిధంగా అజేయులుగా, పరస్పరం ప్రేమానురాగాలు

చలించి పరమేశ్వరుణ్ణి కౌగిలించుకుంది. పరమేశ్వరుడు తన కాలి బొటన వ్రేలితో ఆ కొండను అదిమాడు. ఆ ఒత్తిడికి రాక్షసుడి భుజాలు నలిగాయి. భీకరంగా అరిచాడు. ముల్లోకాలు దద్దరిల్లాయి. పార్వతీదేవి 'స్త్రీ కారణంగా రావణుడి మరణం సంభవిస్తుం'దని శపించింది.

రావణుడి మంత్రులు శివుణ్ణి స్తోత్రాలతో ఆనందింపజేసి శరణువేడమన్నారు. సామవేద మంత్రాలతో, రకరకాల స్తోత్రాలతో వెయ్యి సంవత్సరాలు ఆ స్వామిని ఆర్తితో కీర్తించాడు. శివుడు ప్రసన్నుడై "ముల్లోక భీకరంగా పొలికేక పెట్టిన నువ్వు ఇక 'రావణుడి'గా ప్రసిద్ధికెక్కుతావు, నీవు కోరిన మార్గంలో నిరాటంకంగా వెళ్ళవచ్చని అనుమతి నిస్తున్నాను" అని చంద్రహాసం అనే ఖడ్గాన్ని బహూకరించాడు. "ఏ సమయంలోనైనా దీన్ని అవమానించినా, పూజించటంలో అశ్రద్ధచేసినా మళ్ళీ నా వద్దకే వచ్చేస్తుంది" అని శివుడు చెప్పాడు. రావణుడు పుష్పక విమానం ఎక్కి భూమిలో పరాక్రమవంతులైన రాజులపై దండెత్తాడు. కొందరు అతడి పరాక్రమాన్ని అంగీకరించారు. అంగీకరించని వాళ్ళు సపరివారంగా నాశనమయ్యారు.

ఒకనాడు హిమవత్పర్వత ప్రాంతాలలో సంచరిస్తున్నప్పుడు తీవ్ర తపస్సాధనలో ఉన్న సౌందర్యవతిని చూశాడు. ఆమె బృహస్పతి కుమారుడైన కుశధ్వజుని కుమార్తె. 'వేద స్వరూపిణి' అయిన కన్య. ఆమె పేరు వేదవతి. యక్ష, రాక్షస, గంధర్వ, దేవతలు వివాహానికై ఆమెను కోరినా కుశధ్వజుడు విష్ణువు మాత్రమే తనకు అల్లుడు కాదగినవాడని అందరినీ తిరస్కరించాడు. దంభుడనే దైత్యరాజు రాత్రివేళ ఆమె తండ్రిని వధించాడు. ఆమె తల్లి దుఃఖంతో కుశధ్వజుని శరీరాన్ని కౌగిలించుకొని అగ్నిలో ప్రవేశించింది.

ఈ వివరాలన్నిటినీ తెలియజేసిన వేదవతి "ఓ పులస్త్యవంశజా! నా తపశ్శక్తివల్ల నువ్వెవరివో నేను తెలుసుకున్నాను. నీ ఆంతర్యాన్ని గ్రహించాను. ఇక నువ్వు వెళ్ళవచ్చు" నని ఆమె అనగానే రావణుడు ఆమె జుట్టును పట్టుకున్నాడు. వేదవతి తన చేతినే ఖడ్గంగా చేసుకొని జుట్టును ఖండించింది. తర్వాత తపశ్శక్తి చేత అగ్నిని జ్వలింపచేసి "నీచుడా! నువ్వు అవమానించిన కారణంగా నాకు జీవితంపై ఇచ్ఛ నశించింది. నా తపః ప్రభావంతో నిన్ను దహించగలిగినా, ఆ తపశ్శక్తిని వ్యర్థం చెయ్యను. నిన్ను హతమార్చటానికి అయోనిజగా జన్మించి, ఒక ధర్మాత్ముడికి కుమార్తెగా పెరుగుతాను" అని అగ్నిలోకి ప్రవేశించింది.

ఆ తర్వాత వేదవతి ఒక పద్మంలో పుట్టింది. మునుపటిలా రావణుడి చేతికి చిక్కింది. రావణుడు తన నగరానికి తీసుకువెళ్ళి మంత్రికి చూపాడు. జ్యోతిష శాస్త్రజ్ఞుడు, లక్షణజ్ఞుడైన అతడు ఆ బాలిక నీ ఇంట్లో ఉంటే చావు తప్పదన్నాడు. వెంటనే రావణుడు



విశ్రవసువు ఆమెను ప్రశ్నించగా తాను వచ్చిన కారణం మునీశ్వరుల తపః ప్రభావంతో కనుక్కోగలరని తన గురించిన వివరాలు కైకసి తెలియజేసింది. విశ్రవసువు "నీ భావం అర్థం అయింది. కాని ఈ దారుణమైన సంధ్యాసమయంలో నన్ను చేరావు. కనుక ఈ వేళలో నీకు జన్మించే కుమారులు క్రూరులైన రాక్షసులు అవుతారు" అని చెప్పాడు.

కైకసి అంజలి ఘటించి "మీ వంటి వేదవేత్తలవల్ల దుర్మార్గులైన పుత్రులు కలగడం నాకు ఇష్టం లేదు. దయచూపండి" అని ప్రార్థించింది. "నీకు కలిగే కుమారుల్లో చివరి వాడు నా వంశానికి తగ్గట్లు ధర్మాత్ముడవుతాడు" అని బ్రహ్మ అనుగ్రహించాడు.

కొంతకాలానికి కైకసికి రాక్షస లక్షణాలున్న పుత్రుడు జన్మించాడు. పది తలలు, ఇరవై భుజాలు, పొడవైన దంతాలతో పుట్టాడు. అతడి జననకాలంలో అనేక అపశకునాలు గోచరించాయి. పది తలలున్న కారణంగా అతడికి విశ్రవసుడు 'దశగ్రీవుడు' అనే పేరు పెట్టాడు. దీర్ఘదేహుడైన కుంభకర్ణుడు, వికృతముఖం కలిగిన శూర్పణఖ అనే కూతురు జన్మించారు. చివరివాడు విభీషణుడు.

ఒక రోజు వైశ్రావణుడు (కుబేరుడు) తన తండ్రి వద్దకు పుష్పక విమానంపై వచ్చాడు. కైకసి దశగ్రీవుడితో కుబేరుడి వైభవాన్ని వర్ణించి, అంతటి ఉన్నత స్థితికి ప్రయత్నించమంటుంది.

## వరాలు-శాపాలు

తల్లి మాటలకు ఉత్తేజితుడైన దశగ్రీవుడు (రావణుడు) "అమ్మా! సోదరుడితో సమానుడిగానే కాక, అంతకంటె మించిన వాణ్ణవుతాను" అన్నాడు. తన సంకల్పసిద్ధికోసం గోకర్ణాశ్రమం చేరి తన తమ్ముళ్ళతో కలిసి ఘోర తపశ్చర్యకు పూనుకున్నాడు. బ్రహ్మ సాక్షాత్కరించి అతణ్ణి వరం కోరుకొమ్మన్నాడు. అతడు చావులేని వరం ప్రసాదించమన్నాడు. బ్రహ్మ అది సాధ్యం కాదన్నాడు. రావణుడు మనిషిని విస్మరించి, ఇతరులెవరి చేతా మరణం సంభవించకూడదన్నాడు. బ్రహ్మదేవుడు అనుగ్రహించాడు.

విభీషణుడు ఎల్లప్పుడూ తన బుద్ధి ధర్మమార్గం తప్పనట్లు, బ్రహ్మాస్త్ర మంత్రం తనకు స్ఫురించేట్లు వరం కోరాడు. అనంతరం కుంభకర్ణుడికి వరం ఇవ్వటానికి సిద్ధపడిన బ్రహ్మకు దేవతలు అడ్డుపడ్డారు. కుంభకర్ణుడు వరాలేవీ లేకనే నందనవనంలో ఏడుగురు అప్సరసల్ని, ఇంద్రానుచరులు పదిమందిని, ఋషులు, మనుష్యులు పలువుర్ని భక్షించాడు. కనుక వరం ఇచ్చేముందు అతడికి మోహం కలిగించమన్నారు.

బ్రహ్మదేవుడు సరస్వతీదేవిని స్మరించి ఆమెతో దేవతల ప్రార్థనని మన్నించి కుంభ కర్ణుని నోటిని ఆవేశించమన్నాడు. ఆ తర్వాత కుంభకర్ణుణ్ణి వరం కోరుకొమ్మన్నాడు.

'నేను అనేక సంవత్సరాలు నిద్రించే వరం కావాలన్నాడు'– బ్రహ్మ– 'తథాస్తు' అని దేవతలతో బాటు అంతర్ధానమయ్యాడు. మోహ విముక్తుడైన తర్వాత తాను కోరుకున్న వరం గురించి చింతించి, బ్రహ్మతో వచ్చిన దేవతలే తన్ను ఈ విధంగా మోహంలో పడవేసి ఉంటారని భావించాడు.

ఈ వరాల గురించి తెలిసిన సుమాలి భయం వదలిపెట్టి పాతాళం నుంచి భూలోకానికి వచ్చాడు. అతడితోబాటు మంత్రులైన మారీచ, ప్రహస్త, విరూపాక్ష, మహోదరులు వచ్చారు. అందరూ దశగ్రీవుణ్ణి అభినందించారు. మాతామహుడైన (తల్లికి తండ్రి) సుమాలి 'లంకానగరం తొలుత రాక్షసులది. దాన్ని ఆక్రమించ' మన్నాడు. కాని తొలుత రావణుడు 'ధనాధిపతి నాకు అగ్రజుడు. అలా మాట్లాడటం తగదు' అన్నాడు. ప్రహస్తుడు సవినయంగా, సహేతుకంగా అతడితో మాట్లాడి ఒప్పించాడు.

'యక్ష ప్రముఖుడైన వైశ్రవణుడి వద్దకు వెళ్ళి లంకానగరాన్ని అప్పగించమని చెప్పు' అని రావణాసురుడు ప్రహస్తుణ్ణి కుబేరుడివద్దకు పంపించాడు. కుబేరుడు తండ్రికి పరిస్థితిని వివరించాడు. విశ్రవసుడు అతడితో "దశగ్రీవుడు నాతో ఈ విషయం ప్రస్తావించాడు. ఆ దుర్మార్గుడికి పలువిధాలుగా నచ్చచెప్పినా పెడచెవిని పెట్టాడు. తుదకు నువ్వు దుశ్చర్యకు పూనుకుంటే పతనం అవుతావని కూడా హెచ్చరించాను. లంకను విడిచి నువ్వు నీ సహచరులతో కైలాసం చేరి అక్కడ నివసించ" మని అన్నాడు. తండ్రి సూచన మేరకు కుబేరుడు లంకను విడిచిపెట్టాడు.

పట్టాభిషిక్తుడైన రావణుడు కాలకుని పుత్రుడు, దానవరాజైన విద్యుజ్జిహ్వునికి శూర్పణఖనిచ్చి వివాహం గావించాడు. ఒకనాడు వేట సమయంలో దితి పుత్రుడైన మయుణ్ణి రావణుడు చూశాడు. అతడితోబాటు ఉన్న మహాసౌందర్యవతి అయిన కన్యను చూసి వివరాలు అడిగాడు. ఆమె హేమ అనే అప్సరసకు మయుడికి జన్మించింది. పేరు మండోదరి (మండోదరి). దశగ్రీవుడు ఆమెను పెళ్ళాడాడు. మయుడు తీవ్ర తపఃఫలంగా పొందిన 'శక్తి'ని అల్లుడికి బహూకరించాడు. తర్వాత కుంభకర్ణుడికి వజ్రజ్వాలతోను (ఈమె విరోచనుడి కుమారుడైన బలిచక్రవర్తి మనుమరాలు (దౌహిత్రి) గంధర్వరాజైన శైలూషుని కుమార్తె), విభీషణుడికి సరమతో వివాహం జరిగింది. కాలక్రమంలో మండోదరి రావణాసురులకు 'మేఘనాథుడు' జన్మించాడు.

కుంభకర్ణుడి కోసం ఒక మహాభవనం నిర్మించారు. అతడు అక్కడ వేల సంవత్సరాలుగా మెలకువలేక నిద్రావస్థలోనే ఉన్నాడు. రావణుడు నిరంకుశంగా ప్రవర్తించి సర్వలోకవినాశకరంగా ప్రవర్తించసాగాడు. కుబేరుడు ఇది గ్రహించి దశగ్రీవుని హితంకోరి దూతను పంపించాడు. దూత విభీషణుణ్ణి సందర్శించి అతడితోబాటు రావణ సభకు వెళ్ళి కుబేరుడు విన్పించిన సందేశాన్ని తెలియజేశాడు.



'నేను జితేంద్రియుడిగా నియమ నిష్ఠలతో ధర్మోపాసన ద్వారా రౌద్ర (కేదార) వ్రతం ఆచరించటానికి హిమవత్పర్వతానికి వెళ్ళాను. అక్కడే పార్వతీ సమేతుడైన పరమేశ్వరుణ్ణి దర్శించాను. అప్రయత్నంగా నా ఎడమ కంటి దృష్టి ఆమెపై ప్రసరించింది. అందులో ఏ దురుద్దేశం లేకపోయినా ఆ దేవి దివ్యతేజః ప్రభావంతో నా ఎడమకన్ను దగ్ధమయింది. పింగళవర్ణం పొందింది. తర్వాత కైలాసగిరిలోని మరో ప్రాంతానికి వెళ్ళి ఎనిమిది వందల సంవత్సరాలు మౌనంగా తపం ఆచరించాను. వ్రతం సమాప్తమైన తర్వాత మహేశ్వరుడు సంతోషించి ప్రసన్నుడై 'ఈ వ్రతాన్ని నేనూ ఆచరించాను. ఈ వ్రతం చేసిన రెండవ వాడివి నువ్వు. ఈ కఠోరవ్రతం ఆచరించిన నువ్వు నాతో స్నేహంగా ఉండు. దేవి దివ్య ప్రభావంతో రెండవ కన్ను దగ్ధమైనందున ఇకముందు ఏకాక్షి పింగళుడు అనే పేరుతో ప్రఖ్యాతుడివి అవుతావు' అని నన్ను అనుగ్రహించాడు.

కుబేరుడు తన సందేశాన్ని ఈ విధంగా చెప్పి 'పాపకృత్యాలు మానుకొని మనవంశ ప్రతిష్ఠను నిలబెట్టు. ఇప్పుడు దేవతలు, మహర్షులు, నిన్ను వధించే ఉపాయం గురించి ఆలోచిస్తున్నారు' అని దూతద్వారా హెచ్చరించాడు.

దూత పలికిన కుబేరుడి సందేశం విని రావణుడు తీవ్ర అసహనానికి లోనై "రావణుడికి నేను అన్నను కనుక తన్ను చంపడనుకున్నాడేమో! ఈ మాటలు విన్న తర్వాత కుబేరుణ్ణే కాక, ఇతర దిక్పాలురినీ మృత్యులోకానికి పంపాలని సంకల్పించాను" అని దూతను తన ఖడ్గంతో ఖండించి రాక్షసులకు ఆహారంగా ఇచ్చాడు. కుబేరుడిపై దండెత్తి గదాహతితో స్పృహ కోల్పోయేట్లు చేసి, అతడి పుష్పక విమానాన్ని తీసుకొని కైలాస పర్వతం నుంచి దిగాడు. కుబేరుణ్ణి జయించిన తర్వాత పుష్పక విమానంలో వెళ్తూ మహాశరవణ (రెల్లు గడ్డితో కూడిన) వనం చేరాడు.

అది కుమారస్వామి జన్మించిన ప్రదేశం. రమ్యమైన వనాలతో కూడిన ఒక పర్వతం. ఆ పర్వతం పైకి రాగానే పుష్పక విమానం ఆగింది. ఇంతలో శంకరుడి అనుచరుడైన నందీశ్వరుడు అక్కడికి వచ్చాడు. నలుపు, పింగళవర్ణాలతో పొట్టిగా, వికృతంగా భయంకర రూపంలో ఉన్న అతడు "ఈ పర్వతంపై శంకరుడు క్రీడిస్తున్నాడు. అందువల్ల ఎవరూ ఈ పర్వతంపై వెళ్ళరాదు. వెనక్కి వెళ్ళమన్నాడు. 'ఎవరీ శంకరుడు?' అని అహంకరించి పలికి వానరముఖంతో ఉన్న నందీశ్వరుణ్ణి చూసి ఎగతాళి చేశాడు. దానితో కోపించిన నందీశ్వరుడు, "నా వానరరూపం చూసి పరిహసించావు కనుక, నాలా పరాక్రమవంతులు, రూపం కలవాళ్ళు అయిన వానరులు నిన్ను, నీ వంశాన్ని రూపుమాపుతా" రని శపించాడు.

రావణుడు కైలాస పర్వతం క్రింది భాగంలో తన భుజాలను ఆనించి, ఎత్తటానికి ప్రయత్నించాడు. అప్పుడు పర్వతం కంపించింది. ప్రమథ గణాలు కంపిచాయి. పార్వతి

ఇంద్రుడు రణరంగంలోని ప్రవేశించాడు. రావణుడు అతణ్ణి ఎదుర్కొని ఇంద్రజిత్తును యుద్ధంనుంచి విరమింపజేశాడు. కుంభకర్ణుడు భీకరంగా పోరాడాడు. ఇంద్రుడు తన సైన్యంతో రావణుణ్ణి చుట్టుముట్టడంతో రాక్షసులు హాహాకారాలు చేశారు. అది విన్న ఇంద్రజిత్తు శంకరుడినుంచి వరంగా పొందిన మాయను ఆశ్రయించి, ఇంద్ర సారథి మాతలిని తీవ్రమైన శరాలతో దెబ్బతీసి, అలసిన ఇంద్రుణ్ణి తన మాయచేత బంధించి సైన్యం వద్దకు తీసుకెళ్ళాడు. రావణుడిపై దేవతాగణం పరంపరగా బాణాలు ప్రయోగించి యుద్ధవిముఖుణ్ణి చేశారు. మేఘనాథుడు అదృశ్యంగా వాళ్ళపై బాణాలు ప్రయోగించి, రావణుడితో విజయం చేకూరినట్లేనని, ఇంద్రుణ్ణి బందీగా చేసి ముల్లోకాలను అనుభవించ మని చెప్పాడు. రావణుడు కుమారుడి పరాక్రమానికి సంతోషించాడు.

లంకలో ఇంద్రుణ్ణి బంధించిన తర్వాత బ్రహ్మను ముందుంచుకొని దేవతలు లంకకు వెళ్ళారు. బ్రహ్మ రావణుడితో "నలుగురు దిక్పాలకుల్ని జయిస్తానని నువ్వు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నావు. నీ కుమారుడు నీ కంటె మించిన వీరుడయ్యాడు. ఇంద్రుణ్ణి జయించిన కారణంగా ఇక అతడు ఇంద్రజిత్తనే పేరుతో ప్రసిద్ధుడవుతాడు. నీ నిర్బంధం నుంచి మహేంద్రుణ్ణి విడిచిపెట్టు. అందుకు ప్రతిఫలంగా నీకేం కావాలో కోరుకో" అన్నాడు.

ఇంద్రజిత్తు అమరత్వాన్ని కోరాడు. అది సాధ్యం కాదని బ్రహ్మ చెప్పాడు. "నేను యుద్ధరంగానికి వెళ్ళేముందు మంత్రపూర్వకంగా హవ్యాలను సమర్పిస్తూ, అగ్నిదేవుణ్ణి ఆరాధిస్తాను. అతడి నుంచి వేగవంతమైన అశ్వాలతో కూడిన దివ్యరథం ఆవిర్భవించాలి. ఆ రథాన్ని నేను ఆరోహించి ఉన్నంతవరకు నన్ను ఎంతటి వారైనా చంపలేని వరాన్ని ప్రసాదించ" మని అన్నాడు. బ్రహ్మదేవుడు అందుకు అంగీకరించాడు. ఇంద్రుడు బంధ విముక్తుడు అయ్యాడు.

దైన్యవదనంతో ఉన్న ఇంద్రుడితో బ్రహ్మ "పురందరా! నువ్వు అనేక పాపకృత్యాలు చేశావు. జితేంద్రియుడైన గౌతమ మహర్షికి నేను సృజించిన అహల్యను భార్యగా చేశాను ఆమెను కోరిన దేవతలందరూ నిరాశ చెందారు. అహల్య నీ భార్య కానందుకు ఆమెను వంచనతో సంగమించావు. ఇటువంటి పాపచర్యలవల్లే నువ్వు అవమానాల పాలయ్యావు" అని పలికాడు. వైష్ణవ యజ్ఞం ఆచరించి ఇంద్రుడు మళ్ళీ సురపతిగా పీఠం ఎక్కాడు.

రావణుడు మరింత గర్వంతో మాహిష్మతీపురం చేరి కార్తవీర్యార్జునుడిపై యుద్ధం ప్రకటించాడు. అక్కడ అతడు లేకపోతే, నర్మదానదిలో స్నానం చేస్తున్న వెయ్యి భుజాలున్న కార్తవీర్యార్జునుడిపై దాటికి సిద్ధమయ్యాడు. కార్తవీర్యార్జునుడు రావణుణ్ణి అవలీలగా ఒడిసి పట్టుకొని బాహువుల్లో బంధించాడు. పులస్త్యమహర్షి ఆదేశంతో అతడు రావణుణ్ణి బంధ విముక్తుణ్ణి చేశాడు. వాళ్ళిద్దరి మధ్య మైత్రి ఏర్పడుతుంది.



ఆ శిశువును సముద్రంలో పడవేశాడు. ఆమె భూమికి చేరి యజ్ఞాచరణకు యోగ్యమైన పవిత్ర ప్రదేశంలో ఉండి పోయింది. తర్వాత జనక మహారాజుకు లభించింది.

రావణుడు భూమిపై తిరుగుతూ ఉండగా ఉశీరబీజదేశరాజు మరుత్తుడిచేత బృహస్పతి సోదరుడైన సంవర్తుడనే బ్రహ్మర్షి యజ్ఞం చేయిస్తున్నాడు. రావణుడు అక్కడికి వచ్చాడు. రావణుణ్ణి చూసి ఇంద్రుడు నెమలిగా, యముడు కాకిగా, కుబేరుడు తొండగా, వరుణుడు హంసగా, తక్కిన దేవతలు పశుపక్ష్యాది రూపాలుగా మారారు. మరుత్తుడు రావణాసురుడిపై యుద్ధం ప్రకటించలేదు. రావణుడు తనదే విజయం అని తిరిగి వెళ్ళాడు.

దేవేంద్రుడు నెమలి రూపం విడిచి "మీ జాతికి సర్పాలవల్ల భయం ఉండదు. మీ పింఛంలో నాకు ఉన్నట్లే వెయ్యి కళ్ళుంటాయి. మేఘరూపంలో వర్షించినప్పుడు సంతోషంతో పొంగి పోతారు" అని నెమలి జాతికి వరం ఇచ్చాడు. యముడు కాకికి "మీ జాతికి రోగాలేవీ అంటవు. నరులు మిమ్మల్ని వధించేంత వరకు మృత్యు భయం ఉండదు. నా లోకంలోని మనుష్యులు ఆకలిదప్పులలో అలమటిస్తారు. భూమిలో వీళ్ళ సంతానం నీకు ఆహారం ఇచ్చి తృప్తిపరిస్తే ఆ పితృదేవతల ఆకలిదప్పులు తీరుతాయి" అన్నాడు.

హంసకు నిర్మలమైన శరీర ఛాయను వరుణుడు అనుగ్రహించాడు. కుబేరుడు తొండకు బంగారు వన్నెను అనుగ్రహించి, ఆ బంగారురంగు తలమీద స్థిరంగా ఉండేటట్లు చేశాడు.

రావణుడు ఇక్ష్వాకు వంశస్థుడైన అనరణ్యుడిపై యుద్ధం ప్రకటించాడు. రావణుడు శిరస్సుపై కొట్టిన దెబ్బకు కుప్పకూలిన అనరణ్యుణ్ణి హేళన చేశాడు. అనరణ్యుడు కోపించి "ఉదాత్తమైన మా రఘువంశాన్ని అవమానపరిచావు. నేను సర్వవిధాల ఉత్తమమైన పాలకుడిగా ఉన్నట్లయితే మా వంశంలోనే జన్మించే శ్రీరాముడివల్ల నువ్వు హతుడవుతావు" అని శపించాడు.

నారదుడు ప్రేరేపించడంతో యమపురిపై రావణుడు దండెత్తాడు. యముడి ముందు ప్రత్యక్ష్యమై "నువ్వు కాలదండాన్ని ప్రయోగించవద్దు. కాలదండంవల్ల యముడు మరణిస్తే నా వరం నిష్ఫలమవుతుంది. నేను అసత్యవాదినవుతాను. కాలదండాన్ని తిరుగులేని మృత్యుశక్తిగా నేనే అనుగ్రహించాను. ఇది నిష్ఫలమైనా దీని అమోఘత్వం పట్ల నా అనుగ్రహం తప్పవుతుంది. కనుక కాలదండాన్ని కిందికి దింపి నన్ను సత్యవాదిగా చెయ్యి" మంటాడు. యముడు అందుకు సమ్మతించి అదృశ్యమవుతాడు. రావణుడు అది తన విజయంగా ప్రకటించుకున్నాడు.

తర్వాత పాతాళలోకంలోకి ప్రవేశించి వాసుకి పాలనలోని భోగవతీపురానికి చేరి నాగుల్ని వశపరచుకొని మణిపురం వెళ్ళాడు. అక్కడ నివాతకవచాది దైత్యులు బ్రహ్మవరం

పొందిన వాళ్ళున్నారు. రావణుడు వాళ్ళపై యుద్ధం ప్రకటిస్తే బ్రహ్మ రావణుణ్ణి మైత్రి చేసుకొమ్మన్నాడు. వాళ్ళతోబాటు ఒక సంవత్సరం ఆనందంగా గడిపాడు. వంద మాయా విద్యలను వాళ్ళ వద్ద నేర్చుకున్నాడు. తర్వాత కాలకేయుల నిలయమైన ఆశ్మ నగరానికి వెళ్ళాడు. కాలకేయుల్ని, శూర్పణఖ భర్త అయిన విద్యుజ్జిహ్వుణ్ణి మట్టుబెట్టాడు.

పిదప వరుణిడి దివ్యమందిరాన్ని చూశాడు. అక్కడ నందీశ్వరుని తల్లి 'సురభి'ని చూశాడు. వరుణ బలంపై దండెత్తి వరుణసుతులందరినీ జయించాడు. వరుణుణ్ణి యుద్ధానికి పిలువగా వరుణుడి మంత్రి ప్రహసుడు 'గంధర్వగానం వినటానికి వరుణుడు బ్రహ్మలోకానికి వెళ్ళాడు. అతడి సన్నిహితులు, కుమారులు నీచేత పరాజయం పొందారు. ఇక యుద్ధానికై శ్రమపడటం ఎందు' కన్నాడు. అతడి మాటలు విన్న రావణుడు యుద్ధంలో తాను విజేతనని ప్రకటించుకున్నాడు.

రావణుడు పలువురు సౌందర్యవతుల్ని నిర్బంధించసాగాడు. వాళ్లందరూ పరస్త్రీ వ్యామోహపరుడైన రావణుడు స్త్రీమూలంగానే మరణిస్తాడని శపించారు.

లంకకు చేరిన రావణుణ్ణి సమీపించి శూర్పణఖ బోరున ఏడుస్తూ, భూమిపై సాగిలపడింది. ఆమెను లేవనెత్తి ఓదార్చి దుఃఖ కారణం అడిగాడు. 'నువ్వు నా భర్తను చంపి నన్ను వితంతువుని చేశావు. నువ్వు దుర్మార్గుడివి, కపటివి' అని నిందించింది. రావణుడు "యుద్ధావేశంలో ఉన్మత్తుణ్ణయ్యాను. ఎదురుగా ఉన్నదెవరో తెలియక ప్రవర్తించాను. నువ్వు – మన పినతల్లి కుమారుడు, సోదరుడు, సకలైశ్వర్య సంపన్నుడైన ఖరుని వద్ద నివసించు" (ఖరుడు విశ్రవసుడికి 'పాక' అనే రాక్షసియందు పుట్టినవాడు. కామరూపులైన 14 వేలమంది రాక్షసులకు ప్రభువుగా దండకారణ్యంలో నివసించే అవకాశం రావణుడు అతడికి కల్పించాడు) అన్నాడు. దూషణుడు ఖరుని సైన్యాధ్యక్షుడు. శూర్పణఖ అప్పటినుంచి దండకారణ్యంలో నివసించసాగింది.

కొంతకాలం తర్వాత రావణుడు తన అనుచరులతో నికుంభిలావనంలోకి ప్రవేశించాడు. అది లంక యొక్క పశ్చిమ ద్వారం సమీపంలోని ఉత్తమమైన ఉపవనం. అక్కడ మేఘనాథుడు యజ్ఞదీక్షలో ఉన్నాడు. రావణుడు అతణ్ణి కౌగిలించుకొని అతడు చేస్తున్నదేమిటోనని అడిగాడు. మౌనదీక్షలో ఉన్న అతడికి బదులు యజ్ఞప్రవర్తకుడైన శుక్రాచార్యుడు సమాధానం ఇచ్చాడు.

"సకల సంపదల అభివృద్ధికోసం ఆచరించే అగ్నిష్టోమ, అశ్వమేథ, బాహుసువర్ణక, రాజసూయ, గోమేథ, వైష్ణవ మనే ఆరు యజ్ఞాలు పూర్తిచేసి సామాన్యులు చెయ్యటానికి దుర్లభం అయిన ఏడవదైన మహేశ్వర యజ్ఞాన్ని కూడా ఆచరించి పరమేశ్వరుడి నుండి అనేక వరాలు పొందాడు. చీకట్లను సృష్టించగల 'తామసి' అనే మాయా విద్యను పొందాడు. దాని ప్రభావంతో సురాసురులు ఎవరైనా అతడు ఎటునుంచి యుద్ధం చేస్తున్నారు గ్రహించ



లేరు. అక్షయంగా బాణాలను సృష్టించగల రెండు తూణీరాలు, అజేయమైన చాపం, శక్తిమంతమైన అస్త్రాన్ని పొందాడు".

ఇంతటి ఘనకార్యం సాధించిన మేఘనాథుడితో రావణుడు తన భవనానికి తిరిగి వచ్చాడు. విభీషణుడు – రావణుడు బంధించి తీసుకువచ్చిన స్త్రీలపట్ల గౌరవంగా ప్రవర్తించ మని, పరస్త్రీలను బాధించటంవల్ల అపకీర్తి వస్తుందని, పాపకార్యమని చెప్పి, తమ చెల్లెలైన 'కుంభీనసి' ని (రావణుడి పెద్ద తాత మాల్యవంతుడి కుమార్తె అనల యొక్క కుమార్తె) మధురాక్షసుడు అపహరించుకు వెళ్ళాడని, ఆ తర్వాత తెలిసినా మిన్నకున్నామని, ఈ సంఘటన రావణుడి దుష్కృత్యాల ఫలితమని చెప్పాడు.

రావణుడు మధుపురం వెళ్ళి మధురాక్షసుణ్ణి చంపడానికి ప్రయత్నించినపుడు కుంభీనసి పతిభిక్షను ప్రసాదించమని కోరి రావణుణ్ణి ఆ ప్రయత్నం నుంచి విరమింప జేసింది. ఆ రాత్రి అక్కడే గడిపి మరునాడు సపరివారంగా కైలాస పర్వతం వెళ్ళాడు. ఆ రాత్రి అక్కడే గడపాలని నిర్ణయించి, ఆహ్లాదకరమైన ఆ సమయంలో కామోద్రేకానికి లోనయ్యాడు. ఇంతలో రంభ చక్కగా అలంకరించుకొని అటువైపు వచ్చింది. రావణుడు ఆమెను సమీపించి తన కోర్కెను తీర్చమంటాడు.

రంభ వణుకుతూ 'నేను నీ కోడలిని. కోడలు కూతురు వంటిది. నీ సోదరుడైన కుబేరుని పుత్రుడు నలకూబరుడి భార్యను' అని ప్రార్థించినా – 'అప్సరసలకు భర్త ఎవడు?' అంటూ రావణుడు ఆమెను బలాత్కరించాడు. రంభ నలకూబరుడితో జరిగిన దుర్ఘటన గురించి చెప్పింది. అతడు ఆగ్రహించి 'స్త్రీ అంగీకారం లేక రావణుడు అనుచితంగా ప్రవర్తిస్తే అతడి తల ఏడు ముక్కలవుతుంది' అని శపించాడు. బ్రహ్మాది దేవతలు అది విని సంతోషించారు.

బ్రహ్మదేవుడి వద్దకు వెళ్తున్న వరుణుడి కూతురైన 'పూంజికస్థల' అనే అప్సరసను రావణుడు పై విధంగానే మానభంగం చేశాడు. ఆమె కూడా పరకాంతను బలవంతంగా లోబరచుకోవడానికి ప్రయత్నిస్తే అతడి తల ముక్కలవుతుందని శపించింది.

రావణుడు స్వర్గం మీద యుద్ధం ప్రకటించాడు. ఇంద్రుడు మహావిష్ణువును ఆశ్రయించాడు. 'ఆ దుర్మార్గుణ్ణి నేనే చంపుతాను. ప్రస్తుతం మీరే యుద్ధం చెయ్యండి' అని విష్ణువు ఆదేశించాడు. దేవాసుర యుద్ధంలో సుమాలి (రావణుడి మాతామహుడు) మరణించాడు. ఇంద్రజిత్తు చేసిన దాడిలో ఇంద్రుడి కొడుకు జయంతుడు మూర్ఛపోయాడు. ఆ సమయంలో దైత్యరాజు 'పులోముడు' దౌహిత్రుడైన జయంతుణ్ణి బంధించి (పులోముడి కుమార్తె శచీదేవి. ఆమె పుత్రుడు జయంతుడు) సముద్రగర్భంలోకి తీసుకెళ్ళాడు.

ముందు వాలి, అతడితో ద్వంద్వ యుద్ధానికి ఉపక్రమించి దెబ్బతీసి, సువేల పర్వతానికి తిరిగి వచ్చాడు. రాముడు సంతోషంతో అతణ్ణి కౌగిలించుకొని ఇక ఇటువంటి సాహస కార్యాలకు పూనుకోవద్దన్నాడు.

అంగదుణ్ణి శ్రీరాముడు రాయబారిగా రావణుడి వద్దకు పంపాడు. సీతాదేవిని అపహరించిన నాటి నుంచి జరిగిన సంఘటనల్ని, రామలక్ష్మణుల పరాక్రమాన్ని వివరించి సీతాదేవిని అప్పగించి శరణుకోరమని అంగదుడు రావణుడికి హితం చెప్పి, అలా కాని పక్షంలో రాముడి చేతిలో అతడి చావు, లంకానగరానికి విభీషణుడు రాజుకావడం తథ్యం అని పేర్కొన్నాడు. క్రుద్ధుడైన రావణుడి ఆజ్ఞతో అంగదుణ్ణి బంధించడానికి నలుగురు రాక్షసులు ప్రయత్నిస్తే, వాళ్ళను తన చంకలలో ఇరికించుకొని ఉన్నత ప్రాసాదం మీదకు ఎక్కి అంతరిక్షంనుండి బలంగా వాళ్ళను విసిరాడు. ప్రాసాదం శిఖరాన్ని భగ్నంచేసి తిరిగి వచ్చాడు.

## వానర రాక్షస యుద్ధం

వానర రాక్షసుల మధ్య ఘోరయుద్ధం మొదలయింది. ఉభయపక్షాలలో విపరీతమైన ప్రాణనష్టం జరిగింది. తొలిరోజు పగటిపూట విభీషణుడి మంత్రి సంపాతి ప్రజంఘుడనే రాక్షసుణ్ణి నల్లమద్దిచెట్టుతో, జంబుమాలిని హనుమంతుడు తన అరచేతి దెబ్బతో, ప్రతపనుడు అనే రాక్షసుణ్ణి నలుడు చేతిదెబ్బతో, అగ్నికేతువు, రశ్మికేతువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు అనే రాక్షసుల్ని శ్రీరాముడు తన బాణాలతో, నీలుడు నికుంభుడనే రాక్షసుణ్ణి రథచక్రంతో, అశని ప్రభువనే రాక్షసుణ్ణి ద్వివిదుడు సాలవృక్షంతో, విద్యున్మాలిని సుషేణుడు గిరిశిఖరంతో సంహరించారు.

రాక్షసులు ఘోరయుద్ధంచేస్తూ రాత్రికై ఎదురుచూడసాగారు. (సూర్యాస్తమయం పిదప రాక్షసుల బలం అధికమవుతుంది) రాత్రిపూట యుద్ధంలో వానరులకు అపారనష్టం జరిగింది. అంగదుడు ఇంద్రజిత్తును ఓడించాడు. మాయా యుద్ధంచేసిన ఇంద్రజిత్తు నాగాస్త్రంలో రామలక్ష్మణుల్ని బంధించాడు. అంతకు ముందు రాముడి ఆదేశంతో ఇంద్రజిత్తు ఉనికిని కనుక్కోవటానికి సుషేణుని కుమారులు, శరభుడు, వినతుడు, జాంబవంతుడు, సానుప్రస్థుడు, ఋషభుడు, ఋషభస్కంధుడు, అంగదుడు భయంకర వృక్షాలతో ఆకాశంలోకి ఎగిరి అన్నిదిక్కుల్ని గాలించసాగారు. కాని అతడు అతివేగంగా కదులుతూ వాళ్ళ కంటబడలేదు. రామలక్ష్మణులు నాగాస్త్రంతో బందీలై నిశ్చేష్టులయ్యారు.

ఇంద్రజిత్తు వానర ప్రముఖుల మీద రెట్టించిన ఉత్సాహంతో బాణప్రయోగం చేశాడు. ఇంద్రజిత్తు లంకకు వెళ్ళి రామలక్ష్మణులు మరణించారని రావణుడికి చెప్పగా



వాలితో యుద్ధం ప్రకటించిన రావణుణ్ణి, సంధ్యోపాసన చేస్తున్న అతడు అనాయాసంగా తన చంకలో ఇరికించుకొని కొన్ని వేల యోజనాలు ఆకాశంలోకి ఎగిరి నాలుగు సముద్రాలలో వరుసగా సంధ్యావందనం ఆచరించాడు. పరాభవంచెందిన రావణుడు వాలితోను మైత్రి ప్రకటించాడు. రామావతారానికి ముందు రావణుడి వృత్తాంతమిది.

## విభీషణ శరణాగతి – సముద్ర తరణం

రావణుడితో విభేదించిన విభీషణుడు రెండు గడియల్లో తన నలుగురు అనుచరులతో రామలక్ష్మణులున్న ప్రదేశంలో ఆకాశంలో నిలిచాడు. సుగ్రీవాది వానరులు వాళ్ళు శత్రువు గూఢచారులని చర్చిస్తున్నప్పుడు విభీషణుడు తన పరిచయం చేసుకొని రావణసభలో జరిగిన వృత్తాంతాన్ని తెలియజేసి రఘురాముణ్ణి శరణుకోరి వచ్చానన్నాడు.

వానర ప్రముఖులు చాలామంది ఇది రావణపన్నాగంగా భావించినా, హనుమంతుడు సుముఖత వ్యక్తం చేశాడు. రాముడు తాను ఆశ్రిత పక్షపాతినని చెప్పిన తర్వాత విభీషణుడు దిగివచ్చి రాముడి పాదాలపై మోకరిల్లాడు. మైత్రి సంభాషణ అనంతరం, రాముడు అడిగిన ప్రశ్నలకు రావణ సైన్యం గురించి, అతడి పరాక్రమం గురించి, వరాల గురించి విభీషణుడు తెలిపాడు. భావి లంకాధిపతిగా విభీషణుణ్ణి రాముడు ప్రకటించాడు.

విభీషణుడి సూచన మేరకు సముద్ర తరణానికి సముద్రుణ్ణి ప్రార్థించడానికి రాముడు నిర్ణయించాడు. శార్దూలుడనే రావణ గూఢచారి వానరసైన్యాన్ని చూసి రావణుడికి వానరబలం గురించి వివరించాడు. రావణుడు శుకుడనే రాక్షసుణ్ణి సుగ్రీవుడి వద్దకు దూతగా పంపాడు. “నా మిత్రుడైన వాలి తమ్ముడివి కనుక నువ్వు నాకు సోదర సమానుడివి. కనుక నా పక్షం చేర” మని రావణుడు చెప్పిన మాటల్ని శుకుడు సుగ్రీవుడికి తెలియజేశాడు. ఆగ్రహించిన వానరులు అతణ్ణి పట్టుకొని బాధిస్తుండగా శ్రీరాముడు “అతణ్ణి విడిచి పెట్టండి, దూతగా వచ్చిన వాణ్ణి వధించడం ధర్మం కాదు” అన్నాడు.

తర్వాత సముద్రతీరంలో దర్భాసనంపై శయనించిన రాముడు మూడు రాత్రులు సముద్రుణ్ణి ఉపాసించాడు. సముద్రుడు కరుణించకపోవడంతో కోపించిన రాముడు అతడిపై బ్రహ్మాస్త్రం సంధించాడు. సముద్రుడు ప్రత్యక్షమై “రామా! నీకూ, నీ సైన్యానికి దారి కల్పిస్తాను. జల జంతువులేవీ బాధించకుండా చూస్తాను” అన్నాడు. రాముడు అప్పుడు “బ్రహ్మాస్త్రం తిరుగులేనిది. దీన్ని ఎక్కడ ప్రయోగించాలి” అని అడిగాడు. సముద్రుడు ఇక్కడికి సమీపంలో ఉత్తరదిశలో ద్రుమకుల్యం అనే ప్రదేశం ఉంది. అక్కడ పాపాత్ములు, దోపిడీ దొంగలు నివసిస్తున్నారు. వాళ్ళపై ప్రయోగించమన్నాడు. ఆ బాణం తాకిడికి

పాతాళం వరకు గొయ్యి ఏర్పడి నీళ్ళు ఎగజిమ్మాయి. అది 'వ్రణకూపం' అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది.

"విశ్వకర్మ కుమారుడైన నలుడు సేతువు నిర్మించడంలో సమర్థుడు. అతడు నిర్మించే సేతువును నేను భరించగలను" అని చెప్పి సముద్రుడు అంతర్ధానం అయ్యాడు. పర్వతాకారులైన వానరులు పెద్ద పెద్ద వృక్షాలను, కొండ శిలలను ముక్కలు చేసి తీసుకొచ్చారు. మద్దిచెట్లు, ధవవృక్షాలు, వెదురు గడలు, అవిసెచెట్లు, తెల్ల మద్దిచెట్లు ఇలా లభ్యమైన సమస్త వృక్షసంపదను తీసుకువచ్చారు. నలుడు నిర్మాణకార్యం మొదలుపెట్టి తొలిరోజు పధ్నాలుగు యోజనాలు, రెండవరోజు ఇరవై యోజనాలు, మూడవరోజు ఇరవై ఒక్క యోజనాలు, నాల్గవరోజు ఇరవై రెండు యోజనాలు, అయిదవ రోజు మిగిలిన ఇరవైమూడు యోజనాల దూరం నిర్మించి సువేల పర్వతానికి చేరుకున్నారు.

## వానర సైన్యం

రాముడు అప్పుడు ఎదురైన శకునాల గురించి లక్ష్మణుడికి చెప్పాడు. లంకా నగరంపై త్వరగా దాడిచెయ్యాలని నిర్ణయించాడు. లంకాప్రవేశం తర్వాత రాముడి ఆదేశంతో శుకరాక్షసుణ్ణి వానరులు విడిచిపెట్టారు. శుకుడు రావణుడికి రాముడి వైశిష్ట్యాన్ని తెలియజేశాడు. వానరసైన్యం గురించి వివరించాడు.

వానర సైన్యం బలాల గురించి తెలుసుకోవడానికి రావణుడు మళ్ళీ తన మంత్రులైన శుకసారణుల్ని పంపాడు. వానర రూపాలతో ఉన్న వాళ్ళను విభీషణుడు గుర్తించి రాముడి వద్దకు తీసుకువెళ్ళాడు. రాముడు తన సందేశంగా "నీ బలాలతో సహా నువ్వు నన్ను శరణుగోరి, సీతను అప్పగించు, లేదా నిన్ను, నీ సైన్యంతోబాటు మట్టుపెట్టడం తథ్యం" అని రావణుడికి చెప్పమని చారులకు చెప్పాడు. వాళ్ళిద్దరినీ విడిచి పెట్టమని అనుచరుల్ని ఆదేశించాడు.

రావణుడు శుకసారణులతో తన భవనం మీదికి చేరి వానర సైన్యాన్ని చూస్తూ వాళ్ళ బలాలను తెలియజేయమని అడిగాడు. రామలక్ష్మణుల పరాక్రమాన్ని, వానర వీరుల అపారబలాన్ని, సంఖ్యాబలాన్ని కీర్తిస్తూ శుకసారణులు చెబుతుండగా రావణుడు వాళ్ళని మందలించాడు. రాముడి యుద్ధ ప్రయత్నాలు గురించి తెలుసుకురమ్మని రావణుడు గూఢచారుల్ని పంపాడు. వాళ్ళు మారువేషాలతో సువేల పర్వతం చేరి వానరసైన్యాన్ని, రామలక్ష్మణుల్ని, సుగ్రీవ విభీషణుల్ని చూశాడు. విభీషణుడు వాళ్ళని గుర్తించి వాళ్ళతో ముఖ్యుడైన శార్దూలుణ్ణి రాముడిముందు నిలిపాడు. రాముడు వాళ్ళని విడిచిపెట్టాడు. రావణుడికి ఈ చారులు కూడా రామసైన్యంయొక్క బలాన్ని వివరించారు.



## రావణుడి మాయోపాయం

చారులవల్ల విన్న వానరసైన్యబలం రావణుడిలో ఆందోళన కలిగించింది. వెంటనే మంత్రుల అత్యవసర సమావేశం ఏర్పాటుచేసి, కొంతసేపు చర్చించిన తర్వాత తన భవనానికి చేరాడు. మాయలమారి రావణుడు మాయావి అయిన విద్యుజ్జిహ్వుడితో (శూర్పణఖ భర్త కాదు) అశోకవన సమీపానికి వెళ్ళాడు. అతడితో శ్రీరాముడివంటి తలను, ధనుర్బాణాలు తీసుకురమ్మన్నాడు. రావణుడు సీతాదేవి వద్దకు వెళ్ళి "మా రాక్షస సైనికులు రాత్రివేళ వానర సైనికులు నిద్రించిన చోట చేరి అందరినీ వధించారు. ప్రహస్తుడు రాముడి శిరస్సును ఖండించాడు. లక్ష్మణుడు వానరులతో పారిపోయాడు. ఇతర ప్రముఖుల్ని సైతం పలురకాలుగా హింసించడం జరిగింది. ఇకనైనా నన్నాశ్రయించు" అని ప్రక్కనున్న రాక్షసితో – 'విద్యుజ్జిహ్వుడు రాముడి శిరస్సును, ధనుర్బాణాలను తీసుకువచ్చాడు అతణ్ణి తీసుకురా!' అని ఆజ్ఞాపించాడు.

విద్యుజ్జిహ్వుడు తీసుకొనివచ్చిన శిరస్సును, ధనుర్బాణాలను చూసి సీత విలపించింది. కైకను నిందించింది. తన్ను తాను నిందించుకుంది. రావణుడు అశోకవనం నుంచి వెళ్ళగానే శిరస్సు, ధనుర్బాణాలు అదృశ్యమయ్యాయి. సీతాదేవి దుఃఖాన్ని చూసి విభీషణుడి భార్య 'సరమ' అది మాయేనని ఓదార్చింది. రావణుడు యుద్ధసన్నాహానికై ఏర్పాటు చేసిన రహస్య సమావేశంలోని చర్చను విని సరమ సీతాదేవితో ఆ వివరాలు చెబుతుంది –

## సరమ ఓదార్పు

"సీతను అప్పగించను" అని రావణుడు చెప్పడం, వృద్ధమంత్రి అవిద్ధుడు 'సీతను అప్పగించడమే మేలని' పేర్కొనడం, రావణుడి మాతామహుడు మాల్యవంతుడు కూడా సీతను శ్రీరాముడికి అప్పగించటం ఉత్తమమని హితం చెప్పడం, రావణుడు వీటినన్నిటినీ తిరస్కరించి మాల్యవంతుణ్ణి మందలించటం, తర్వాత రావణుడు నగర రక్షణ ఏర్పాట్లు చేయడం – మొదలైన చర్యలన్నీ – రాముడు, ఆయన అనుచరులు క్షేమంగా ఉన్నారని తెలుస్తుంది" అని సరమ సీతకు దుఃఖోపశమనం గావించింది.

## అంగద – విభీషణుల సాహసం

విభీషణుడు తన సచివులద్వారా తెలుసుకున్న లంకానగర రక్షణ వ్యవస్థను రాముడికి చెప్పాడు. శ్రీరాముడు అందుకు తగినట్లు వ్యూహరచన చేశాడు. శ్రీరాముడు వానర సైన్యంలో సువేల పర్వతం మీదికి చేరి లంకానగర వైభవాన్ని తిలకించాడు. లంకానగర భవనంపై ఆసీనుడై ఉన్న రావణుణ్ణి చూడగానే సుగ్రీవుడు ఒక్క ఉదుటున ఎగిరి రావణుడి

రాముడు అనుమతించిన మీదట లక్ష్మణుడు విభీషణాది మహాయోధులతో నికుంభిలా చైత్యానికి వెళ్ళాడు. రాక్షస సైన్యంపై దాడి చేశాడు. హనుమంతుడు రాక్షస సేనల్ని హతమారుస్తుండగా లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై శరపరంపరల్ని కురిపించాడు. యజ్ఞం మధ్యలో ఇంద్రజిత్తు లక్ష్మణుడిపై బాణాలు విడిచాడు. భీకరంగా సాగిన లక్ష్మణ, ఇంద్రజిత్తుల సంగ్రామంలో ఇంద్రాస్త్రపూర్వకంగా లక్ష్మణుడు విడిచిన బాణం ఇంద్రజిత్తుని సంహరించింది. సమరరంగం నుంచి తిరిగి వచ్చిన లక్ష్మణుణ్ణి శ్రీరాముడు కౌగిలించుకొని ప్రశంసించాడు. సుషేణుడు లక్ష్మణ, విభీషణ, వానరయోధులకు వైద్యం చేసి స్వస్థత చేకూర్చాడు.

రావణుడు పుత్ర వియోగంతో అమిత శోకానికి లోనై, ఆ ఆవేశంతో సీతను చంపడానికి అశోకవనం వెళ్ళాడు. అనుచరులు వారిస్తున్నా వినక సీతాదేవి సమీపానికి వచ్చాడు. ఇంతలో రావణుడి మంత్రి, బుద్ధిశాలి, ఉత్తముడైన మహాపార్శ్వుడు రావణుడి ఘనకీర్తిని కొనియాడి ఆ కార్యం నుంచి విముఖుణ్ణి చేశాడు. రాముడిచేతిలో హతమైన రాక్షస యోధుల స్త్రీలు రావణుణ్ణి నిందిస్తూ ఆక్రందించారు.

రావణుడు యుద్ధానికి వెళ్తూ మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులకు తెలియజేయ మని రాక్షసుల్ని ఆదేశించాడు. (ఇంతకుముందు యుద్ధంలో మరణించిన మహోదర, మహాపార్శ్వులు రావణుని సోదరులు. వాళ్ళకి మత్తుడు, ప్రమత్తుడనే పేర్లూ ఉన్నాయి. ఇక్కడ పేర్కొనబడిన వాళ్ళు రావణ మంత్రులు).

## రామ – రావణయుద్ధం

రావణాసురుడి ధాటికి తట్టుకోలేక వానరయోధులు పారిపోతుండగా శ్రీరాముడు రణరంగంలో ప్రవేశించి విరూపాక్షుణ్ణి సంహరించాడు. మహోదరుడు సుగ్రీవుని చేతిలో హతుడయ్యాడు. మహాపార్శ్వుడిపై అంగద, జాంబవంతులు విజృంభించారు. అంగదుడి దెబ్బకు మహాపార్శ్వుడు నేలకొరిగాడు. వాళ్ళు ముగ్గురూ హతులు కాగా రావణుడు ఆగ్రహించి తామసాస్త్రాన్ని ప్రయోగించాడు. బ్రహ్మదేవుడు స్వయంగా నిర్మించిన ఆ అస్త్ర ప్రభావాన్ని తట్టుకోలేక వానరులు పలాయనం చిత్తగించారు. రాముడు రౌద్రాస్త్రాన్ని రావణుడు ఆసురాస్త్రాన్ని ప్రయోగించారు. రాముడు గాంధర్వాస్త్రాన్ని, రావణుడు సౌరాస్త్రాన్ని ప్రయోగించారు. రావణుడు ప్రయోగించిన శక్తి అనే బల్లెంవల్ల లక్ష్మణుడు గాయపడ్డాడు. రాముడు చండప్రచండంగా బాణప్రయోగం చెయ్యడంతో రావణుడు పీడింపబడి భయంతో పరుగులు తీశాడు.

సుషేణుడి సూచన మేరకు ఆంజనేయుడు మళ్ళీ ఓషధి పర్వతానికి చేరి గిరిశిఖరాన్ని పెళ్ళగించి తీసుకువచ్చాడు. తీవ్రగాయాలపాలైన లక్ష్మణుడికి ఆ ఓషధుల్ని బాగా నూరి



అతడు సంతోషించి ఇంద్రజిత్తును అభినందించాడు. రావణుడి ఆదేశంతో పుష్పక విమానంలో సీతను తీసుకువచ్చి యుద్ధరంగంలో అస్త్రబంధితులై నేలపై పడి ఉన్న రామ లక్ష్మణుల్ని రాక్షసులు చూపించారు. రామలక్ష్మణులు మరణించినట్లు భావించి సీత దుఃఖించింది. విభీషణుడి కుమార్తె త్రిజట సీతాదేవితో "నీ భర్త మరణించి ఉంటే వానర యోధుల ముఖాల్లో కోపోద్రేకాలు కాని, హర్షోత్సాహాలు కాని ఉండవు. అవి వానరుల ముఖాల్లో కన్పిస్తున్నాయి. అంతేకాక భర్త విహీన అయిన స్త్రీని ఈ దివ్య విమానం తీసికొని రాదు. కనుక రాముడు సజీవుడే" అని ఓదార్చింది.

శ్రీరాముడికి స్పృహవచ్చి మూర్ఛితుడై ఉన్న లక్ష్మణుణ్ణి చూసి దుఃఖించాడు. విభీషణాదులు రాముణ్ణి ఓదార్చటానికి ఉపక్రమించినప్పుడే గరుత్మంతుడు అక్కడికి వచ్చి, రామలక్ష్మణుల్ని దర్శించి వాళ్ళ ముఖాలను తన చేతులతో నిమిరాడు. అతడు తాకగానే గాయాలన్నీ మాయమయ్యాయి. శ్రీరాముడికి ప్రదక్షిణం చేసిన గరుత్మంతుడు ఆయన అనుమతితో ఆకాశానికి ఎగిరాడు.

వానరుల కోలాహల ధ్వనులు విని రావణుడు అదిరిపడ్డాడు. ఆ తర్వాత ధూమ్రాక్షుడు యుద్ధానికి బయలుదేరాడు. వానరులకు అపారనష్టం కలుగుతున్న దృశ్యం చూసి హనుమంతుడు రాక్షసుల్ని పెక్కుమందిని హతమార్చాడు. ధూమ్రాక్షుని ముండ్ల గద తన్ను తాకినా చలించక, గిరిశిఖరంలో ధూమ్రాక్షుణ్ణి హనుమంతుడు సంహరించాడు. వజ్రదంష్ట్రుడివల్ల కొందరు వానరులు, అంగదుడివల్ల కొందరు రాక్షసులు మరణించారు. అంగదుడు వజ్రదంష్ట్రుని చంపాడు.

అకంపనుణ్ణి హనుమంతుడు, ప్రహస్తుణ్ణి నీలుడు పరిమార్చారు. ఆ తర్వాత అకంపనుడు (ఇతడు రావణుడి పుత్రుడు), అతికాయుడు, మహోదరుడు, పిశాచుడు, త్రిశిరుడు, కుంభాసురుడు, నరాంతకుడు మొదలైన రాక్షస యోధులతోబాటు రావణుడు యుద్ధరంగంలోకి వచ్చాడు. లక్ష్మణ రావణ యుద్ధంలో రావణుడు ప్రయోగించిన 'శక్తి' కారణంగా లక్ష్మణుడు మూర్ఛిల్లాడు. కొంతసేపటికి తేరుకున్నాడు. శ్రీరాముడు ఆగ్రహంతో రావణుడితో యుద్ధానికి పూనుకున్నాడు. రావణుడి రథాన్ని, ధ్వజపతాకాలను, ఛత్రాన్ని, అశ్వాలను, రథచక్రాలను తన బాణాలతో తుత్తునియలు చేశాడు. శ్రీరామబాణాల ధాటికి కంపించిన రావణుడు తనచేతి నుండి ధనుస్సును జారవిడిచాడు. రాముడు అతడి కిరీటాన్ని ముక్కలు చేశాడు.

అలా నిశ్చేష్టుడైన రావణున్ని చూసి 'సేద తీర్చుకొని ధనుర్బాణాలతో మళ్ళీ యుద్ధానికి సిద్ధమైరా! నిన్నిప్పుడు వధించను' అని రాముడు దయతో పలికాడు.

రావణాసురుడు తన మందిరానికి వెళ్ళి అవమానభావంతో క్రుంగిపోయాడు. తర్వాత సింహాసనం మీద కూర్చొని తన అనుచర గణంతో నరుడిచేత తనకు చావు రాకూడదని బ్రహ్మను కోరకపోవడం గురించి, ఇతర శాపాల గురించి ప్రస్తావించాడు.

రావణుడు కుంభకర్ణుణ్ణి నిద్రలేపమని ఆదేశించాడు. అతణ్ణి నిద్రలేపటానికి భయంకర యుద్ధ సాధనాలను, గొప్ప ధ్వనుల్ని, ఏనుగుల్ని ప్రయోగించడం జరిగింది. అలా నిద్రలేచిన అతడికి అపారమైన భోజన పదార్థాలను (వివిధ మాంసాహారాలతో) సమకూర్చారు.

కుంభకర్ణుడివద్ద జరిగిన వృత్తాంతమంతా చెప్పి, అతడి బలపరాక్రమాలను పొగిడి, రావణుడు యుద్ధానికి ప్రేరేపించాడు. కుంభకర్ణుడు కూడా హితం పలికి సీతను రాముడికి అప్పగించమన్నాడు. రావణుడు కోపించి "పరాక్రమ గర్వంచేత నేను చేసిన తప్పుల్ని నీ సామర్థ్యంతో చక్కబెట్టు – అన్న ఆజ్ఞను శిరసావహించవలసిన నువ్వు అన్ననే శాసిస్తున్నావు" అని కఠినంగా పలికాడు. కుంభకర్ణుడు రావణుడికి బాసటగా యుద్ధం చేస్తానన్నాడు. కుంభకర్ణుడు పోరులో వానరులకు అపారనష్టం కలిగించాడు. శ్రీరాముడు అతడి బాహువులు, పాదాలు, శిరస్సుల్ని బాణాలతో తెగగొట్టగా కుంభకర్ణుడు మరణించాడు. కుంభకర్ణుడి మరణవార్తవిని విలపిస్తూ విభీషణుడి హితవచనాలను గుర్తుకు తెచ్చుకొని రావణుడు పశ్చాత్తాపం చెందాడు.

రావణుడి కుమారులైన త్రిశిరుడు, (ఖర, దూషణ, త్రిశిరులలోని వాడు కాక మరొకడు) దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు యుద్ధానికి వెళ్ళారు. వాళ్ళకు రక్షణగా మహాపార్శ్వుడు, మహోదరుడనే తన సోదరుల్ని రావణుడు పంపాడు. అంగదుడు నరాంతకుణ్ణి, హనుమంతుడు దేవాంతక, త్రిశిరులను, నీలుడు మహోదరుణ్ణి, ఋషభుడు మహాపార్శ్వుణ్ణి హతమార్చారు. లక్ష్మణుడు బ్రహ్మాస్త్రంతో అతికాయుణ్ణి సంహరించాడు.

రావణుడు పుత్రవియోగంతో దుఃఖిస్తుండగా ఇంద్రజిత్తు తండ్రిని ఓదార్చి యుద్ధరంగానికి వెళ్ళాడు. అంతర్హితుడై అతడు ప్రయోగిస్తున్న బాణపరంపరకు, బ్రహ్మాస్త్ర ప్రయోగానికి రాముడి సలహా మేరకు రామలక్ష్మణులు మూర్ఛిల్లినట్లు పడిపోయారు. ఇంద్రజిత్తు తన విజయాలను తండ్రికి తెలియజేశాడు. వాళ్ళ మూర్ఛతో వానరసైన్యమంతా మూర్ఛిల్లింది. నల, అంగద, సుగ్రీవ, జాంబవంతులు దిక్కుతోచని వాళ్ళయ్యారు. విభీషణుడు వాళ్ళని ఓదార్చి "బ్రహ్మాస్త్రాన్ని గౌరవించాలని రామలక్ష్మణులు ఇలా యుద్ధరంగంలో పడి ఉన్నారన్నాడు.

ఆ నాడు ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రం కారణంగా 67 కోట్లమంది వానరులు మరణించారు. జాంబవంతుడుకూడా గాయాలపాలై పడి ఉన్నాడు. హనుమంతుడి క్షేమం



తెలిసి సంతోషించిన జాంబవంతుడు "హిమాలయంలో స్వర్ణమయమై, అత్యున్నత మైన వృషభగిరి అనే పర్వతం, కైలాసగిరి శిఖరాలమధ్య ఓషధి పర్వతం ఉంది. ఆ శిఖరం మీద దివ్యత్వం కలిగిన మృతసంజీవని (మృతులను జీవింపజేసేది), విశల్యకరణి (ప్రాణం వచ్చిన తర్వాత సంచరించడానికి గాయాలను పోగొట్టేది), సంధానకరణి (గాయాలు మానిన వెంటనే చర్మాన్ని మచ్చలు లేకుండా యథాస్థితికి తీసుకువచ్చేది), సౌవర్ణ్యకరణి (తెగిన అవయవాలను అతికించేది) మొదలైన నాలుగు దివ్యౌషధుల్ని తీసుకొని త్వరగా వచ్చి, ఆ ఓషధుల ప్రభావంతో వానరుల్ని సజీవుల్ని చేసి స్వస్థత చేకూర్చు" అని హనుమంతుడితో చెప్పాడు.

హనుమంతుడు ఆ పర్వతానికి వెళ్ళి ఆ ఓషధులు అదృశ్యం కావడంతో ఎక్కడా కన్పించక కోపంతో పర్వతాన్ని సమూలంగా తీసుకువచ్చాడు. ఆ ఓషధుల వాసన తగిలి నంతనే రామలక్ష్మణులు గాయాలు మాని మునుపటిలా తేజోవంతులయ్యారు. వానరు లందరూ జీవించడమే కాక స్వస్థత పొందారు. హనుమంతుడు పర్వతాన్ని యథాస్థానంలో ఉంచి వచ్చాడు. సైన్యాల మధ్య సంకుల సమరం మళ్ళీ మొదలయ్యింది. కంపనుడు, అంగదుని చేతిలో, ద్వివిదుడివల్ల ప్రజంఘుడు, మైందుని ధాటికి యూపాక్షుడు, సుగ్రీవుని చేతిలో కుంభుడు, హనుమంతుడి దెబ్బకు నికుంభుడు మరణించారు. (కుంభ, నికుంభులు కుంభకర్ణుడి పుత్రులు) ఖరుడి పుత్రుడైన మకరాక్షుణ్ణి శ్రీరాముడు సంహరించాడు.

## ఇంద్రజిత్తు మాయ – వధ

ఇంద్రజిత్తు మాయాయుద్ధాన్ని రామలక్ష్మణులతో కొనసాగించాడు. మాయాసీతను సృష్టించి హనుమంతుడి ఎదుట చంపుతాడు. వానరులందరూ ఖిన్నులై వెనుదిరిగి పారిపోయారు. హనుమంతుడు వాళ్ళను వారించి, ప్రోత్సహించి మళ్ళీ యుద్ధోన్ముఖుల్ని గావించాడు. రాక్షస మూకల్ని తునుమాడి, సీతాదేవి వధ గురించి శ్రీరామ సుగ్రీవులకు చెప్పాలని వానర సైన్యంతో వెను తిరిగాడు. ఇంద్రజిత్తు ఇది గమనించి నికుంభిలా చైత్యానికి యజ్ఞకార్యాలు నిర్వహించటానికి వెళ్ళాడు.

సీత వధ గురించి విన్న శ్రీరాముడు శోకించాడు. లక్ష్మణుడు ధైర్యవచనాలు చెప్పాడు. అందరూ దుఃఖిస్తుండటం చూసి విభీషణుడు ఇది ఇంద్రజిత్తు మాయగా పేర్కొన్నాడు. ఇంద్రజిత్తు తలపెట్టిన నికుంభిలా హోమాన్ని ధ్వంసం చెయ్యటానికి లక్ష్మణుణ్ణి పంపమని రాముడికి విన్నవించాడు. "ఇంద్రజిత్తు బ్రహ్మ అనుగ్రహంతో 'బ్రహ్మశిరం' అనే అస్త్రాన్ని సారథి సంకల్పానుసారంగా వేగంగా వెళ్ళగల రథాశ్వాలను పొందాడు. అతడు హోమాన్ని ముగించి యుద్ధానికి వస్తే మొత్తం సైన్యం అంతా మరణించటం తథ్యం. అతణ్ణి వధిస్తే రావణుడూ అంతం అవుతా" దని విభీషణుడు రాముడితో అన్నాడు.

చేరదీశాడు. పరమశివుడు – "శ్రీమహావిష్ణువుగా ఇచ్చిన వాగ్దానం ప్రకారం పదకొండువేల సంవత్సరాలు రాజ్యపాలన చేసిన తర్వాతే అవతారం చాలించ"మని శ్రీరాముడితో చెప్పాడు. దశరథుడు స్వర్గంనుంచి వచ్చి సీతారామలక్ష్మణుల్ని ఆశీర్వదించి వెళ్ళాడు. శ్రీరాముడి కోరిక మేరకు మృతులైన వానర వీరుల నందరినీ శివుడు బ్రతికించాడు. కొంతకాలం లంకలో ఉండవలసిందని విభీషణుడు అర్థిస్తే – భరతుడి ప్రతిజ్ఞను గుర్తుచేసి తన ప్రయాణం తప్పనిసరి అని తెలిపాడు.

## అయోధ్యా ప్రయాణం

తర్వాత పుష్పక విమానంలో విభీషణ సుగ్రీవాదులతోబాటు అయోధ్యకు బయలు దేరాడు. పుష్పక విమానంపై పయనిస్తూ శ్రీరాముడు దారిలోని ప్రదేశాలను చూపుతూ వాటిని గురించి సీతాదేవికి వివరించసాగాడు.

దారిలో భరద్వాజ ఆశ్రమంలో దిగి శ్రీరాముడు ఆయన్ని పూజించి, ఆయన ద్వారా అయోధ్యావాసుల క్షేమసమాచారాలు తెలుసుకున్నాడు. శ్రీరాముడి ఆజ్ఞమేరకు హనుమంతుడు రాముడి ఆగమన విషయం గుహుడికి, భరతుడికి తెలియజేశాడు. వాళ్ళు పరమానంద భరితులయ్యారు.

సీతారామలక్ష్మణాదులతో పుష్పకవిమానం నందిగ్రామం చేరింది. పుష్యమీ నక్షత్ర యుక్త శుభదినంలో రాముడు అక్కడికి చేరుకున్నాడు. రాముణ్ణి విమానంలో చూడగానే భరతుడు వినయంగా నమస్కరించాడు. విమానం దిగిన రాముడు భరతుణ్ణి గాఢంగా హత్తుకున్నాడు. భరతుడు రాముడికి సాయపడిన వానర వీరులందరినీ, విభీషణుణ్ణి కౌగిలించుకొని తన ప్రేమాభిమానాలను తెలియజేశాడు. శ్రీరాముడు వసిష్ఠుడికి పాదాభి వందనం చేశాడు. వానరులు రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల పరస్పర అనురాగం చూసి ఆశ్చర్యంతో ఆనందబాష్పాలు రాల్చారు.

## శ్రీరామపట్టాభిషేకం

శ్రీరాముడు – మహర్షులు, దేవతలతో కూడి అయోధ్యానగర ప్రవేశం చేశాడు. భరతుడు సుగ్రీవుడితో "ప్రభూ! శ్రీరాముడి పట్టాభిషేకం కోసం జలాలు తీసుకురావడానికి నీ దూతల్ని ఆజ్ఞాపించు" అని కోరాడు. నాలుగు సముద్రాలనుంచి, అయిదువందల నదుల నుంచి పవిత్ర జలాలను వానరులు తీసుకువచ్చారు. వసిష్ఠుడు ఋత్విజులైన బ్రాహ్మణులతో కూడి సీతాసహితుడైన శ్రీరామచంద్రుణ్ణి రత్నసింహాసనంమీద ఆసీనుణ్ణి చేశాడు. వేదమంత్రపూర్వకంగా అభిషేకం జరిగింది. దేవతలు, గంధర్వులు, కిన్నర పురుషులు, నలుగురు దిక్పాలురచేత, దేవతలచేత వివిధ రకాల ఓషధీ రసాలతో సీతారాముల్ని అభిషిక్తుణ్ణి చేశారు.



ముక్కుమీద ఉంచిన వెంటనే గాయాలు పూర్తిగా మానాయి. శ్రీరాముడు ధనుస్సును చేతబట్టి భయంకర శరాలు సంధించి రావణుడిపై ప్రయోగించాడు. అంతకుముందు నుగ్గయిన రథం నుంచి మరో రథాన్ని రావణుడు అధిరోహించాడు. రాముడు భూమిపై నుంచి, రావణుడు రథం అధిరోహించి యుద్ధం చెయ్యడం చూసి, ఇంద్రుడు తన రథాన్ని తీసుకువెళ్ళి రాముడికి అప్పగించవలసిందని రథసారథి మాతలిని ఆదేశించాడు. దివ్యమైన మహాధనువును, కవచాన్ని, శరాలను, శక్తిని కూడా సమర్పించాడు.

మాతలి సారథ్యంలోని రథాన్ని అధిరోహించిన రాముడికి, రావణుడికి మధ్య భీకర సమరం కొనసాగింది. రావణుడు గాంధర్వాస్త్రాన్ని ప్రయోగిస్తే, రాముడు గాంధర్వాస్త్రాన్ని, దివ్యాస్త్రం ప్రయోగిస్తే దివ్యాస్త్రాన్ని ప్రయోగించి భగ్నం చేశాడు. రావణుడు రాక్షసాస్త్రాలను ప్రయోగించాడు. అది మహాసర్పాల రూపంలో రాముడిపైకి రాసాగింది. రాముడు గారుడాస్త్రాన్ని ప్రయోగించాడు. రావణుడు ప్రయోగించిన శూలాన్ని రాముడు ఇంద్రుడిచ్చిన శక్తితో వమ్ము చేశాడు. రావణుడి అస్త్రాలన్నీ వ్యర్థం కావడంతో అతడు చింతాక్రాంతుడయ్యాడు. రామబాణాలకు తీవ్రగాయాలై అలసిన రావణుణ్ణి సేదతీర్చడానికి అతడి సారథి రథాన్ని మరోవైపుకు మళ్ళించాడు. అలా రథాన్ని మళ్ళించిన సారథిని రావణుడు తీవ్రంగా మందలించాడు. సారథి సముచితంగా అనునయించి అతణ్ణి సంతృప్తి పరచి కొంతసేపటికి రాముడి ముందు రథాన్ని నిలిపాడు.

ఆ సమయంలో రాముడు యుద్ధంచేసిన అలసటతో కొంత చింతాక్రాంతు డయ్యాడు. రామ రావణ యుద్ధాన్ని వీక్షించడానికి వచ్చిన దేవతలతోబాటు ఉన్న అగస్త్య మహర్షి శ్రీరామచంద్రుణ్ణి సమీపించి ఆయనకు ఆదిత్యహృదయ స్తోత్రాన్ని ఉపదేశించాడు. "పరమ పవిత్రమైన ఆదిత్య స్తోత్రం సమస్త శత్రువుల్ని నశింపజేసేది, నిత్యమూ దీన్ని జపిస్తే సర్వత్రా విజయం లభిస్తుంది. సత్ఫలాలను అక్షయంగా (క్షయం లేకుండా) ప్రసాదిస్తుంది. పాపాలను నశింపజేసి అధివ్యాధుల్ని తొలగించి, ఆయుష్షును వృద్ధి పరుస్తుంది. ఏకాగ్రచిత్తంతో సూర్యభగవానుణ్ణి పూజించి ఆదిత్య హృదయాన్ని మూడుసార్లు జపిస్తే నువ్వు ఈ మహాసంగ్రామంలో విజయం సాధిస్తావు" అని అగస్త్య మహర్షి యథా స్థానానికి చేరుకున్నాడు. రాముడు మహర్షి చెప్పినట్లు ఆచరించి నూతనోత్తేజాన్ని పొందాడు.

రామరావణ యుద్ధం మళ్ళీ కొనసాగింది. రాక్షస పతనాన్ని సూచిస్తూ శకునాలు గోచరించాయి. ఆ యుద్ధం అందరికీ భీతావహమయింది. ఈ సమయంలో వాల్మీకి రామరావణ యుద్ధాన్ని ఇలా వర్ణించాడు.

*శ్లో॥ గగనం గగనాకారం సాగరః సాగరోపమః॥*
*రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ॥*

ఆకాశానికి ఆకాశమే సాటి. మహాసముద్రానికి మహాసముద్రమే సాటి. అలాగే రామరావణ యుద్ధానికి సమానమైనది రామరావణ యుద్ధమే. (ఒకే వస్తువు ఉపమాన ఉపమేయ ధర్మాలను పేర్కొంటే దాన్ని అనన్వయాలంకారం అంటారు).

రాముడు తీక్షణమైన బాణాన్ని సంధించి రావణుడి శిరస్సును ఖండించాడు. ఆ శిరస్సు భూమిపై పడిన వెంటనే అటువంటిదే మరొక శిరస్సు మొలిచింది. దాన్నీ రాముడు ఖండించాడు. ఆ శిరస్సు కూడా అలాగే మొలకెత్తింది. దాన్ని ముక్కలు చేసినా మరొక శిరస్సు ఆవిర్భవించింది. ఇలా వందలాది శిరస్సుల్ని రాముడు ఖండించినా అవి వెంట వెంటనే మొలకెత్తడంతో రావణుడు మరణించలేదు.

రాముడికి ఈ పరిస్థితి అంతుపట్టలేదు. 'ఇంతవరకు జరిగిన అన్ని యుద్ధాలలోను, రాక్షస సంహారాలలోను ప్రయోగించిన అస్త్రాలు ఇప్పుడు పనిచెయ్యక పోవడానికి కారణం ఏమిటి?' అని విచారించాడు. ఈ పోరాటం అవిశ్రాంతంగా అహోరాత్రులు కొనసాగింది. 'సర్వరాత్రమ్ అవర్తత' (సర్గ 110-37) అని ఉన్నచోట సప్తరాత్రమ్ అవర్తత అని పాఠాంతరం పరిగణించి ఏడురోజులపాటు యుద్ధం కొనసాగిందని పేర్కొనడం కద్దు.

మాతలి సూచన మేరకు బ్రహ్మాస్త్రాన్ని (బ్రహ్మ ఇంద్రుడికోసం నిర్మించాడు. ఇంద్రుడు అగస్త్యుడికి, ఆయన శ్రీరాముడికి ఇచ్చాడు) రాముడు ప్రయోగించాడు. అది రావణుడి ప్రాణాలు హరించి, భూమిలోకి ప్రవేశించి, ఆ వెనువెంటనే వినయంగల సేవకుడిలా శ్రీరాముడి తూణీరంలోకి చేరుకుంది. దేవతల దుందుభులు అంతరిక్షం నుంచి మోగింది. సువాసనలతో కూడిన వాయువులు హాయిని కల్పించాయి. రాముడిపై పుష్పవృష్టి కురిసింది.

### రావణుడి అంత్యక్రియలు-ఆత్మీయులశోకం

సోదరుడి మరణానికి దుఃఖిస్తున్న విభీషణుణ్ణి ఓదార్చి "పారమార్థిక బుద్ధిని నిలుపుకొని శోకాన్ని విడిచి, అనంతర కర్తవ్యానికి పూనుకొమ్మ"ని రాముడు "మరణాంతాని వైరాణి" (114-101) అనే ఆర్యోక్తిని అనుసరించి (వ్యక్తి మరణించేవరకే శత్రుత్వం) అంత్యక్రియల్ని జరిపించ" మని చెప్పాడు.

అంతఃపుర స్త్రీలు రావణుడి మరణవార్త విని యుద్ధభూమికి వచ్చి అతడి కళేబరంపై పడి విలపించారు. పతి వియోగంతో మండోదరి పలువిధాలుగా దుఃఖించింది. శ్రీరాముడి ఆదేశానుసారం విభీషణుడు సోదరుడికి దహన సంస్కారాలు నిర్వర్తించాడు.

## సీతాదేవి అగ్నిప్రవేశం

శ్రీరాముడు ఆదేశించడంతో లక్ష్మణుడు విభీషణుణ్ణి లంకా సింహాసనంలో అధిష్ఠింప జేశాడు. తమ విజయవార్త తెలియజేయమని శ్రీరాముడు హనుమంతుణ్ణి ఆజ్ఞాపించాడు.

శ్రీరాముడి విజయవార్త తెలిసి సీతాదేవి సంతోషించింది. ఆమెను ఇంతవరకు బాధించిన రాక్షసస్త్రీలను చంపటానికి అనుజ్ఞ ఇవ్వమని హనుమంతుడు సీతను ప్రార్థించాడు. కాని ఆమె అది యుక్తం కాదని నివారించింది. 'శ్రీరాముణ్ణి సందర్శిస్తాను' అని ఆమె చెప్పగా హనుమంతుడు రాముడి వద్దకు వెళ్ళి సీతాదేవి సందేశాన్ని విన్పించాడు. రాముడి ఆజ్ఞమేరకు విభీషణుడు సీతాదేవిని పల్లకీలో తీసుకువచ్చాడు. వైదేహిని చూడటానికి వీలుగా రాముడు ఆమెను తన కడకు కాలినడకతో రప్పించాడు. రాముణ్ణి చూసి ఆమె ఆనందించింది.



రావణుణ్ణి వధించి సీతాదేవికి చెరవిముక్తి కలిగించడంలో తన కర్తవ్యం పూర్తయిందని, ఆమెను చేరదీయటానికి కాదని, రాముడు లోకాపవాదానికి జంకి సీతతో పరుషంగా పేర్కొన్నాడు. దశదిశలలో ఆమెను ఇష్టమున్న చోటికి వెళ్ళవచ్చునన్నాడు. సద్వంశంలో జన్మించినవాడు పరుల ఇంట ఉండివచ్చిన స్త్రీపై ఏవిధంగా మక్కువ చూపగలడని ప్రశ్నించాడు.

శ్రీరాముడి పరుషవచనాలకు సీతాదేవి ఖిన్నురాలై, కొంత ఆవేశంతో సమాధానం ఘాటుగా ఇచ్చింది. "నిమ్నశ్రేణికి చెందిన వ్యక్తి నిమ్నస్థాయి స్త్రీతో మాట్లాడినట్లు పరుషంగా పలుకుతున్నావు. నా గతచరిత్ర చూసి అయినా నువ్వు ఈ సందేహాన్ని విడవటం సమంజసం. హనుమంతుడు నన్ను గురించి చెప్పినప్పుడే పరిత్యజించి ఉండాల్సింది. నేను ప్రాణత్యాగం చేసేదాన్ని. ఇంతటి శ్రమ నీకు తప్పేది. కోపంతో సామాన్యుడివలె నా శీల స్వభావాలను విస్మరించావు"!

లక్ష్మణుడితో - "సౌమిత్రీ! మిథ్యాపవాదానికి గురైన నేను ఇక జీవించాలని భావించడం లేదు. నాకోసం చితి పేర్చు" అంది. లక్ష్మణుడు దీనంగా రాముడివైపు చూశాడు. శ్రీరాముడి వైఖరిని బట్టి అతడి ఆంతర్యాన్ని గ్రహించి, తర్వాత అభిమతాన్ని అనుసరించి చితిని సిద్ధపరిచాడు.

సీత ప్రజ్వలిస్తున్న అగ్ని సమీపానికి వెళ్ళి ప్రణమిల్లి ఇలా పలికింది -

"నా హృదయం ఒక్క క్షణమైనా శ్రీరాముడికి దూరంకాక నిరంతరం ఆయన మీదే లగ్నమై ఉంటే, లోక సాక్షి అయిన అగ్నిదేవుడు నన్ను కాపాడుగాక!, నా ప్రవర్తన దోషరహితం, పవిత్రమూ అయితే, నా పతి నిరాధారమైన నింద నాపై మోపి ఉంటే అగ్ని దేవుడు నన్ను రక్షించుగాక!, త్రికరణశుద్ధితో సమస్త విషయాలలోను సర్వధర్మజ్ఞుడైన రాఘవుణ్ణి అనుసరించి ఉంటే అగ్నిదేవుడు రక్షించుగాక!" - అని అగ్నిదేవుడికి ప్రదక్షిణం చేసి అగ్నిలోకి ప్రవేశించింది. వానర రాక్షసులు హాహాకారాలు చేశారు.

అప్పుడు బ్రహ్మాది దేవతలు సాక్షాత్కరించారు. రాముడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువని కీర్తించారు. అగ్నిదేవుడు సీతాదేవిని తీసుకొనివచ్చి ఆమె పాతివ్రత్య వైభవాన్ని వెల్లడించి, ఈ సాధ్విని స్వీకరించమని చెప్పాడు. శ్రీరాముడు సీతాదేవి పట్ల తన విశ్వాసాన్ని ప్రకటించి

విదర్భ, వంగ, కళింగ, కౌశిక, ఆంధ్ర, చోళ, కేరళ, పాండ్య, బాహ్లిక, సురాష్ట్ర, భీమ, శూర, మద్ర, కురు, కాంభోజ, విహార, ఉత్తరకురు దేశాలున్నాయి. వీటితోబాటు మ్లేచ్ఛ, పులింద, యవన, అరట్టక, టంకణ, చీనా, పరమచీనా దేశాలు పేర్కొనబడ్డాయి.

కోసల, మిథిల, కిష్కింధ, కేకయ, లంకాదేశాలు ప్రధానమైనవి. కోసల, కిష్కింధ, లంకా దేశాలు అగ్రరాజ్యాలు. కోసల, మిథిల, కేకయ రాజ్యాల మధ్య కైక దశరథుల, సీతారాముల కళ్యాణాల సత్సంబంధాలు ఉండేవి. కిష్కింధ వాలి బ్రతికున్నంత కాలం లంకకు మిత్రదేశం. సుగ్రీవుడు రాముడికి ఆత్మీయుడైన తర్వాత కోసల దేశానికి మిత్ర రాజ్యమయింది. రావణవధానంతరం లంకకూడా విభీషణుడి కారణంగా మిత్రదేశ మయింది.

## చతురంగ బలాలు

రథ, గజ, తురగ, పదాతులు చతురంగాలు. భరతుడు శ్రీరాముణ్ణి అయోధ్యకు తీసుకురావటానికి వెళ్ళినప్పుడు రథాలతో, తొమ్మిది వేల ఏనుగులతో లక్షమంది ఆశ్వికులతో వెళ్ళినట్లు రామాయణంలో ఉంది. (అయోధ్యా. 83-1 నుండి 5) అంతకు ముందు దశరథుడు శ్రీ సీతారాముల వివాహానికి మిథిలా నగరానికి చతురంగ బలాలతో వెళ్ళినట్లు ఉంది. (బాల.69-6). వివాహానంతరం జనకుడు కూడా ఏనుగుల్ని, మేలుజాతి గుర్రాలను, అందమైన రథాలను, వీరులైన యోధుల్ని అరణంగా సీతారాముల వెంట పంపాడు. (బాల.74.5.7) కేకయరాజులు అశ్వపతులుగా సుప్రసిద్ధులు.

లంకారాజ్యంలోను చతురంగ బలాలున్నాయి. కిష్కింధలో అటువంటి వ్యవస్థ కన్పించదు. వానరులు సునాయాసంగా ఒక కొండమీదినుంచి మరొక కొండవైపుకు గెంతగలరు. వాలి చతుస్సముద్రాలను ప్రతిరోజూ చుట్టిరాగలడు. హనుమంతుడు నూరు యోజనాల సముద్రాన్ని అవలీలగా దాటాడు. ఇటువంటి వానరులు చాలామంది కిష్కింధలో ఉన్నారు.

రథసారథులుగా రామాయణంలో ముగ్గురు పేర్లు ప్రస్తావింపబడ్డాయి. సుమంత్రుడు మంత్రియేకాక రామ, దశరథులకు సారథిగా వ్యవహరించాడు. కాలకేతుడు రావణుడికి ఇంద్రుడికి మాతలి రథసారథులుగా ఉన్నారు. మాతలి రామరావణయుద్ధంలో సారధిగా మెలిగాడు. ఇంద్రజిత్తు తానే రథం నడుపుతూ సమరం చెయ్యగల సమర్థత కలవాడు. వీరులతో అతిరథ, మహారథుల ప్రస్తావన కన్పిస్తుంది. భారతంలో ఉన్నట్లు రామాయణంలో ఈ వ్యవస్థ స్పష్టమైన రూపురేఖలు దాల్చినట్లు కన్పించదు. 'అక్షౌహిణి' ప్రస్తావన సైన్య పరంగా ఉంది.

ప్రసిద్ధంగా మూడు ఏనుగుల పేర్లు ప్రస్తావనకు వచ్చాయి. అవి దేవేంద్రుడి ఐరావతం, కుబేరుడి సార్వభౌమం, అయోధ్యలోని శత్రుంజయం.



బ్రహ్మదేవుడు మనువుకు రత్నఖచితమైన, కాంతుల్ని విరజిమ్ముతున్న కిరీటాన్ని నిర్మించి ఇచ్చి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. మనువంశంలో రాజులందరూ ఆ కిరీటాన్నే ధరించారు. శ్రీరాముణ్ణి ఆ కిరీటంతో, భూషణాలతో అలంకరించారు. శత్రుఘ్నుడు శుభప్రదమైన తెల్లటి ఛత్రాన్ని పట్టుకున్నాడు. విభీషణ, సుగ్రీవులు వింజామరలతో సేవించారు. దేవేంద్రుడి తరఫున వాయుదేవుడు ముత్యాలహారం ఇచ్చాడు.

రాముడు బ్రాహ్మణోత్తములకు లక్షలాది సంఖ్యలో గుర్రాలను, పాడి ఆవుల్ని, వందలాది వృషభాల్ని దానం చేశాడు. రాముడు సుగ్రీవుడికి బంగారు హారాన్ని, అంగదుడికి భుజకీర్తుల్ని బహూకరించాడు. మేలైన మణులతో కూడిన ముత్యాలహారాన్ని, సీతాదేవికి ఇచ్చిన చక్కటి ఆభరణాలను హనుమంతుడికి కానుకలుగా ఇచ్చాడు. జానకి తన మెడలోని కంఠాభరణాన్ని అతడికే ఇచ్చింది. ప్రతి వానర వీరుణ్ణీ బహుమతులతో సీతారాములు సత్కరించారు. తర్వాత శ్రీరాముడు లక్ష్మణుణ్ణి యువరాజ పదవిని స్వీకరించమని ఎంత చెప్పినా అతడు అంగీకరించలేదు. భరతుడు యువరాజయ్యాడు. పౌండరీకం, అశ్వమేధం, వాజపేయాది యాగాలు రాముడు నిర్వహించాడు.

## సత్పరిపాలన

రామరాజ్యంలో స్త్రీలకు వైధవ్యం లేదు. క్రూరమృగాల బాధలేదు. రోగగ్రస్తులు లేరు. దొంగల భయం లేదు. పెద్దలు బ్రతికి ఉండగా పిల్లలు మృత్యువుపాలయ్యేవారు కారు. ప్రజలందరూ ధర్మనిరతులుగా, సంతోషంగా జీవించారు. దీర్ఘాయుష్మంతోను, సంతాన సమృద్ధితోను జీవితం కొనసాగించారు. రాజ్యంలో ఎవరి నోట విన్నా రామనామం, రామ గాథలే విన్పించేవి. జగమంతా రామమయమయింది.

వృక్షాలన్నీ లావైన బోదెలతో విలసిల్లేది. నిత్యం పుష్పిస్తూ, ఫలిస్తూ కనువిందు చేసేవి. సకాలంలో వర్షాలు కురిసేవి. బ్రాహ్మణాది అన్ని వర్ణాల వాళ్ళు దురాశలేని వాళ్ళయి తమ తమ విధ్యుక్త కర్మలను నిర్వర్తిస్తూ సంతోషంగా ఉండేవాళ్ళు. రామరాజ్యంలోని ప్రజలందరూ శుభలక్షణాలతో ఎల్లప్పుడూ సత్యాన్నే పలికేవాళ్ళు.

## ఫలశ్రుతి

వాల్మీకి రచించిన ఆదికావ్యమైన శ్రీమద్రామాయణం శుభప్రదమైన గ్రంథరాజం. రామాయణ పఠనం ఆయురారోగ్యాలు, కీర్తిప్రతిష్ఠల్ని పెంపొందిస్తుంది. పఠించిన వాళ్ళు, విన్నవాళ్ళు సమస్త పాపాలనుంచి విముక్తులవుతారు. రామపట్టాభిషేక ఘట్టాన్ని విన్నవాళ్ళు సంతానాన్ని, సంపదల్ని పొందుతారు. దీర్ఘాయుష్మ కలవాళ్ళవుతారు. శ్రద్ధగా ఆలకించిన వాళ్ళు, కోపం జయించిన వాళ్ళయి, దారిద్ర్యం నుంచి విముక్తులవుతారు. అన్ని కోరికలు నెరవేరుతాయి.

శ్రీరాముడు సాక్షాత్తు సనాతుడైన శ్రీమహావిష్ణువుయొక్క అవతారమే. కనుక రామాయణాన్ని సంపూర్ణంగా విన్న వాళ్లకు, పఠించిన వాళ్ళకు రామానుగ్రహం సిద్ధిస్తుంది. శ్రీరాముడు శ్రీమన్నారాయణుడే. లక్ష్మణుడు ఆదిశేషుని అవతారం. రామాయణ శ్రవణం వల్ల కుటుంబవృద్ధి, ధనధాన్యసమృద్ధి కలుగుతాయి. స్త్రీలకు ఉత్తమ సుఖాలు ప్రాప్తిస్తాయి.

ఇందులోని దివ్యగాథల్ని వింటే దేవతలు, పితృదేవతలు తృప్తి చెందుతారు. వాల్మీకి మహర్షి రచించిన రామాయణ సంహితను భక్తితో వ్రాసిన వాళ్ళు తప్పక స్వర్గసుఖాలు పొందుతారు.

## విశేషాలు – విశ్లేషణ

శ్రీమద్రామాయణంలో యుద్ధకాండ పెద్దది. **ఇందులో 131 సర్గలు, 5802 శ్లోకాలు ఉన్నాయి.**

రావణుడు మహావీరుడు, తపస్సంపన్నుడు. అయినా అహంకారి. కుత్సితబుద్ధి కలవాడు, కాముకుడు, ధర్మాధర్మాలను విస్మరించి ప్రవర్తించేవాడు. తనకంటె బలవంతులైన వాలి, కార్తవీర్యార్జునులతో స్నేహం చేసుకున్నాడు. నివాతకవచాది దైత్యులతోనూ స్నేహం చేసి కొన్ని విద్యలు గ్రహించాడు. తనకంటె మించిన వీరులున్నారు అని గ్రహించిన తర్వాత కూడా అతడి అహంకారం తగ్గలేదు.

కుబేరుడు పంపిన దూతను సంహరించాడు. దూతను శిక్షించకూడదన్న నియమం ఉన్నా, ఏ తప్పుచెయ్యని ఆ దూతను చంపాడు. వావి వరుసలు మరిచి రంభను బలాత్కరించాడు. 'పుంజికస్థల' వంటి పలువురి స్త్రీల మానభంగకారకుడయ్యాడు. సీతవద్ద రాముడు మరణించినట్లు తొలిసారి అశోకవనంలో, తర్వాత సమర భూమితో భ్రమకల్పించి, వంచనతో లోబరచుకోవాలని ప్రయత్నించాడు.

రావణుడి చర్యలు సర్వవిధాలుగా అధర్మంగానే కొనసాగాయి. రాముడు తద్భిన్నంగా సహచరులపట్ల, పరస్త్రీలపట్ల, ఆశ్రితులపట్ల, సమరంలోను, తుదకు శత్రువులపట్ల కూడా ఉదారంగా ప్రవర్తించాడు. ఆయా ధర్మాలను సంపూర్ణంగా పాటించి ఆదర్శంగా నిలిచాడు. తమ్ముడికి కష్టం కలిగినప్పుడు అతడికంటె ఏదీ ముఖ్యంకాదని భావించాడు. శివుడు వరం కోరుకొమ్మంటే తన అనుచరుల్ని బ్రతికించమన్నాడు. రావణుడికి సైతం యుద్ధరంగంలో అవకాశం ఇచ్చాడు. సంపూర్ణ నాయక లక్షణాలను ప్రదర్శించాడు.

రామపట్టాభిషేకానంతరం లక్ష్మణుడికి యువరాజ పట్టాభిషేకం చెయ్యాలని రాముడు సంకల్పించినప్పుడు లక్ష్మణుడు తృణీకరించాడు. వయస్సురీత్యా పెద్దవాడు, 14 సంవత్సరాల పాలనానుభవం ఉన్న భరతుడికి కాక లక్ష్మణుడికి ఆ పదవిని ఇవ్వాలను కోవటంలో రాముడి కృతజ్ఞతాభావం వ్యక్తమవుతుంది. లక్ష్మణుడు దాన్ని సున్నితంగా



తిరస్కరించి, తన సేవా ధర్మాన్ని నిస్వార్థంగానే పాటించాడని తెలియజేశాడు. లక్ష్మణుడి త్యాగ నిరతి అసామాన్యం.

భరతుడు 14 ఏళ్ళపాటు రాజుగా వ్యవహరించినా, నిర్లిప్తంగా రామపాదుకల సాక్షిగా, రాముడి ప్రతినిధిగానే వ్యవహరించాడు. పైగా రామలక్ష్మణుల వలెనే తన జీవితాన్ని గడిపాడు. దేశ ఆదాయాన్ని 10 రెట్లు వృద్ధిచేసి రాముడికి అప్పగించాడు. రాముడు సైతం హనుమంతుడితో తన రాకను ముందుగా భరతుడికి తెలియజెయ్యమని చెబుతూ, అప్పుడు భరతుడి ముఖకవళికల్ని గమనించమన్నాడు. 14 ఏళ్ళలో భరతుడికి రాజ్యం మీద మోహం కలిగి ఉండే అవకాశం ఉందేమో నన్నది రాముడి భావన. పాలనాదక్షుడిగా వాటినన్నింటినీ నిశితంగా పరిశీలించవలసి ఉన్నా, భరతుడి త్యాగం ముందు రాముడు అలా అనడం కూడా తప్పేమోననిపిస్తుంది. భరతుడు ప్రదర్శించిన వినయ విధేయతలు, త్యాగం, అనన్యసామాన్యం.

రామాయణంలో ఎక్కడా పెద్దగా ప్రస్తావింపబడకపోయినా, అసలు ప్రస్తావనే లేకపోయినా శత్రుఘ్నుడి సౌశీల్యం మరియు భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల భార్యల గుణగణాలు ప్రశంసనీయం. వాల్మీకి రామాయణం ద్వారా వాళ్ళ గుణగణాలు తెలియకపోయినా, ఆ పత్నుల ఔదార్యం లేకపోతే ఈ పతులకు ఖ్యాతి దక్కే అవకాశం లేదు కదా!

రావణ గూఢచారి సారణుడు గణిత శాస్త్రజ్ఞుల సంఖ్యా ప్రమాణాలను గురించి వివరించాడు. ఇది వానరసైన్య సంఖ్యను గురించి చెప్పిన లెక్క. ఆ సంఖ్య సైన్యపరంగా నమ్మలేనంతగా అన్పించినా, నాటి భారతీయ సంఖ్యామానం గురించి తెలుసుకునే అవకాశం కల్పిస్తుంది.

*నూరులక్షలు ఒక కోటి – లక్ష కోట్లు ఒక శంఖం – లక్ష శంఖాలు ఒక మహాశంఖం – లక్ష మహా శంఖాలు ఒక బృందం – లక్ష బృందాలు ఒక మహా బృందం – లక్ష మహా బృందాలు ఒక పద్మం – లక్ష పద్మాలు ఒక మహా పద్మం – లక్ష మహా పద్మాలు ఒక ఖర్వం – లక్ష ఖర్వాలు ఒక మహా ఖర్వం – లక్ష మహా ఖర్వాలు ఒక సముద్రం – లక్ష సముద్రాలు ఒక ఓఘం – లక్ష ఓఘాలు ఒక మహా ఓఘం –*

ఈ విధంగా వెయ్యికోట్లు, నూరుశంఖాలు, వెయ్యి మహాశంఖాలు, వంద బృందాలు ..... ఇలా మహా ఓఘాల వరకు చెబుతూ అంతమంది వానరులున్నారని చారుడు చెప్పాడు. ఇది మితిమించి అతిశయోక్తి.

## రామాయణ కాలం నాటి దేశాలు

వాల్మీకి కాలం నాడు కాశి, కోసల, మగధ, పుండ్ర, అంగ, దశార్ణ, అవంతి,

### రామబాణం

తిరుగులేనిది,ఎదురులేనిది అనే అర్థంలో వాడే మాట. **రామబాణం** లక్ష్యాన్ని తప్పక ఛేదించినట్లే, వ్యక్తి మాటమీద నిలబడి తప్పక పాటించే సందర్భంలో వాడటం జరుగుతుంది.

### రామాయ స్వస్తి

రాముడికి మేలు కలగాలి అని అర్థం. ఈ మాట ఎక్కువగా కోర్టు వ్యవహారాలలో విన్పించేది. దీనితోపాటు 'రావణాయస్వస్తి' అనే మాటకూడ విన్పిస్తుంది. ఉభయులకూ మేలు జరగాలని 'తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ' అనే చందంలో వ్యవహరించడం ఎటూ తేల్చక నానుస్తూ, దొంగసాక్ష్యమో, తప్పుడు సాక్ష్యమో చెప్పేవాళ్ళని **'రామాయస్వస్తిగాడు'** అని హేళనగా మాట్లాడటం కూడా ఉంది.

### రామదండు

రామరావణయుద్ధంలో రాముడికి సాటిలేని తోడ్పాటును అందజేసిన దండు (వానర సేన) **రామదండు.** రామకార్యమనే పవిత్రకర్తవ్యం నెరవేర్చి భీకర యుద్ధం కొనసాగించి, మాయలు, మంత్రాలు నేర్చిన రాక్షసుల్ని తుదముట్టించిన 'దండు' వానరసైన్యం. ఒక మహాకార్యాన్ని అకుంఠిత దీక్షతో కొనసాగించే ప్రజా ఉద్యమానికి ఇది వర్తిస్తుంది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య స్వాతంత్ర్య సమర కాలంలో **'రామదండు'** ను ఏర్పాటు చేసి ఉద్యమం చెయ్యడం సుప్రసిద్ధం.

### రామరావణయుద్ధం

రామరావణ యుద్ధం అతిభీకరంగా కొనసాగింది. పురాణాల్లో వర్ణింపబడిన యుద్ధా లన్నింటిలో (ద్వంద్వయుద్ధంలో) సుదీర్ఘమయింది. రామరావణులు ఇద్దరూ అస్త్రశస్త్రాది విద్యలలో ఆరితేరినవాళ్ళు. అహోరాత్రులు క్షణమైనా విశ్రమించకుండా సాగించిన పోరు అది. సుదీర్ఘ కలహం, పోరాటం జరిగినపుడు ప్రయోగింపబడే జాతీయం **'రామరావణయుద్ధం'.**

### అన్నమో రామచంద్రా

రామరాజ్యంలో తప్ప ఇతర ప్రదేశాలలో, ఇతర కాలాలలో తిండికి కరువు ఏర్పడేది. భిక్షాటనం చేసి జీవించేవాళ్ళు, ఒకప్పుడుండి ఇప్పుడులేని దాతల్ని భావించి పలికేమాట. తిండిలేనివాళ్ళను, తిండి సంపాదించలేనివాళ్ళను **'అన్నమోరామచంద్రా'** అని అలమటిస్తు–న్నారని చెప్పడం పరిపాటి.

### ఆత్మారాముడు

ఆకలైనప్పుడు విన్పించేమాట. ఆత్మ అంటే తనను, ఆరామంగా (నివాసంగా)



**'అక్షౌహిణి'** సంఖ్య ఊహించటం సాధ్యం కాదు. పత్తి (యుద్ధ.75-54), గుల్మం (యుద్ధ 84-1) అనే పేర్లు ఉన్నాయి కాని భారత కాలం నాటి సంఖ్యానియమాన్నే సూచిస్తాయా అన్నది సందేహమే. పత్తి అంటే ఒక రథం, ఒక ఏనుగు మూడు గుర్రాలు అయిదుగురు సైనికులున్నది. గుల్మం (పత్తికి తొమ్మిది రెట్లు) ప్రస్తావన వానర సైన్యపరంగా చెప్పబడింది. వానరులకు రథ, గజ, తురగాలను అన్వయించే అవకాశం లేదు. రామ లక్ష్మణుల్ని హనుమంత, అంగదులు తమ భుజాలపై మోశారు.

### మాయాయుద్ధం - ఆకాశ యుద్ధాలు

రాక్షసులు మాయాయుద్ధంలో ఆరితేరిన వాళ్ళు. తాటకి పైకి ఎగిరి అదృశ్య అయి రామలక్ష్మణులమీద రాళ్ళ వర్షం కురిపించింది. ఇంద్రజిత్తు మాయాయుద్ధంలో సాటి లేనివాడు. అతణ్ణి కనుక్కొని పట్టుకోవడానికి అంగద, గవాక్ష, గంధమాదన, హనుమంతుడు ఆకాశంలోకి ఎగిరి అతణ్ణి కనుక్కోలేక క్రిందికి వచ్చారు. రాక్షస మాయల్లో ప్రవేశం ఉన్న విభీషణుడు మాత్రం ఇంద్రజిత్తును చూడగలిగాడు.

ఆకాశయుద్ధంలో రాక్షస, వానరులు ఇద్దరూ నిష్ణాతులు. విశ్వామిత్ర యాగాన్ని ధ్వంసం చెయ్యడానికి వచ్చిన మారీచ సుబాహులు ఆకాశయుద్ధం చేశారు.

ధనుర్విద్య ప్రధానమైన యుద్ధ విద్య. రామాయణంలోని వానర రాక్షస పోరులో వానరులందరికీ ఆయుధాలు వాళ్ళ కాళ్ళూచేతులు, దంష్ట్రాలే.

### ఆయుధాలు

యుద్ధంలో పరిఘలు (ఇనుప కట్ల గుదియలు) శతఘ్నులు, బల్లెములు, శూలాలు, గండ్రగొడ్డళ్ళు, అడ్డకత్తులు, వృక్షాలు, బండలు, కొండశిఖరాలు, గదలు, ముండ్లగదలు, రోకలి బండలు, ధనుర్బాణాలు ఆయుధాలుగా ఉభయపక్ష సైనికులు ఉపయోగించారు.

విశ్వామిత్రుడు తాటక వధానంతరం రాముడికి అనేక దివ్యాస్త్రాలను ఇచ్చాడు. దండచక్రం, ధర్మచక్రం, కాలచక్రం, విష్ణుచక్రం, ఇంద్రాస్త్రం, వజ్రాస్త్రం, మహాశూలం, బ్రహ్మశిరోనామకాస్త్రం, ఐషీకాస్త్రం, బ్రహ్మాస్త్రం మొదలైనవి. మోదకి, శిఖరి, అనే దివ్యమైన గదలు, ధర్మపాశం, కాలపాశం, వరుణపాశం, వారుణాస్త్రం, శుష్కాశని, ఆర్ద్రాశని, శివుడికి సంబంధించి మహాస్త్రం, నారాయణాస్త్రం, శిఖరం అనే పేరున్న ఆగ్నేయాస్త్రం, ప్రధనం అనే పేరున్న వాయవ్యాస్త్రం, హయశిరస్సు అనే అస్త్రం, క్రౌంచాస్త్రం, విష్ణుశక్తి, శివశక్తి అనే శక్తిద్వయం.

రాక్షసులు ధరించే కంకాళం, ముసలం, కాపాలం, కంకణం, విద్యాధరుల నందనం అనే మహాస్త్రం, ఖడ్గం, మానవాస్త్రం, నిద్రను కల్గించేది, పోగొట్టేది అయిన అస్త్రాలు,

సౌరాస్త్రం, వర్షణం, శోషణం, సంతాపనం, విలాపనం అనే అస్త్రాలు, మన్మథుడికి ప్రీతికరమైన మదనం, పిశాచాలకు ఇష్టమైన మోహనాస్త్రం, తామసం, సౌమనం, సంవర్తనం,మౌసలం, విశ్వకర్మ నిర్మించిన సుదారుణాస్త్రం భగదేవతకు చెందిన దారుణాస్త్రం, మనువుకు సంబంధించిన శీతేషువు – ఆ అస్త్రాలన్నీ కామరూపశక్తిగలవి.

శీతేషువు అనే మానవాస్త్రాన్ని మారీచుడిపై రాముడు ప్రయోగించాడు. ఇది శత్రువు స్పృహ పోగొట్టి దూరంగా పడవేస్తుంది.

విశ్వామిత్రుడు శ్రీరాముడికి ఆయా అస్త్రాలను వాటికి సంబంధించిన అధిష్ఠాన దేవతామంత్రపూర్వకంగా ఇచ్చాడు. 49 రకాల ఉపసంహార మంత్రాలనూ అనుగ్రహించాడు. వసిష్ఠుడిపై విశ్వామిత్రుడు 35 రకాల అస్త్రాలను ప్రయోగించాడు. పైన పేర్కొన్న కొన్ని అస్త్రాలతోబాటు గాంధర్వం, స్వాపనం, జృంభణం, బ్రహ్మాపాశం, వైద్యాధర మహాస్త్రం, కాలాస్త్రం, త్రిశూలాస్త్రం ప్రయోగించాడు. **వసిష్ఠుడు** వాటినన్నింటినీ తన బ్రహ్మదండంతో వమ్ముచేశాడు.

అగస్త్యుడు శ్రీరాముడికి వైష్ణవ చాపాన్ని, బ్రహ్మదత్తమైన బాణాన్ని, దేవేంద్రుడు ఇచ్చిన రెండ అక్షయ తూణీరాలను (బాణాలు తరగని అమ్ముల పొదులు), సువర్ణ ఖడ్గాన్ని (అరణ్య. 13/32–34) ఇచ్చాడు.

దేవేంద్రుని వజ్రాయుధం నూరంచులు కలది. రామరావణయుద్ధఘట్టంలో వాళ్ళు పరస్పరం ప్రయోగించుకున్న అస్త్రాల ప్రస్తావన ఉంది.

కుంభకర్ణుడి ఇనుపశూలం వెయ్యిబారువుల బరువున్నది. బారువ అంటే 20 మణుగులు, ఒక మణుగుకు 8 వీసెలు, 1 వీసెకు 11.200 కిలోలు అంటే ఒక బారువు అనగా 224 కిలోలు; 2,24,000 కిలోల బరువున్నది ఆ శూలం. దాన్ని సుగ్రీవుడు భగ్నం చేశాడు. 'క్షురం' అనే ఆయుధాన్ని జటాయువు రాక్షసుడని భావించి ప్రయోగించాలని రాముడు పూనుకున్నాడు. రాముడు గ్రహించిన శస్త్రాస్త్రాలన్నీ యుద్ధసమయంలో ప్రయోగించ లేదు.

***రామో రాజమణిస్సదా విజయతే రామం రమేశం భజే***
***రామేనాభిహతా నిశాచరచమూ రామాయ తస్మై నమః।***
***రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోస్మ్యహం***
***రామే చిత్తం యస్సథా భవతు మే భో రామ! మాముద్ధర॥***

* * * * *

శ్రీః



# శ్రీరామగాథ – భాషలో చోటు చేసుకున్న జాతీయాలు

వాల్మీకి రామాయణంతోబాటు, ఇతర రామగాథల ఆధారంగా పలు జాతీయాలు భాషలో స్థిరపడ్డాయి. జనజీవనంలో విడలేని అనుబంధాన్ని పెంచుకున్నాయి.

## శ్రీరామరక్ష

శ్రీరాముడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ నిమిత్తం అవతరించిన శ్రీమన్నారాయణుడు. ప్రజలక్షేమం తన ప్రధానకర్తవ్యంగా భావించి, అందుకోసం రాజ్యాన్ని, ప్రాణాలను సైతం త్యాగం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ఆయన పాలనలో ప్రజలందరూ సుఖంగా జీవించారు. ఒకనాడు రాముడు సభ తీర్చి ఉండగా వృద్ధ బ్రాహ్మణదంపతులు మరణించిన తమ కుమారుణ్ణి అతని ముందుంచారు. తమ కుమారుని అకాల మరణం గురించి దుః ఖించారు. శూద్రుడైన శంబుకుడు దేవలోకాన్ని జయించటానికై ఉగ్రతపం ఆచరించడం గ్రహించి రాముడు అతణ్ణి సంహరిస్తాడు. ఇంద్రాదిదేవతలు ప్రత్యక్షమై వరం కోరుకొమన్నారు. బ్రాహ్మణ బాలుణ్ణి బ్రతికించమని శ్రీరాముడు కోరాడు. 'నువ్వు ఈ శూద్రుని సంహరించిన క్షణంలోనే బ్రాహ్మణ బాలుడు పునర్జీవితుడయ్యాడు. కనుక మా వరంతో పనిలేదు. నువ్వు సకల శుభాలు పొందగల'వని ఆశీర్వదించారు.

పెద్దలు బ్రతికి ఉండగా పిల్లలు మరణంపాలుకావడం రామరాజ్యంలో లేదని, ప్రజలందరూ దీర్ఘాయుష్షుతో జీవించారని రామాయణం ఫలశ్రుతిలో చెప్పబడింది. పిల్లలకు స్నానం చేయించిన తర్వాత తల్లులు **'శ్రీరామరక్ష–నూరేళ్ళ ఆయుష్షు'** అని దీవించి నీటిని పిల్లల చుట్టూ త్రిప్పి పోయడం పరిపాటి. శ్రీరామరక్ష ఉంటే ఆపదలు దరిచేరవని విశ్వాసం. శంబుకవధ కథ "ఉత్తరకాండ"లో ఉంది.

## రామరాజ్యం

సుభిక్షంగా, ప్రజలందరూ ఎటువంటి ఇబ్బందులకు లోను కాకుండా జీవించగలిగిన రాజ్యం అని అర్థం. అనర్థాలు,ఆపదలు ఏవీ లేకుండా ధర్మబద్ధమైన ప్రజా జీవనం కొనసాగించ గల రాజ్యం. మహాత్మాగాంధీ **'రామరాజ్యం'** లక్ష్యంగా మన పోరాటం సాగాలని ఆకాంక్షించే వారు.

## కుంభకర్ణ నిద్ర

మొద్దునిద్రకు పర్యాయపదంగా వాడబడుతుంది. కుంభకర్ణుణ్ణి నిద్రలేపటానికి ఏనుగులచేత తొక్కించడం, వేలాది రాక్షస వీరుల ముష్టిఘాతాలు, చెవులదగ్గర ఎన్నో వాయిద్యాలను ప్రయోగించడం మొదలైనవి జరగాలి. లేపినా సామాన్యంగా నిద్రలేవని వాణ్ణి **కుంభకర్ణుడిలా నిద్ర** పోతున్నాడు అంటాం.

## అగస్త్య భ్రాత

అగస్త్యమహర్షి సుప్రసిద్ధుడు. ఆయన సోదరుడు గొప్పజ్ఞాని, మహర్షి అని రాముడు ఆయనను దర్శించి ఆశీస్సులు పొందినట్లు ఆయనద్వారా అగస్త్యమహర్షి ఆశ్రమం దారి తెలుసుకున్నట్లు అరణ్యకాండలో ఉంది. కాని వాల్మీకి ఆయన పేరు చెప్పక కేవలం అగస్త్య సోదరుడిగానే పేర్కొంటాడు. అనామకుడు, అప్రసిద్ధుడు, స్వయంగా గుర్తింపులేక పెద్దల పేరుమీద చెలామణి అయ్యే వ్యక్తుల్ని **అగస్త్యభ్రాతలు**గా వ్యవహరిస్తారు. సనత్కుమార సంహితలో అగస్త్య సోదరుడు సుదర్శణుడని పేర్కొనబడింది.

## కబంధ హస్తం

కబంధ రాక్షసుడికి తల, కాళ్ళూ లేవు. యోజనం విస్తీర్ణమైన పొట్ట ఉంది. మిక్కిలి పొడవాటి చేతులున్నాయి. ఆ చేతులకు చిక్కిన ప్రాణుల్ని పట్టుకొని పొట్టలో వేసుకునేవాడు. అతడి చేతులకు చిక్కిన ఏ ప్రాణీ తప్పించుకోవడం అసంభవం. దుర్మార్గమైన పనులద్వారా సర్వం తన సొంతం చేసుకోవడానికి తపించేవాడు. తనకు చిక్కిన వాళ్ళను ఆందోళనలకు గురిచేస్తూ ఉండేవాడు – **'కబంధహస్తం'** ఉన్నవాడు.

## ఉడుత భక్తి

రామసేతు నిర్మాణ సందర్భంలో ఒక ఉడుత రాముడి మీద ఉన్న భక్తిభావంతో సేతు నిర్మాణంలో తానూ తోడ్పడాలనుకుంది. అది సముద్రపు నీటిలో మునిగి తీరంలోని ఇసుకలో పొర్లాడి, దాని శరీరంమీద అంటుకున్న ఇసుకరేణువుల్ని వారధి కడుతున్న చోటుకు వెళ్ళి విదిలించేది. ఇలా క్షణం కూడా అలసత్వంలేక ఉడుత ఆ పనిని కొనసాగిస్తే ఒక చిన్న ఇసుక దిబ్బ ఏర్పడింది. శ్రీరాముడు అది చూసి సంతోషంతో దాని భక్తికి, కార్యదీక్షకు మెచ్చుకొని ఉడుతను దగ్గరికి తీసుకొని తన చేత్తో నిమిరాడట. అపుడు ఉడుత వీపుమీద తెల్లటి చారలు ఏర్పడ్డాయి. ఇప్పటికీ ఉడుతలన్నిటి మీద ఆ చారలుండ టానికి కారణం ఇదేనంటారు.

* * * * *



చేసుకున్నవాడు ఆత్మారాముడు. సర్వగుణదోషాలు మనలోనే ఉన్నాయి. మన ప్రాణం, జీవమే ఆత్మారాముడు, జఠరాగ్ని చల్లబడితే (ఆకలి తీరితే) ఆత్మారాముడు సంతృప్తి చెందాడని చెప్పడం జరుగుతుంది. మనలో ఏ సత్యం నిత్యమూ జాగృతమవుతూ ఉంటుందో, ఏ స్వచ్ఛమైన అంతఃకరణం ఆత్మానుభూతిగా జీవుడి అనుభవంలో నివసిస్తున్నాడో అది రామతత్త్వం. అతడే **ఆత్మారాముడు.**

## ఉద్యోగ రాఘవుడు

రఘువంశంలో జన్మించినవాడు రాఘవుడు – రఘురాముడు. ఉద్యోగం అంటే ప్రయత్నం. రాక్షసవధ నిమిత్తం నిరంతరం రాముడు చేసిన ప్రయత్నాల వలెనే, కార్యసాధన కోసం అందరి సహాయసహకారాలను పొందోవాడు. పనిపూర్తయ్యేంతవరకు విశ్రమించని వాణ్ణి ఉద్దేశించి చెప్పేమాట– **'ఉద్యోగ రాఘవుడు'**.

## ఇక్ష్వాకుల బారసాల

చాలాకాలం క్రితం జరిగిన విషయం అనటానికి ఈ జాతీయం వాడటం కద్దు. **ఇక్ష్వాకుల బారసాల** నాటి విషయం అని, **మాంధాత కాలం** నాటి విషయం అని, **జాంబవంతుడి కాలం** నాటి విషయం అని సమానార్థకాలలో వాడుతుంటాం.

ఎన్నడో జరిగిన దేవాసురుల యుద్ధంలో (కృతయుగం) పాల్గొన్న జాంబవంతుడు రామాయణకాలంలో (త్రేతాయుగంలో) సుగ్రీవుడి మంత్రిగా వ్యవహరించి, కృష్ణావతార సమయంలోను (ద్వాపరయుగం) జీవించి శ్రీకృష్ణుడికి తన కుమార్తె జాంబవతినిచ్చి వివాహం చేశాడని పురాణాల కథనం. సుదీర్ఘకాలం ఆరోగ్యవంతంగా జీవించాడు కనుక **జాంబవంతుడి ఆయుష్షు** అని పేర్కొనడం ఉంది.

## సంపాతి జటాయువులు

సీతాపహరణ సందర్భంలో రావణుడితో యుద్ధంచేసి ప్రాణాలు పోగొట్టుకున్నవాడు జటాయువనే పక్షిరాజు (గ్రద్ద). అతడి అన్న సంపాతిని సీతాన్వేషణ సందర్భంలో వానరులకు తోడ్పడినవాడు. ఇద్దరూ సుదీర్ఘకాలం జీవించినవాళ్ళు. చాలాపాతకాలం నాటి వాళ్ళు అనటానికి సంపాతి జటాయువులు అని వ్యవహరిస్తారు.

## ఋశ్యశృంగుడు

(బాలకాండం) అడవిలో పుట్టి పెరిగి, మహర్షులను తప్ప మరెవరినీ చూడని అమాయకుడు. అతడి రొమ్ముమీద ఒక కొమ్ము ఉండేది. తన రాజ్యంలో వర్షాలులేని కారణంగా మంత్రుల సలహామేరకు నాట్యకత్తెల్ని ఋశ్యశృంగుని తీసుకురావటానికి పంపాడు. స్త్రీముఖం ఎరుగని అతడు వాళ్ళకున్న రెండు కొమ్ముల్ని (వక్షోజాలను) చూసి

వాళ్ళ వెంట రాజ్యానికి వస్తాడు. స్త్రీ విముఖుడు, స్త్రీ ముఖం ఎరుగని వాడనే అర్థంలో వాడటం జరుగుతుంది. కొన్నిసందర్భాలలో విపరీతార్థంలోనూ వాడటం ఉంది.

## కాలనేమి జపం

(ఇది ఆధ్యాత్మ రామాయణం-యుద్ధకాండలో ఉన్న కథ). సీతాపహరణ ఘట్టంలో మాయలేడి వేషం ధరించిన మారీచుడి పుత్రుడు కాలనేమి. రామరావణయుద్ధంలో రామ లక్ష్మణులు మూర్ఛిల్లినపుడు జాంబవంతుడి సలహామేరకు ఔషధాలకోసం హనుమంతుడు ద్రోణగిరికి పయనమయ్యాడు. గూఢచారుల ద్వారా ఈ విషయం తెలుసుకున్న రావణుడు చంద్రహారం బహూకరిస్తూ కాలనేమిని ముని వేషంలో ద్రోణగిరి మార్గంలో ఆశ్రమం నిర్మించి, ఆంజనేయుణ్ణి ఆకర్షించి, దారి తప్పించి సమీపంలోని సరస్సులో స్నానం ఆచరించేటట్లు చెయ్యమంటాడు. మారీచుడులాగానే కాలనేమి హితం చెప్పి, ప్రయోజనంలేక అందుకు అంగీకరిస్తాడు.

ద్రోణగిరిమార్గంలో హనుమంతుడికి దాహం వెయ్యగా నీటికోసం వెతికినపుడు కాలనేమి మహర్షివేషంలో జపం చేస్తూ కన్పించాడు. హనుమంతుడు అతణ్ణి ద్రోణగిరికి దారి అడిగితే తన శిష్యులద్వారా సరస్సులోని నీళ్ళు త్రాగితే అపారమైన శక్తివస్తుందని, అందువల్ల కార్యసాధన సునాయాసం అవుతుందని చెప్పిస్తాడు.

ఆంజనేయుడు విశ్వసించి సరస్సులోకి దిగాడు. అందులో శాపగ్రస్తురాలైన ధ్యానమాలిని అనే అప్సరస మొసలిరూపంలో ఉంది. నీటిలో దిగగానే హనుమంతుణ్ణి పట్టుకుంది. హనుమంతుడు ఆ మొసలిని చంపగానే ఆమెకు శాపవిమోచనం కలిగి తన పూర్వరూపంలో కృతజ్ఞత చెప్పి, కాలనేమి వంచనను తెలియజేసింది.

హనుమంతుడు కాలనేమిని వధిస్తాడు. పై పై వేషాలతో మోసగించేవాళ్ళను, పైకి సాధువుల్లా ప్రవర్తించి లోకాన్ని నమ్మించి మోసగించేవాళ్ళను **'కాలనేమి'** అని అంటారు. తప్పుడు పూజాపునస్కారాలతో, జపతపాలను ఆచరించడాన్ని **'కాలనేమి జపం'** గా పేర్కొంటారు. కొంగ జపం వంటిదే ఇది. ఈ రెండూ మోసానికి, మోసగాళ్ళకు పర్యాయ పదాలయ్యాయి.

## రావణ కాష్ఠ

**'రావణ కాష్ఠ'** అంటే **'రావణాసురుడి పాడె'** అని అర్థం. యుద్ధంలో మరణించిన రావణాసురుడికి పాడెకట్టి తగులబెట్టారట. అది నేటికీ మండుతూనే ఉందని నమ్మే వాళ్ళున్నారు. చాలాకాలంగా తేలని కుటుంబ కలహాలు, సుదీర్ఘమైన పోరాటాలు **'రావణకాష్ఠ'** గా వ్యవహరింపబడతాయి.



## సుగ్రీవాజ్ఞ

వానరులకు సుగ్రీవాజ్ఞ మీరలేనిది. సుగ్రీవాజ్ఞ అంటే చండప్రచండమైన శాసనం. పాటించి తీరవలసిన ఆదేశం. ఇలాంటి అధికారం, గౌరవం కలిగిన వ్యక్తిని **'ఆయన మాటంటే సుగ్రీవాజ్ఞ'** అని ప్రశంసాపూర్వకంగా పేర్కొంటారు.

## త్రిశంకుస్వర్గం

రామాయణంలోని బాలకాండలోనేకాక, దేవీభాగవతం (7వ స్కంధం), భాగవతం (9వ స్కంధం) హరివంశం (అధ్యాయం-13), ఆదిపర్వం, సభాపర్వాలలో త్రిశంకు వృత్తాంతం చోటుచేసుకుంది. సశరీరంగా స్వర్గం వెళ్ళటానికి విశ్వామిత్రుడి సహకారంతో ప్రయత్నిస్తాడు త్రిశంకువు. స్వర్గంలోకి ప్రవేశించకుండా ఇంద్రుడు అతణ్ణి క్రిందికి పడదోశాడు. త్రిశంకువు తలక్రిందులుగా పడుతూ విశ్వామిత్రుడితో మొరపెట్టుకున్నాడు. తన తపస్సంతాధారపోసి విశ్వామిత్రుడు అతడికోసం అంతరిక్షంలో ప్రత్యేకంగా స్వర్గం సృష్టించాడు. త్రిశంకువు అటు భూలోకం ఇటు స్వర్గలోకం పొందకుండా ఉభయభ్రష్టుడై వేలాడుతూ ఉన్నాడు. ఎందుకూకాక ఉభయ భ్రష్టుత్వం పొందిన వ్యక్తిని **త్రిశంకుస్వర్గం**లా అతడి పరిస్థితి ఉందని పేర్కొనడం జరుగుతుంది.

## భగీరథ ప్రయత్నం

రామాయణం బాలకాండలోనే కాక భారతం అరణ్యపర్వం, బ్రహ్మాండ, భాగవత, పద్మపురాణాల్లో చోటుచేసుకున్న కథ. తన ముత్తాతల ముక్తికోసం భగీరథుడు బృహత్ ప్రయత్నంచేసి గంగాదేవిని స్వర్గంనుంచి భూలోకానికి తెప్పించి, పాతాళలోకానికి తీసు కెళ్ళాడు. పట్టినపట్టు విడువకుండా గొప్ప ప్రయత్నంచేత ఒక ఘనకార్యాన్ని సాధించగలిగితే దాన్ని **భగీరథప్రయత్నం** అంటాం.

## ఊర్మిళనిద్ర

జానపద గేయాల్లోని స్త్రీల పాటల్లో 'ఊర్మిళనిద్ర' పాట ఒకటి ఉంది. దీర్ఘనిద్ర అనే అర్థంలో ఈ పదాన్ని ప్రయోగిస్తారు. లక్ష్మణుడి భార్య ఊర్మిళ. లక్ష్మణుడు సీతా రాములతో వనవాసం వెళ్తూ 'సూర్యవంశ స్త్రీలు, బావగారు నడిచిన దారిలో నడువరాదు. కనుక నువ్వు అరణ్యాలకు రావటం తగద'ని ఊర్మిళను అంతఃపురంలోనే ఉండమన్నాడు.

సీతారాముల్ని కంటికిరెప్పలా కాపాడుతూ సేవలుచేస్తూ కఠోరదీక్షతో ఉన్న లక్ష్మణుడి ముందు నిద్రాదేవి ప్రత్యక్షమయింది. అప్పుడు అతడు **'తల్లీ! నా మీద దయపెట్టి, పధ్నాలుగేళ్ళు నా దరిచేరకు. నాకు బదులు అయోధ్యలో ఉన్న నా భార్య ఊర్మిళను ఆవహించు'** అని ప్రార్థించాడు. అలా పధ్నాలుగేళ్ళు నిద్రలో మునిగిన ఊర్మిళను లక్ష్మణుడు అయోధ్యకు వచ్చిన తర్వాత లేపారు. లక్ష్మణుడి ఆనవాళ్ళు చెప్పి, అతణ్ణి ఆమెకు చూపించిన తర్వాత కాని, అతణ్ణి గుర్తించలేదని పాటలోని సారాంశం.